శా॥ స్త్రీరత్నంబులు, భారతీ భవవధూ శ్రీలట్టి వారల్ మహా
ధీరల్ స్వార్థవిదూర లార్య లనురక్తిన్ మాతృదేశార్చనా।
ప్రారంభంబుల నష్టకష్టముల పాలైనారటా బందెయే।
స్వారాజ్యంబట గంజియేయుట సుధాప్రాయంబహో వారికిన్॥

స॥ కృ॥ మూర్తి.




# శ్రీమతి చుండూరు రత్నమాంబగారు

తే॥ గీ॥ ప్రాణిలోకంబు సంసారపతితమగుట
వసుధపై గిట్టి పుట్టని వారు గలరె?
వారిజన్మంబు సఫల మెవ్వారివలన |
వంశమధికోన్నతి వహించి వన్నెకెక్కు ॥

భర్తృహరి.

"ధీరచరిత్రసంపద లసంఖ్యాత ప్రభావోన్నతు"లనియు నాయోగివరుఁడు, భర్తృహరి, చెప్పియున్నాఁడు గదా! దుర్లభమైన నరజన్మము నొందినందుకు ధర్మార్థకామ మోక్షములను పురుషార్థములను సాధించుటయే ప్రయోజనమని యెఱిఁగి దేశకాలోచితముగ దేహయాత్ర సాగించినవారే ధన్యులు. అటుగానినాడు "పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా"యనుకొని నిట్టూరుపు విడువవలసినదే! మన యీ యార్యభూమి కెందరో వచ్చిరి యెందరో పోయిరి. వారిని మనము తెలియము. తెలిసికొంటకుఁ బ్రయత్నమును గూడఁ జేయము. కాని "యసంఖ్యాత ప్రభావోన్నతములగు ధీరచరిత్ర"లను మాత్రము ప్రత్యాసక్తులమై తరచుగాఁ దడవుచున్నాము. మనల నింతవరకు నుజ్జీవింపఁ జేయుచున్న వీ దివ్యచరిత్రలే! ఇట్టివి, లేకయుండిన మన యార్యజాతీయత యేనాఁడో నశించియుండెడిదే. కాని దేవుని ధర్మమా యని అది యట్లు కాలేదు. "ధర్మగ్లాని" కలిగినప్పుడు తమ ప్రాణములనైన బలిపెట్టు ధీరులు, ధర్మమునకు రక్షపెట్టిరి. మనదేశమున కిపు డే మాత్రపు జీవకళయున్నను ఆధర్మము మూలముననే. కాలవశమున

ఘోరమైన ధర్మసంకటము పుట్టి ఆసేతు హిమాచలపర్యన్త మార్యావర్తమెల్ల అట్టుడికినట్లుడుకుచుండు. నట్టియెడ నెందరెందరెటువంటెటువంటి వారెన్నెన్ని కష్టములు పడినారో మనమెరుగము! వారి ఋణము మన మెట్లు తీర్పగలము? అందుఁ బురుషుల మాట యటుండనిండు: స్త్రీలు, అగర్భ శ్రీమంతురాండ్రగువారు, తామరతంపరల వంటి సంసారములు గల యిల్లాండ్రు, సర్వసంగపరిత్యాగినులై "అష్టకష్టాలూ మాల పాలలూ" పడివచ్చుట జూచి నెవరి కంట నీరు గారకుండును? స్వరాజ్యము రానీ లేక రాకపోనీ—కాని వారి యుదంతములు మాత్ర మాచంద్రతారార్కములై ముందుతరముల వారి యుత్తమగతులకుఁ గారణములై యుండకమానవు.

అట్టి యుత్తమోదంతములలో నొకటియే యిది. ఇందు జెప్పఁబడనున్న జమీన్దారిణి శ్రీమతి చండూరు రత్నమాంబగారి నాంధ్రలోక మొక కొంతవర కెరిగియే యున్నది. ఈయమ యార్యవైశ్యకుల సంజాత. తన కులవిభూతులఁగూర్చి యీమె యెంత యభిమానము గలదియో చూడుఁడు:—

"దుర్మార్గుఁడగు విష్ణువర్ధన భూపతి (మన కుల సంజాతయగు) వాసవికన్యను గాంచి మోహాతురపరుఁడై బలాత్కారముగా జెఱబట్ట నెంచెను. దుర్మార్గునిఁ జేపట్టుటకంటె నగ్నిహోత్రమునఁబడి చచ్చుట మేలని తలంచి వాసవికన్య తన దేహమును అగ్నికి సమర్పించెను. (అట్టి) యామెయే మన కుల దేవత! రాజు దుర్మార్గుఁడైనప్పుడు అసహాయ యోగమొనరించి, శాన్తముగఁ దనదేహ మర్పించిన యామె త్యాగము, స్వధర్మదీక్షయు, మన కాదర్శములు......మన మట్టి కులమున జన్మించితిమి."

నిజమే! ఒక్క యామెకే కాదు. ఆంధ్రదేశమున కంతటికిని కీర్తి దెచ్చినది ఆనాటి యార్యవైశ్యుల మహాత్యాగమే. ఇట్టి విషయమున నామె కభిమాన ముండుట వింత కాదు. మరియు నిట్టి మానినీమణి యెడ మన మభిమాన పడుటయు వింతగాదు.

కాకినాడలోనున్న యార్యవైశ్యకుటుంబికులలో పైడావా రొకరు. వీ రఖండైశ్వర్యవంతులు. జమీందారులు. కీ॥ శే॥ రామకృష్ణయ్యగారు, కీ॥ శే॥ వీరేశలింగము పంతులుగారికి కుడిభుజమై, చేసియుండిన సహాయము, నాంధ్రలోక మెన్నటికిని మరువజాలదు. అట్టివారి కుమారులే రా॥ బ॥ వెంకటచలపతిగారు. సర్వవిధముల తండ్రిని మించిన కుమారు డనిపించుకొని యీవదాన్య చక్రవర్తి, కీర్తికాయముతో తెనుంగు సీమల విహరించుచుండును.

ఇట్టి మహనీయుని తనయయే మన యీ సోదరీమణి, శ్రీమతి రత్నమాంబగారు. ఈమె జననము సం॥ 1893 రమున. నాగరకతావిశిష్టమైనయిట్టి కుటుంబమున జన్మించుటవలననే యీమెకు చదువును, సంగీతమును, సంస్కరణాభిలాషయు, ధర్మకర్మానురక్తియు, జాతీయతాభావయుక్తియు, దేశారాధనాశక్తియు నుగ్గుపాలతో పట్టబడినవి. ఇట్టి కన్యకామణికి అనురూపగుణవంతుడగు భర్త లభించుట పూర్వపుణ్యవిశేషమే కాని మరియొకటి కాదు. శ్రీయుత చండూరు శ్రీ

రాములు శ్రేష్ఠిగారికి కన్యకామణిని సం॥ 1901 రమునం బెండ్లియాడిరి. వీరి తాత తండ్రులు దేవాలయములను గట్టించి సత్రములను బెట్టించినవారే. శ్రీరాములుగారు ఏకేశ్వరోపాసనాసక్తిపరులై యుండుట యొక విశేషాంశమే యనవచ్చును. దీనికి గారణ మప్పటి వీరేశలింగపండిత మతబోధ లీ యువకుని చెవి సోకియుండుటయే యనవచ్చును. సంసారయాత్రయందు బడి తన చదువునకును తన మహాశయములకును తిలోదకములీయక యీ యిల్లా లుత్సాహవతియై హిందీ సంస్కృత భాషలయందు మంచి పరిజ్ఞానము సంపాదింపగలిగెను. ఆంధ్ర భాషయందు ప్రశంసాపాత్రమైన వక్తృతాశక్తి గడించి, బెజవాడ, రాజమంద్రి మొదలగు పెద్ద పెద్ద పట్టణములయందు జరిగిన మహిళామండల వార్షికోత్సవములయం దగ్రాసన మలంకరించెను. ఈయమ యుపన్యాసములు కేవల వాగాడంబరభూయిష్టములు గాక మంచి మంచి విషయములతో నిండియుండును. ఇవి స్త్రీలేగాక పురుషులును చదువదగియున్నవి. ఈమె వేదికపై నిలచి యుపన్యసించుచున్నపుడు చూడగలుగుట యొకభాగ్యము. మరియు,

"మన ఆంధ్రదేశములో విద్యావ్యాప్తికొరకు కొన్ని జాతీయవిద్యాలయములున్నను, అందు శారదానికేతనము, వైశ్యసేవాసదనము అగ్రస్థానము నలంకరించినవి. మొదటిది జాతి మత కుల భేదములకు తావీయక ఉదారపద్ధతులమీద నిర్వహింపబడుచున్నది. సంకుచితభావముల కిందు తావులేదు. దేశకాలపరిస్థితుల ననుసరించి జాతీయపద్ధతులపై శారదానికేతనమును ప్రశంసనీయముగ నడుపుచున్నారు. మనవాడలలోను, గ్రామాదులలోను పట్టణవాసములలోను మన సంఘములలోను, ఉద్యోగములలోను, పదవులలోను, స్థానిక సంస్థలలోను, కులభేదపిశాచము తలవిరియబోసికొని యథేచ్ఛగా నృత్యము సేయుచున్నది. రెడ్డివసతిగృహము, కాపువసతిగృహము, కమ్మవసతిగృహము, వైశ్య వసతిగృహము, నియోగిఫండు, వైదికఫండు అను పేర్లు పెట్టి కులములరీత్యా మనము వేరైనట్లే, విద్యాసంస్థలలోగూడ ఈ కులభేదమనెడి వేరుపురుగును మన నాశనముకొరకు పోషించుచున్నాము. మన జాతీయాదర్శములకు కులము లడ్డుతగులగూడదని నా విన్నపము.

ఈ మహాప్రతిష్ఠాపన నెలకొల్పిన దానకర్ణులగు శ్రీ నాళం రామలింగయ్య శ్రేష్ఠి గారికిని, దీనిని నిర్వహించుచున్న విద్వాన్ బత్తుల కామాక్షమ్మగారికిని నా వినయపూర్వకవందనములతో ఈ సంగతులు మనవి చేయుచున్నాను. మనము కులకక్షలకోటను జయించవలెను. జాతి మత కుల వివక్షతలేక యెల్ల మానవులు సరస్వతీదేవి నుపాసించుట కవకాశము నీయవలెనని మనవి చేయుచున్నాను."

అను నీవాక్యములు మన యీ సోదరీమణి, రాజమహేంద్రనగరమున వెలయు వైశ్యసేవాసదన వార్షికోత్సవమున నగ్రపీఠము నలంకరించినపుడు చెప్పబడినవి. ఇందు చేయబడిన సూచనలవలన, నీసంస్థయం దెంతయో మార్పుగలిగినది; అది యటుండ నివి,యామె హృదయధర్మమును,అద్దము ముఖమునువలె, ప్రతిఫలింప జేయుచున్నవి. ఇట్టి యభేదబుద్ధియు నిట్టి ఋజువర్తనమే స్వరాజ్యసంపాదనమునకు ముఖ్యసాధనములు. శ్రీమతి కమలానాథ ఛటోపాధ్యాయిగారు ఏలూరు

నకు వచ్చియుండినపుడీ యిల్లాలామెను తనయింట నతిథిగా గ్రహించి యామెను గౌరవించుటకై యొక కాస్మాపాలిటన్ విందును జేసెను. అనేక వితంతూద్వాహముల కీమె కారకురాలై యున్నది.

మనుమలనెత్తిన యీడువచ్చియు స్వదేశీయుద్యమమున బడి యారునెలలు చెరనుండి వచ్చుటయే యీమెకుగల దేశారాధనాతత్పరతకు ప్రబల నిదర్శనము. "నా కులదేవతయగు కన్యకాపరమేశ్వరియే నా జీవితమునకాదర్శము" అని యీమె యింటను బయటను న్యాయస్థానములయందును బలుకుచున్న మాట నేతిబీరకాయ కాదు. 1931 వ సంవత్సరమున వచ్చియుండిన గోల్లేటి వరదలకు బాల్పడిన దీనుల నుద్ధరించుటకై ఈమె వందలకొలది యిచ్చుటయే గాక యింటింటికినిబోయి బియ్యము, పప్పు, ఉప్పు, మొదలగు పదార్థములను దండి, తెచ్చిపెట్టెను.

"మనము నేర్పు చదువులు, మనము సంపాదించు ధనము, మనము చేయు పూజాపురస్కారములు భజనలు చాలవరకు స్వార్థమునకే వినియోగించుచున్నాము కాని విశ్వకళ్యాణమునకై వినియోగించుటలేదు"

అని యీ సాధ్వి తన హృదయవేదనను పలుచోట్ల బహిరంగముగ వెలిబుచ్చుచునంతతో తృప్తినొందియుండక సాధ్యమైనంతవరకా లోపము సవరించుకొనబూని తన బుద్ధిబలమును దేశీయులకై వినియోగించుచుండు ననుట యథార్థము. దేశమున కుపయోగకరమగు నే ధర్మసంస్థయైనను ఈ శ్రీమంతురాలిచేతి భూరివిరాళమునుబొందక యుండలేదు. సత్రములు నెలకొల్పబడినవి. చావడులు స్థాపింపబడినవి. ఒక పెద్దపుస్తకభాండాగారముతో నొక యువతీజనపఠనాలయమును, క్లబ్బును అచిరకాలమున నేలూరు పట్టణమునందు నెలకొల్పబడనున్నవి. భరతఖండమునగల సమస్త తీర్థయాత్రలను సేవించి సర్వ ముఖ్యపట్టణములను దర్శించి సంపాదించిన జ్ఞానానుభవములను తన దేశస్థుల కొరకై వినియోగింప నెంచి యీ విదుషీమణి దేశమున జరుగుచుండు సభలకుబోయి మహోపన్యాసములను గావించి తన సోదర సోదరీమణుల నలరించును.

ఇంత యుండియు నీమె యావంతయైన గర్వము నొందకుండుట దేశీయుల యదృష్టము. ఎంతటి పేదవానినైన ప్రియమార "అన్నగారూ" యని పిలచి నవ్వుచు మాటాడుట, యీ యజమానురాలికి స్వభావ సిద్ధమగు గుణము. ఆడంబర మనునది యావంతయు లేక యీ యాగర్భ శ్రీమంతురాలొక పేద ముత్తైదువవలె నుండును. ఈ సౌభాగ్యవతి, ప్రజల కర్తవ్యము—అనగా తనవంటి శ్రీమంతులగు ప్రజల కర్తవ్యము—గూర్చి చేయుచున్న యుపదేశవాక్యముల నిట దెల్పుట యప్రస్తుతము కాదు. చూడుడు:—

"భారతీయు లేబది సంవత్సరములవరకు దైవమును స్మరించుట కట్టిపెట్టవలయునని స్వామీ వివేకానందులవారు చెప్పిరి. ప్రతియూరను దేవాలయములనేకములుండ ప్రతి పట్టణవాసమునను అనేక సత్రములు నిర్మింపబడియుండ, ముఖ్యముగా మన వైశ్య



ఆంధ్రయువతీ సంస్కృతకళాశాల వార్షికోత్సవాధ్యక్షురాలు

శ్రీమతి చుండూరు రత్నమ్మగారు

రాజమండ్రి. 30-3-33.



కీ॥ శే॥ శ్రీమతి విఠలదేవుని లక్ష్మమ్మగారు

ఈయమ జీవితసంగ్రహ మిందు బొందుపరుపఁబడియున్నది.

లలోను ఇతర కులములలోను దేవాలయ ప్రతిష్ఠాపనా సత్రనిర్మాణముల పిచ్చి మనవారి కింకను వదలలేదు. ఈ దేవాలయములును సత్రములును కపటభక్తులకును సోమరులకును నిలయము లగుచున్నవి. ప్రస్తుతము ఈ పనులు కట్టిపెట్టి భారతజాతీయ నిర్మాణమునకు పూనుడని భూస్వాములను శ్రీమంతులను మన వర్తక సంఘములను ప్రార్థించుచున్నాను. మన యాంధ్రులు కార్యశూన్యులు. కుప్పక్రియులు. దేశములో చెప్పదగిన ఒక్క ప్రతిష్ఠాపనకూడ జాతీయచిహ్నముగ గాన్పించుట లేదని విచారముతో మనవి చేయుచున్నాను."

ఈ మాటలు పరమసత్యములు. తన వారి లోపమును చక్కబరచుటయందు ఈ యమకు పట్టుదలమెంసు. ఈ యుపదేశములు సవ్యముగా గ్రహింపబడునేని కొలది కాలములోనే దేశమెంతయో బాగుపడుననుటకు సందేహములేదు.

"మన దేశమునందు స్త్రీలను పురుషు లంతగా గౌరవించుటలేదు. ఇట్లని పురుషుల నిందపరచుట కాదు. కాని భగవద్సృష్టిలో నుభయులును సమానులే యని తెలుపుటయే నా యాశయము."

అని యామె చెప్పుటయే కాక ఆంధ్ర రత్న యువజనసంఘమునకు నధ్యక్షురాలై వీరవనిత యని యెంతయు కొనియాడబడుచున్నది. పతిసేవ, దైవభక్తి, మొదలగు సుగుణము లెన్నియో యీ సతీమణికి పెట్టని నగలు. విజయవాడలోనున్న యువతీజన ప్రార్థనాసమాజపు వార్షికోత్సవమున కధ్యక్షురాలై యీమె యిచ్చిన యుపన్యాసమును ఇంక నితరములగు నుపన్యాసములును సత్య సంశోభితములై జ్ఞానదాయకములై మార్గదర్శకములై యున్నవి. మరియు సంగీతము కుట్టుపని, పాటలు పద్యము లల్లుట, వంట మొదలగు పనులయందును గూడ మంచి సమర్థతకలిగి, బద్ధకమనునది లేక సర్వదా పాటుపడుచు మనుమల తల్లియై యున్న యీ యుత్తమకుటుంబిని, పుట్టిన యింటికిని మెట్టిన యింటికే కాక ఆంధ్రదేశమునకును ఆర్యవైశ్యకులమునకును వన్నె దెచ్చుచు జీవితమును సార్థకపరచుకొనుచున్నది. భర్తనుబట్టి యీమె యథార్థ సీతారత్న మనబడుచున్నదియో లేక యీమెనుబట్టి భర్త యథార్థ శ్రీరాములై యొప్పెనో చెప్పలేము గాని యీ దాంపత్యము మాత్రము సీతారామ దాంపత్యమని లోకముచే కొనియాడబడుచున్నది. వీరి కిరువురు పుత్త్రికలుగలరు. వారడయారులో దివ్యజ్ఞానసమాజ పాఠశాలయందు విద్యాభ్యాసమొనరించి ప్రశంసా పాత్రమగు లలిత కళాభినివేశమును గడించియున్నారు.

సార్థకగృహలక్ష్మియగు మన సోదరీ రత్నమాంబగారు పలుతావులయందు "కారే రాజులు! రాజ్యముల్ గలుగవే" యను భాగవతపద్యమును జదువుచుండుట వట్టి యార్భాటము కాదు. "యశః కాము"లై యీశ్వరదత్తమగు నర్థమును సద్వినియోగము చేయుటయం దీ శ్రీమతి యగ్రగణ్య యనబడుచున్నది. సర్వతోముఖప్రశస్తి గల యీ శిష్టకుటుంబిని యీశ్వరానుగ్రహము వలన సంతతసుమంగలియై యిట్లే పెద్దయుం బ్రొద్దు మనుగాత!!! (సు॥ కృ॥ మూర్తి.

# మాతృ వందనము

[శ్రీ శేషాద్రి రమణకవులు]

పుత్రులకునయి యెన్నెన్నొ భూములరిగి
మ్రొక్కరానట్టివేల్పుల మ్రొక్కిమ్రొక్కి
యేఁగఁగారాని భూముల కేగియేగి
తల్లి నీవొందినశ్రమంబు దలఁచికొన్న
హృదయము ద్రవించు, నెట్లు భరించితీవు!
నేను గర్భంబునం బడ్డ నిముసమాది
ఘోరతరమైన వేవిళ్లఁగుంది కుంది
త్రాణ చెడ వాడి వగ్గయి తాపమొంది
అన్నమును నీరు విడనాడి యలసి సొలసి
పుత్రసందర్శనము గోరి పోవనీక
ప్రాణముల నిల్పుకొన నెంత బాధపడితో!
కుక్షిలోనున్నతఱి వెతల్ గుడిచి కుడిచి
పిండమవియునో యను పెద్దభీతితోడ
వ్యాధులకు నోర్చి మందుల వదలివేసి
అమ్మ! నీవొందిన శ్రమంబులరసి నంత
నిలువు నీరగుచుందును నిశ్చయముగ.
గర్భమున నున్నతఱి పదాఘాతములను
విరివిగ నొనర్చి నిను శ్రమపెట్టినాఁడ,
నెలలు నిండిన కొలఁది నీ నిఖిలరక్త
సారమును బీల్చి నిన్ను నిస్సారఁజేసి
పెరిఁగిన కొలంది నిను శ్రమపెట్టినాఁడ.
జనని! దుర్బల వీవెట్లు సైచినావు
గర్భ విస్తృతి నన్యులు గాంచిరేని
దృష్టి సోకునో యను చింత దిటవు పఱచి
గడప కదలక గర్భరక్షణ మొనర్చి
వ్యాధితోనుండి పిండ మేమౌనొయంచు
నాశయంబున వగచి యహర్నిశములు
అతులిత దరిద్రతాదోష మలమికొనఁగ
కఱవుచే లేమి యింటిలోఁ గ్రమ్మికొనఁగ
నన్నుఁ గనుటకు నెన్ని బన్నములఁ బడితో!
ప్రసవ వేదనమున కెట్లు బ్రతికినావు
వ్యాధి బాధల కేరీతి వగచినావు
ప్రతిఫలాపేక్షయును బూర్వ పరిచయంబు
లేనియా వ్యాజకరుణా నిధానవైన
నీకు నెట్లు కృతజ్ఞతనే వచింతు!
సౌఖ్యములకయి పడితినీ జఠరమందు
నేను, శ్రమలకుఁ గంటివి నీవు నన్ను.
ఎన్ని జన్మంబు లింకముం దీశ్వరుండు
ఎన్నిగతులఁ బ్రసాదింప నున్నవాఁడొ
అన్నిఁటను నీవు నాకు ముందమ్మవగుమ
కొడుకునై నీకు జనియింపఁ గోరుకొందు
ఈనిరర్థకజీవి నాకేల యంచుఁ
గరుణ విడనాడఁ బోకమ్మ కన్నతల్లి
హృదయపూర్వకముగను నర్చింతునిన్ను
నిరతము స్మరింతు నీపాద నీరజములు

**వందేమాతరమ్.**



# విశ్వరూపగృహలక్ష్మి

శ్రీమతి వోరుగంటి శ్యామలగారు

శ్యామల:—అమ్మా! గృహలక్ష్మి అక్కయ్య రాత్రివచ్చి నా మంచంమీద కూర్చుని నాతో మాట్లాడిందే.

పార్వతమ్మ:—యేం చెప్పిందమ్మా?

శ్యామల:—"చల్లాయ్! చూశావ్! నీవు నన్ను ప్రేమతో నెల్లప్పుడు తలుస్తున్నావు గనుక నేను మళ్లీ నీ వద్దకు వచ్చాను. నే నెవరినో బాగా తెలుసుకోవా లనుకుంటున్నావు గాన చెప్తాను విను. నేను ఆదిశక్తిని. దుష్టులను శిక్షించుట, శిష్టులను రక్షించుటయే నాపని. నా కంటె కనపడని దేదీ లేదు. నేను చేయలేని దేదీ లేదు. బ్రహ్మకు సృష్టించుటలో తోడు నీడనై నదానను నేను. విష్ణువుకు రక్షించుటలో చేయూత నిచ్చెడుదానను నేను. ఈశ్వరునకు అర్థాంగినై చంపుటలో సహాయము చేయుదానను నేను. ప్రత్యక్షమే నిజము గాని పరోక్షము "అదేమో" అను పాశ్చాత్య సిద్ధాంతము ననుసరించి 'రామునకు కోతులు సహాయమా' అన్న చర్చ భారతదేశములో కూడా ప్రబలిన వద్దనుంచీ, నా ప్రభావము చూపుటకు అనేక వేల యకరముల భూమి ఆక్రమించి, నిస్సారవంతముగా జేసిన బ్రహ్మాండమయిన బ్రహ్మచెముడును, రావణ తలలవలె యెన్ని మార్లు నరికినా తిరిగి మొలిచెడు బ్రహ్మచెముడును, దిగంత విఖ్యాతిజెందిన ఆంగ్ల ప్రభుత్వము ధనవ్యయముతో నిర్మూలము చేయలేని బ్రహ్మచెముడును, చోరులకు, దుష్టజంతువులకు ఆటపట్టయిన బ్రహ్మచెముడును అణుమాత్రము లయిన పురుగులతో నిర్ధూమ ధామముచేసి రామాయణమే గాక భారత గాధలన్నియు నిజమని నిర్ధారణ చేసినదానను నేను. "ఏ దేశం తప్పుత్రోవలో బడితే ఆ దేశాన్ని వుద్ధరించడమే నా పని. కొన్ని సంవత్సరాల క్రిందట వంగదేశీయులు, వారి స్వశక్తిని కోలుపోయి, (బారాబంగాలీ మిల్కే- బకిరీకా ఖాన్ నహీంకా ఉన్నసఖా) "పంద్రెండుగురు బంగాలీయువకులు కలసి వక మేకచెవిని కోయలేక పోయిర"న్న అపఖ్యాతికి లోబడ్డారు. పాశ్చాత్య నాగరికతా మహాత్మ్యముచే వంగమాతను మరచిపోయారు. వారి అవస్థను జూచి సహించలేక అక్కడ "కాళీమాయి"నై వారిని నిరంతర కాళీపూజా ధురంధరులుగాను, సహజ ధైర్యవంతులుగాను, స్వశక్త్యోత్పన్న వస్తుధారణప్రియులుగాను, దేశభక్తి పరాయణులుగాను

చేశాను. సరస్వతీ రూపముతో అమృత మును చేబట్టి "అమృత బజారు"న్న పేరుతో మెన్నో సంస్థానముల నుద్ధరించాను. ఇంకా అక్కడ సవరించవలసిన పను లనేక మున్నాయ్. కాని, ఆంధ్రులు, తమ స్వశక్తిని మరుచుట; నిత్యపూజలు మానుట; దేశాభిమానము వదలుట; ఆంధ్రులన నెవరో తెలియని వేషములను ధరించుట చూడగా, నా మనస్సు చలించి, వీరిని సరియగు దారిని పెట్టవలె నన్న ఉద్దేశ్యముతో ఆంధ్రదేశ ప్రచారము చేయుచున్నాను.

శ్యామల:—'కాళీమాయి'వి కూడా నీవే అయితే, ఆ పుర్రెల తావళం, ఆ యెర్రని రక్తపునోరు, ఆ భీకరాకారం యేవీమరి?

గృహలక్ష్మి:—"అయ్యో! చెల్లాయ్! నేను నా నిజవాహనమగు కేసరినెక్కి నా కుటీరము లోనే వుండి, నిశ్చలత్వముతో నా దృష్టులను దేశమం దంతటను ప్రసరింపచేసి, తప్పొప్పులను కనుగొనుచున్నాను. ఆంధ్ర పురుషలోకము నేనెరగనిదికాదు. వా రిదివరలో దేశ స్వాతంత్ర్యమునకై పోరాడిన పోరాటములు; కవీశ్వరులకు చేసిన మర్యాదలు; స్త్రీల యందు జూపిన గౌరవము, జాతి, కుల వ్యత్యాసములు లేక, ఆకలిగొన్న వారికి చేసిన అన్నదానములు; వారు చేసిన యజ్ఞాదిక్రతువులు; దేవపూజలు; నేను మరచితి ననుకొన్నావా? లేదు. ఆంధ్ర పురుషులునిరంతరమంత్రదీక్షాపరాయణు లగుటచే, వారు ఇదివరకే నా శక్తి సామర్థ్యములను కనుగొని యున్నారు. అందుచే వారికి నా నిజస్వరూపము జూపనక్కరలేదు, గాని వీరు ఇప్పుడు తమ స్వశక్తులను కాలికసంబంధముచే మరచిరి. అయినను "వీరా రింతటి" వారని చెప్పిన మాత్రమున, అంజనేయునివలె వెంటనే వారి నిజశక్తులను జ్ఞాపకమునకు తెచ్చుకొన గలిగినవారు. ఇక ఆంధ్ర స్త్రీలోకమా—కేవలము ఆ పతిపూజలకు, ఆ లక్ష్మిపూజలకు, ఆ గోపూజలకు, ఆ గృహపూజలకు, ఆ మాతాపితృపూజలకు అలవాటు పడినది. ఆది నుంచీ, నిత్యకల్యాణములతోను, పచ్చతోరణములతోను, అతి సౌందర్యముగా యింటింట ఒక్కొక గదిని నాకు యేర్పాటుచేసి, నన్నా గదులలో పెట్టుకొని కలకలలాడుచు నాతో తిరుగుట కలవాటయిన ఆంధ్రస్త్రీలకు నేను 'గృహలక్ష్మి' గానే కనబడవలెను గాని నా భీకరాకారమైన స్వరూపముతోను, సింహ వాహనముతోను కనబడుట సమంజసమా? కాదు. ఇంతియ గాక, ఆభరణములన్నను, వివిధ రకములగు రంగు బట్టలన్నను, గాజులు మొదలగు వస్తువులన్నను, వీరికి ప్రీతి. ఈ మూలముగా వారు ఆంధ్రలక్ష్మిని, ఆంధ్రదేశ వర్తక వ్యాపారాభివృద్ధికొరకు రచ్చాడనీయక, ఆభరణ రూపకముగా అరికట్టుటగాని, వస్తుప్రేమచే ఇతరదేశములకు పంపుట గాని చేయుచున్నారు. ఇది అసంభవము.

చెల్లాయ్! నన్నొక్కమారు పరికించి చూడు. నా మెడలో మంగళసూత్రములు, పూలమాలిక తప్ప మరేమయిన ఆభరణము లున్నవా? సువాసినీలక్షణము చూపుకొరకు నాలుగు స్వదేశీ గాజులుతప్ప, కోట్లకొలది రూపాయిలను పాశ్చాత్యదేశముల కంపి, అక్కడనుంచి తెప్పించిన గాజులుగాని, పూసలుగాని, క్రెమంట్లు పిన్నులుగాని, గిల్టునూలుతో, ఆంధ్రదేశపు పనివారలచే వేయబడిన రంగులతో, ఆంధ్రులచే నేయబడిన చీరగాని. ఇది పాశ్చాత్యదేశములనుండి దిగుమతి కాబడిన 'సిల్కు' చీరకాదు. ఇవి అన్నీ స్వయంగా చూపించి, మీరు మీ మీదనే ఆధారపడాలని చెప్పటకే మీలో అక్క చెల్లెలనయి, ఈ రూపములో తిరుగుచున్నాను. చెల్లాయ్! ఇప్పుడు నే నెవరినో తెలిసిందా? ఈ మా రొచ్చినప్పుడు ఇంకా చెప్తానులే. అంది—

శ్యామల:—ఇంతట్లో నేను నిద్రమేల్కొని చూచేసరికి అక్కయ్య కనబడలేదు. ఈ మా రొస్తే, గృహలక్ష్మి అక్కయ్యను మన యింటివద్ద వుండమనవ్, అమ్మా?

---

# తంజావూరు

శ్రీమతి కురుగంటి వెంకటలక్ష్మమ్మగారు

సీ॥ రమ్యమై వెలసెడి రాజసౌధంబులు కళకాంతులనుబాసి కనులబడును।
చుక్కలన్‌జూచెడి సుందరంబగు గోపురంబులు ధూళిచే రంగుమాసె।
సిరిసంపదలతోడ చెన్నుమీరిన వర్తకావళి పెద్దమ్మ యతిథులైరి।
ఖ్యాతిజెందిన పూర్వకాల శిల్పంబులు మారు రూపములొంది మాయమయ్యె॥

తే॥ సిరులకాట పట్టంచును వెలగిమున్ను
దేశదేశంబులందున వాసిగాంచి
యులమహారాష్ట్ర రాజ్యమై యులరినట్టి
తంజపురమిటు తనశోభ దరిగియుండె॥

సీ॥ మల్లెరోజాపుష్ప మాలతీతీవెల వెలయుతోటలు రూపుపేరుమాసె।
అంగనామణులతో సింగారముగనుండు అంతఃపురంబులు నంతమయ్యె।
వేదపారాయణవేత్తలౌ భూసురుల్ దీనతజెందిరి తేజమెడలి।
శౌర్యసంపన్నులు శస్త్రాస్త్రములుదాల్చి కాచుచుండెడికోట కాంతిదరిగె॥

తే॥ నిత్యభోగంబులందుచు నీటుగుల్కు
దేవతానిలయంబులు దీప్తిమాసె
అలమహారాష్ట్రరాజ్యమై యులరినట్టి
తంజపురమిటు తనశోభ దరిగియుండె॥

# కీ॥ శే॥ శ్రీమతి విఠలదేవుని లక్ష్మమ్మగారు

ఈమె సుప్రసిద్ధ న్యాయవాదులగు, విఠలదేవుని రాధాకృష్ణయ్యగారి ధర్మపత్ని. 1888-వ సంవత్సరమున, చిత్తూరునందు ఒక బీద కుటుంబమున, భూగర్భమున రత్న ముద్భవించినట్లు, ఈమె జనించెను. ఎనిమిదవఏట ఈమెకు వివాహము జరిగెను. లక్ష్మి యను పేరు సార్థకమగునట్లు, ఈమె అడుగు పెట్టినది మొదలు, అంతకుమున్ను చాల బీదస్థితిలో నుండిన ఈమె భర్తగారి కుటుంబము, దినక్రమేణ శుక్లపక్షపు చంద్రునివలె వృద్ధికి రానారంభించెను. మిగుల చిన్నతనముననే, ఆమెను అత్తవారింటికి తీసికొని వచ్చిరి. వయస్సు అంత చిన్నదైనను, ఆమె అత్త వదినలతోను, కడమ అత్తవారింటి వారితో, తలలో నాలుకవలె మెసలి వారిహద్దు ఆజ్ఞలలో మెలగుచు వారి ప్రేమకు పాత్రురాలాయెను. అత్త వారింటికివచ్చినపిదప ఆమె, తెనుగునందు మంచి పాండిత్యమును, సంగీతమునందు మంచి ప్రవీణతయు సంపాదించెను. ఇంగ్లీషుకూడ కొంతవరకు చదివెను. ఈమెకు సుమారు ఇరువది సంవత్సరములప్పుడు స్త్రీ విద్యాభిమానము మిక్కుటముగ కలిగియుండెను. స్త్రీలు ఇల్లువదలి సభలకేగుట చాల తప్పని తలచు ఆకాలమున, ఈమె స్త్రీల అభివృద్ధికై ఏర్పరుప బడిన సరస్వతీ సమాజమను సభనిర్మాణమునందు చాల పాటుపడెను. ఆ సభయందామె తరచుగా, స్త్రీల హక్కుల విషయమై ఉపన్యాసములిచ్చుచుండెను.

ఇప్పటివలె స్త్రీలు స్వేచ్ఛగా బయటికేగి, సమకూడుట కనేక సభలులేని కాలమున, హిందూస్త్రీల లక్ష్మీవిలాస సభ ఏర్పరుపబడెను. విద్యాగంధములేక, ఇంట ప్రొద్దుపోక ఎప్పుడును ఇరుగుపొరుగువారి నాక్షేపించుచు ప్రొద్దుపుచ్చు స్త్రీలకు, నెలకొక తూరియో, రెండుమారులో యొక ఫంక్షనుగా గూడి ఈ సభయందు జరుగు సత్కథా కాలక్షేపములు వినుట, వారి మనస్సులకును, ఆత్మలకును ఎంత మేలు గూర్చునో, చదువరులే యూహింపవచ్చును. శ్రీరామ నవమి యప్పుడు, పది దినములు రామాయణకథలును మరి యనేక పుణ్యదినములందు పుణ్యకథలు ఈ సభ యందు జరుగును. ఆ కాలమునందు స్త్రీల యభివృద్ధి కనేక విధముల ఈ సభ సహాయము చేసెను. ఈసభలో ఈయమ మూడు సంవత్సరములు కార్యదర్శురాలుగా నుండి, సభానిర్మాణ, అభివృద్ధికి ఎంతయో పాటు పడెను. ఆ సభ ఉన్నత దశకు వచ్చుటకు పాటుపడిన వారలలో ఈమె ఒక ముఖ్యురాలు అని చెప్పుట అతిశయోక్తి గాదు. ఈసభవారు అనేక నాటకములు వేయుచుండిరి. వీటి కామె ఎంతయు సహాయపడు చుండెడిది.

ఈ కాలమునందామె చిత్ర విచిత్రములగు చేతి పనులను నేర్చుకొని, మిక్కిలి నిపుణతతో చేయు చుండెను. పటములకు సరిగె పెట్టి కుట్టుటయు, ఉల్లుతో తలగడలు కుట్టుటయు, గాజు ముక్కలతో పటములు కుట్టుటయు, ఆమె నిపుణతతో చేయగలిగిన పనులలో కొన్ని.

ఆమెకు వయస్సు ఎక్కువదైన కొలది, ధర్మవిషయములందు ఆసక్తి మెండుగా జొచ్చెను. బీదలకును, బిచ్చగాండ్రకును, స్వగృహమునందే తన చేతులార నాహారమిడుట యన ఆమెకు ప్రీతి. ఎన్నిసారులో ఆమె ఆ ప్రకారముగా చేయుచుండెడిది. ఆమె బయట పోవునపుడంతయును సంచియందు చిల్లరవేసికొని, కనబడు బిచ్చగాండ్ర కందరికిని డబ్బిచ్చును. ఈ సంచి తీసుకొనక ఆమె ఇల్లువదలి కదలదు. నగరి స్టేషను సమీపమున బుగ్గ దేవాలయమున విశ్వేశ్వరున కీమె రజితనాగాభరణము సమర్పించెను. తిరుత్తణి సమీపమున కుమారకుప్ప గ్రామమునందు విష్ణుదేవాలయమున కీమె సవరనులదండను సమర్పించెను. సదరు గ్రామమునందు ధర్మసత్ర నిర్మాణమునకు గాను కొంత మూలధనము ఈమె

యొసగెను. ఇంతియేగాక, ఈమె తనవారు పెర వారు అను భేదబుద్ధిలేక ఎల్లరకును తనచేతనైనంత ధనమును ధారాళముగా సహాయముచేసి, వారిని సంతుష్టిపరచి పంపుచుండెను. ఈమెను యాచించిన యాచకులు రిక్తహస్తములతో పోవుట ఎన్నడును జరుగలేదు. ఎందరో విద్యార్థులు ఈమెయొద్ద జీతము లంది సుఖముగా విద్యగరచిరి. ఈమె దాతృత్వ మీమె తన మరణశాసనమునందు గూడ గనపరచెను. లోకమునందు తమ ఆస్తినంతయు, ఇతరులకు చిల్లి గవ్వయైనను ఇవ్వక, తమ బిడ్డలకే యొసగుట సహజమైయుండ, ఈమె తన బిడ్డలకేగాక, రక్తస్పర్శగల దగ్గరచుట్టములకును, రక్తస్పర్శలేని బంధువర్గములకును, నౌకర్లు చాకర్లకి కొన్ని వందల రూప్యముల ధనము చేరునట్లు వ్రాసెను. ఇంతియేగాక, ధర్మ వైద్యశాలకు కొంత మొత్తమును, అన్నదానసమాజమునకు కొంత మొత్తమును, కరణకమ్మసభకు కొంత మొత్తమును వ్రాసి యుంచెను. ఈమె ఇంక కొంతకాలము జీవించియుండిన ఇంకను అనేక ధర్మ కార్యములు చేసి యుండుననుటకు సందియములేదు.

ఈమె సర్వ సంపదలతో తులతూగుచుండి నప్పటికిని, గర్వమావంతయు లేక, ఎట్టి దరిద్రుడు, తక్కువ జాతివాడు, వచ్చినను, అతనిని కూర్చుండబెట్టి వాని కష్టసుఖములను విచారించును. బంధుజనులం దీమె కపార ప్రేమ. పుట్టినింటివారు అత్తవారింటివారు అను భేదబుద్ధిలేక ఎల్లర నీమె సమానప్రేమతో చూచుచుండెను. ఈమెకు, తన వదినగారియందు, తన తల్లియందుకూడ లేని అసమానప్రేమయు, నపార భక్తియు కలిగి యుండెను. వీరి మైత్రి లోకమున ఎల్లరకును అదర్శకమై యుండెననుట అతిశయోక్తి గాదు. ఈమె ఎల్లవిధముల భర్త ఇష్టానుసారముగ ప్రవర్తించిన పతివ్రతా శిరోమణి. ఇట్టి, సాధ్వీమణి ఎల్లర దురదృష్టముచే, ఆరు మాసములు వ్యాధిగ్రస్తురాలై, గొప్పవైద్యశాలయం దుంచబడిగూడ, ఫలము లేక 1933 సంవత్సరము, డిసెంబరునెల 26-వ తేది, మంగళవారము, సాయంత్రి మైదు ఘంటలకు, స్వగృహమున బీదల మొర, నిరాకరించి పరలోక వాసినియైన దని తెలుపుట కెంతయు చింతిల్లుచున్నానను. దయా హృదయుండగు సర్వేశ్వరుం డీమె యాత్మకు శాంతి యొసగుగాక !

ఇట్లు తత్పుత్రిక
సరస్వతి.

—:o:—

# నా భాగ్యము

కందుకూరి రామభద్రరావుగారు

నానాథు డేనాడు
ననువీడి పోడు
నన్నంటె యుంటాడు
నాభాగ్య మేమొ !

ఏను మరచిదిగాని
యేమరచి పోడమ్మ
కనురెప్పవోలె న
న్గాచుకొని యుంటాడు. నానాథు

వలపు హృదయములోన
నిలుపుకోమ్మంటాడు
కడముట్ట యాత్రంత
కలియుదామంటాడు. నానాథు

అడవిదారులవెంట
అడలబోకంటాడు
కటికిచీకటివెంట
కాముదేనంటాడు. నానాథు

సత్యదీపికచూచి
జరిగిరమ్మంటాడు
మీాది భారంబంత
నాదె పొమ్మంటాడు. నానాథు

ఇంతవలపులభర్త
కాంతకున్నట్లైన
స్వర్గమనగావేఱె
జగతిలో గలదె ?

# భాష, వ్యాకరణము

శ్రీమతి 'కృష్ణకుమారి' ఆంధ్రయువతీకళాశాలావిద్యార్థిని.

[ఇటీవల రాజమండ్రిలో జరిగిన కవిపండితసభలో జదువఁబడి బహూకరింపఁబడినది.]

"నిరంకుశాః కవయః" అన్నారు. ఇలా అన్నంతమాత్రాన కవికి కావలసినంత స్వేచ్ఛ దొరికిందని మన మెప్పుడూ అనుకోకూడదు. ఏమంటే, ఒక ప్రక్క నిరంకుశత్వము చెప్తూన్నా, వ్యాకరణము, ఛందస్సూ అనే లక్షణాంకుశాలు అడుగడుక్కీ కవిని ఆశుగమనాన్నుండీ వారిస్తూనే ఉన్నాయి. కవికి దైవవశాత్తూ పొరపాటు చేతెక్కడన్నా చిన్నయతి తప్పిందంటే "నాకడుపు చెఱప బుట్టావురా నాయనా, నన్నెంత బాధపెటుతున్నావోయి నాబాబూ" అని ఛందోమతల్లి ఏడుస్తుందట! ఇక ఎక్కడన్నా వ్యాకరణాని కసాధ్యమైన రూపం ఒక్కటి పుస్తకంలో కనబడ్డదంటే చాలు. "ఇంతవఱకూ నావంశంలో ఎవరూ నామాట జవదాటి ఎఱుగరు. ఈకాలానికి నీవు బయలుదేఱి నాశాసనాన్ని ధిక్కరిస్తున్నావు. తండ్రిమాట తప్పినసీకు గతులులేవు. నీవు నామాట విని తీరవలసిందే" అని కఱ్ఱ పుచ్చుకొని బెదిరిస్తుందట వ్యాకరణము—ఇన్నాటంకాలుండగా, కవికి స్వేచ్ఛ విషయంలో కడుపు నిండిం దని ఎలా చెప్తాం!

పోనీ—వ్యాకరణ మూరికే కవులను, భాషను బెదిరించడమేనా! లేక కవుల కేమైనా సాయంచేస్తూ, భాష నేమైనా తగురీతిగా శాసిస్తూందా? అంటే:—ఇప్పటికున్న బాల, ప్రౌఢ వ్యాకరణాలవల్ల భాషంతా ఇమడటం లేదు. ఎల్లా ఇముడుతుంది లెండీ! పతంజలి చెప్పాడూ: "బృహస్పతిశ్చ వక్తా, ఇంద్రశ్చ అధ్యేతా దివ్యంవర్షసహస్రం అధ్యయనకాలః నచాన్తం జగామ కిం పునరద్యత్వే" అని. అటువంటిభాషను ఉన్ననాలుగువ్యాకరణాల్లోనూ ఇమిడ్చేద్దామంటే ఎలాకుదురుతుంది? అందుచేతనే వ్యాకరణాని కసాధ్యాలైన రూపాలు మన వ్యవహారంలో చాలా మిగిలిపోయాయి. 'కాబట్టి' 'అటువంటి' మొదలైన పదాలు చిన్తామణీ ఇత్యాదిగ్రంథాలచేత కూడ సాధ్యంకాలేదు. ఏవ్యాకరణం చూచినా "అట్టి, ఇట్టి, ఎట్టి" అనే రూపాలనే విధిస్తుంది కాని 'అటువంటి' అనే రూపాన్ని సాధించదు. కనుక వ్యాకరణాని కసాధ్యాలైన పదప్రయోగ మంతా అపభ్రంశ మనడం అన్యాయం. "ప్రయోగమూలమ్ వ్యాకరణమ్" అనేవారే సర్వజనసమాదరణీయమైన ప్రయోగాన్ని వ్యాకరణానికి కుదుర దని చెప్పి ఎలా త్రోసివేస్తారో తెలియదు.

చిన్తామణిలో నన్నయగారు "సంస్కారార్థో నియమః" అనుటవలన తనకాలమునాటికి వ్యవహారంలో ఉన్నభాషను తీసుకొని మెఱుగుపెట్టున్నాను అనే అంతరార్థం గోచరిస్తూంది. ఈసూత్రంచేతనే ఇప్పటిభాషను కూడ క్రొత్తనియమాల్లో పెట్టుకోవచ్చునే! క్రొత్తనియమాలు లేకుండా ఉన్న వ్యాకరణాల్లోనే సర్దుకొమ్మనడం ఎలా ఉందంటే:— మూడునెలలనాడు చేయించిన పట్టెడ మెడ

అనంతపురం గవర్నమెంట్ గరల్స్ ట్రైనింగుస్కూలు బాలికలచే ప్రదర్శింపబడిన
నాటకమునందలి కొన్నిదృశ్యములు



పేక్స్పియరు కవీంద్రుడు వర్ణించిన
మానవుని యేడు వయో·వస్థలను తెలుపు చిత్రము.



కుముద్వతి తనయల్లుఁడగు సోమదేవరాజును, కూతురగు కుముదవల్లిని
తలవని తలంపుగ గనుంగొని విభ్రాంతి నొందుట.
కుముద్వతి తొట్రుపాటుతో "ఏమి [illegible]!



లక్ష్మీపూజ

25-11-33 తేదిని ఆడఁబడిన 'సరళ'నుండి యొక రంగము



కుముదవల్లి వీరావేశము

కుముద:— "నిజము చెప్పుఁడు. నాపతి నేమి గావించితిరి? ఏమి చేసితిరో ముందటఁ దెల్పుఁడు !"

ఒత్తుకుపోయి చచ్చినా సరే ముప్పై ఏళ్ల నాడు కూడ పెట్టుకోమ్మన్నట్లుంటుంది. ఎప్పుడో పెద్దవాళ్లు చేయించింది కదా! అది తీసివేయుడ మెందుకు? అనే ఆశ ఉంటే ఇంకొంత బంగారం వేసి మళ్లీ చేయించుకోనైనా చేయించుకోవాలి, లేదా అసలు తీసివేయునన్నా తీసివేయాలి. అలాగే భాషాదేవిని కూడ అవయవాలన్నీ సంకుచితం చేసికొని మేము కట్టినకట్లల్లోనే ఉండి ఒకమూల పడుండ మనడం కేవలం అన్యాయం. పైగా అది భాషాదేవికి చాల బాధకరమైన విషయం. ఉన్న వ్యాకరణ మనే గట్లచేత భాషాప్రవాహం ఆపబడగల్గితేనే, ఆ గట్లుంచాలి కాని, గట్లను దాటి ప్రవాహం దొర్లిపోతూన్నపుడా గట్లెందుకు?

ఉన్న వ్యాకరణాలచేత భాష కట్టుబడలేదనడానికి ఒకటి రెండు నిదర్శనాలు. పరవస్తు చిన్నయసూరిగా రెలాగో కష్టపడో, అనుకరించో, అనువదించో భాషను సాధిద్దామనే ఉద్దేశంతోనే వ్యాకరణం వ్రాశారు. కాని వెంటనే ఎప్పుడైతే సీతారామాచార్యులుగారి 'త్రిలింగలక్షణ శేషం' బయలుదేఱిందో అపుడే సూరిగా రనుకొన్నంతగా భాష సాధింపబడలేదని తెలుస్తూంది. కాని ఆచారిగారు కూడ పప్పులోనే కాలువేశారు. ఆయన వ్రాసిన సూత్రాలు 294. అందులో 60, 70 సూత్రాలు "కానంబడెడి, చూపట్టెడి, కనంబడదు, చూపట్టదు" అనే ఉన్నాయి. ఆచారిగారి వ్యాకరణం ప్రామాణిక గ్రంథోదాహరణం. బాలవ్యాకరణంలో "ముత్తియ శబ్దంబున మాత్ర మిత్వ లోపంబు" అని వ్రాసి ఉంటే, ప్రౌఢ వ్యాకరణంలో "ముత్తియ శబ్దేతరములకు నిత్వలోపము కానంబడియెడిన్" అని చెప్పారు. ఈ కానంబడియెడిన్ అనుటవలన కవిప్రయోగాల్లో ఇలా వ్యాకరణ విరుద్ధరూపా లున్నాయి, కాని అవన్నీ వారిమీది గౌరవంచేత క్షంతవ్యాలైనాయి కాని, మీరు మాత్ర మట్టివి ప్రయోగించవద్దనే చెప్పడం. పూర్వకవుల ననుసరించి కవిత్వం చెప్పమనే మహానుభావులే పై యర్థం ధ్వనించే సూత్రాలను వ్రాస్తే అన్వయవిరుద్ధాలైన ఈసూత్రాల నెలా సమన్వయం చెయ్యాలో తెలియడం లేదు. ఇది కేవలం బాల ప్రౌఢవ్యాకరణాలకర్తలకే కాదు. చిన్తామణికర్తక్కూడా ఇదే అలవాటు. చిన్తామణిలో సంధిపరిచ్ఛేదంలో "సలడాదే రంత రుతశ్చ" అని సూత్రం వ్రాసి, ఆసూత్రానికి కట్టుబడని ప్రయోగాల్ని "అన్యేషాంచ ప్రయోగమహితానాం" అనే సూత్రంలో త్రోసివేశారు. ఇలా నన్నయగారు వేసిన ఒక్కకప్పగంతులో ఎన్నో ప్రయోగాలు రక్షితాలైనాయి. దీని వ్యాఖ్యానంలోనే అహోబలుడు "అయంవిధి రితి నియన్తుం నశక్యతే" అని భాషయొక్క అపారత్వాన్ని తెలియచేశాడు. చాలా స్థలాల్లో నన్నయగారి నథర్వణుడు లాక్యంగా దిద్దుతూనే ఉంటాడు. ఈవరసంతా చూస్తే "తప్పులు ఒప్పులే తమనోఘుల కడ్డ ముండమిన్" అనేవాక్యం నిజమని తోస్తూంది. వ్యాకరణకర్తలు చేసిన గమత్తు లింకా ఉన్నాయి. ఏదైనా ఒక రూపాన్ని సాధిస్తూ 'బహుళంబుగా నగు,

ప్రాయికంబుగనగు, ఆకృతిగణంబు, ఇత్యాదులూహ్యంబులు’ అని కప్పదాట్లు దాటుతూంటారు. ఈదాట్లచేత తమవ్యాకరణానికి భాష లొంగలే దని పూర్తిగా తెలుస్తూంది. సూరిగారికి, ఆచారిగారికి దేవుడొక్కడైనా, ఇద్దఱు వేర్వేరు నామాలే అయినా, మళ్లీ మతం (ఇష్టం, ఉద్దేశం)లో పూర్తిగా భేదం. సూరిగా రౌనంటే, ఆచారిగారు కాదంటారు. ఇద్దఱూ కత్తికి కత్తి, దెబ్బకు దెబ్బ అనే రకం. మచ్చున కొక్కసూత్రం. సూరిగారు “విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు” నని వ్రాస్తే, ప్రౌఢవ్యాకరణకర్త “విశ్వకర్మ్యం డనియు, రూపంబు” అని సాగదీసి సవరిస్తాడు. వ్యాకరణంలో “వైయాకరణాః ఖసూచిః” అని ఒకపరిభాష ఉంది. అది వ్యాకరణజ్ఞుల పట్ల నిజమైనా కాకపోయినా, వ్యాకరణం చదువుకునే మాబోంట్లపట్ల నిజమౌతూంది. పై చెప్పిన విరుద్ధసూత్రాలు, విరుద్ధపుక్రియలూ చూచి మనస్సు కలతపడిపోయి బాలవ్యాకరణం చెప్పినట్లు ప్రయోగించాలో, ప్రౌఢవ్యాకరణం చెప్పినట్లు ప్రయోగించాలో తెలియక కొట్టుమిట్టాడిపోయి, ఏంచారిరా భగవంతుడా! అని పై పరిభాష ప్రకారం ఆకాశం చూస్తూ కూచుంటారు. ఇదిమాత్రం తప్పదు.

ఈ అసాధ్యాలూ, అసందర్భాలు అన్నిచూచి ఏ శాస్త్రిజీ దగ్గరకో వెళ్లి సమాధానం అడుగుతే, ఒకనిమిషం ధ్యానం అభినయించి, కొంతసేపు పైకి గొణిగి, తల పంకించి, మనకు తెలియని భాషలో ఏదో సర్ది చెప్పేస్తారు. కాస్త కోపంవున్న ముసలి పండితుడి దగ్గరకు వెళితే, అక్కడ జరిగే కథేమిటంటే:—ఒక పట్టెడుపాసుం నసాళం అంటేట్టు పీల్చి ఘూటెక్కినతర్వాత “పెద్దవాళ్లు వ్రాసిన పుస్తకాల్లో తప్పులుపడతావు! అలా తప్పులు పట్టడానికి నీ వెంతటివాడవు! నీ అంతరం, వాళ్లంతరం తెలుసుకోకుండా మాట్లాడుతున్నావు. వాళ్లు చెప్పిన దక్షరాలా విని తీరవలసిందే. అమ్మయ్యో! దాని కెదురుతిరగడమే! జాగ్రత్త” అని గుండె బాదుకుని ఇవతలవాళ్లను చీవాట్లువేసి ముూకు చెఱువులనీళ్లు తాగినంతపనీ చేసి సమాధానం చెప్పకుండానే గడపదాటిస్తాడు. కాస్త మూఢపండితుడి దగ్గఱకి వెళితే అక్కడ జరిగేతంతు: (ఆయనకు ప్రౌఢవ్యాకరణం అంటే గిట్టదు లెండి) ఆయన నదురూ బెదురూ లేకుండానే మౌఢవ్యాకరణం ఒకవ్యాకరణమే నటయ్యా! చచ్చు వ్యాకరణం. ప్రౌఢవ్యాకరణంలోని ప్రక్రియా పుష్పాలన్నిటిని బాలవ్యాకరణంలోని సూత్రాలకే గుచ్చేస్తాను. అని తన అభిమానాన్ని వెళ్లబోసుకుంటాడు. ఇలాగ వాళ్లల్లో వాళ్లే ఒకదారిని నిలువరు. పైగా ఇతరులని అర్థంలేకుండా శాసిస్తారు.

శాస్త్రిగారిగొడవ వెత్తుకోగానే, నాకో చిన్నగాథ జ్ఞాపకం వచ్చింది. ఒకప్పు డొక శాస్త్రిగారింట్లో తద్దినంవచ్చింది. పోనీ కదా అని తనశిష్యు లిద్దఱి నావేళ భోజనానికి పిలిచాడాయన; శిష్యు లిద్దరూ గురువుగారింటికి వెళుతూ దారిలో ఇలా అనుకొన్నారట.

1-వవాడు:—"ఒరే! ఇవాళ గురువుగారింట్లో వంటకా లేమైయుంటవంటావు!

2-వవాడు:—ఏ మనకాని కేముందీ! ఇత్యర్థాలు ఇగురూనూ. ఇతిభావాలు పులుసూనూ! వండేస్తారు" అన్నాట్ట.

అంటే వారింట్లో అంత ఛాందసం ఉందన్న మాట.

ఇంక ఫక్తు వ్యాకరణయుక్తంగా మాట్లాడుతా మనువాళ్ళతో కొందఱి సంభాషణ బొత్తుగా అసభ్యంగా ఉంటుంది. వెనకటికి ఒకవక్త ఉపన్యాసం ఇస్తూ, 'ము' వర్ణం వచ్చినప్పుడల్లా 'ంబు'లు పెట్టి, 'మనంబు, ఘనంబు, ధనంబు, వనంబు' అంటూ గంభీరంగా మహోపన్యాసం ఇస్తూ ఉన్నాడట. ఇంతలో అధ్యక్షుడు 'టైము' అయిపోయిందని తెలియజేసాడట. దానితో ఆవక్త తన యెప్పటి అలవాటు చొప్పున, సభ్యులతో "అధ్యక్షులవారు 'టైంబు' అయినదని హెచ్చరించుచున్నవారు, కావున సత్వరంబుగ విరంబించుచున్నవాఁడ" అని చివాలున స్టేజి దిగాడట. దిగిదిగడంతోటే అతని కాలు అక్కడ పాకుతూవున్న ఒక పాము మీద పడిందట. వెంటనే అతడు కంగారు పడి, 'అమ్మబాబో! 'పాంబురో' అని మూడు పిల్లిమంతరాలు వేసి అవతలికి ఉరికాడట. చూచారా! వ్యాకరణయుక్తమైన సంభాషణ అంటే ఇలా ఉంటుంది.

అప్పకవి చెప్పిన లక్షణాలన్నీ పెట్టి వ్రాసిన కవిత్వం మడికట్టుకొని కూర్చున్న వైదికప్పిల్లలాగ 'నన్ను ముట్టుకోకు నా మాలకాకి' అంటుంది. అటువంటి కవిత్వం అంటా ముట్టరాని అగ్రహారం అవుతుంది.

రసోదంచితమైన రచనకు లక్షణాలతో అవసరంలేదు. తెలిసిన లక్ష్యప్రణాళికనుండి లక్షణాల నేర్పఱచారే కాని, లక్షణాలనుండి లక్ష్యాల నేరుకోలే దెవరూనూ. నిరర్థకమైన కవిత్వం, వ్యాకరణయుక్తంగాను ఛందోయుక్తంగానూ ఉన్నా, దాని ముఖానికి తిట్లుతప్పవు. రసవంతమైన కవితావిహంగానికి ఛందోవ్యాకరణాలను గురిపెట్టి కొట్టే విమర్శకకిరాతులున్నా "అయ్యో పక్షి పడిపోతుందేమో" నని దుఃఖించి, ఆవేగం పొందే సహృదయులు ఉన్నారు. మృదుమధురకవితాపుష్పం పుట్టీ పుట్టగానే దాని పరిమళాన్ని మరందాన్నీ పువ్వు నొవ్వకుండా ఆస్వాదించి, ఆనందించే రసికులూ ఉన్నారు.

అట్లని నియమవిరహితమగు భాష సార్వజనీనము కాదు. సార్వజనీనం కాని భాష పైకిరాదు. నియమవిరహితమైన భాష ఎలా ఉంటుందంటే:—వెనకటి కోఅబ్బాయి అమరం అంతా క్షుణ్ణంగా చదివేశాడు. అమరంలో "యస్యజ్ఞానదయాసింధూ" అని మొదలిస్తే "సామాన్యప్రాజ్ఞ ఏవ సమర్థిత:" అని చివఱవఱకు నిద్రలోనైన పొల్లు పోకుండా అప్పజెప్పగల సమర్థత కలవాడే. అయితేనేం పాపం సహజపాండిత్యం అవడం వల్ల పదచ్ఛేదా లవీ తెలియవు. కాని "అమరం అంతా చదివేశాను కదా, ఇంక కవిత్వం చెప్పుదామనుకొన్నాడు. చెప్పాడు కూడాను. "ఇత్యపుల్ కూయుఁగ, కోనంగు డేయుఁగ, పునపుంసక మెక్కి అవ్యేకదంతుం డాడసాగె" అని. పాప మాఅబ్బాయి

ఉద్దేశం అఘోటకబ్రహ్మచారి ఐన వినాయకుణ్ణి మదనసంతప్తుణ్ణి చేశాద్దామని కాని దానిలో దోషా లాఅబ్బాయికి తెలియలేదు. అసలు అమరంలో కోకిలపేర్లు "......పిక ఇత్యపి" అనిన్నీ, మన్మథుని పేర్లు "........దర్పకోఽనంగం" అనిన్నీ, "......గణాధిపాః అప్యేకదన్త" అనిన్నీ వ్రాసి ఉన్నది. ఆప్రత్యయాలూ అపీకూడ వాళ్లకు పేర్లే అనుకోని పైలాగ కవిత్వం చేశాడు. ఇలాగే ఉంటాయి నియమరాహిత్య మైన రచనలు.

కనుక ఇప్పటి యీనూత్న భాషకు సరియైన వ్యాకరణము చేయవచ్చు, దానిప్రకారం నడచుకోవచ్చు. "విశ్వశ్రేయః కావ్యమ్" అనుటచేత విశ్వజనీనత్వము కూడ ఆసూత్రంలో ధ్వనిస్తూంది. కనుక పండిత పామరరంజకంగా సహృదయ హృదయాహ్లాదకరంగా వ్యావహారిక భాషలో కైత నల్లవచ్చును. కాని ఒకటి రెండు విషయాలుమాత్రం ముఖ్యంగా గమనించాలి. "గుత్తాన్ని చేయబోతే, గాడిదైనట్లు" పట్టు పట్టి, పంతానికి వ్యావహారికభాషను వాడదామని గ్రామ్యభాష నుపయోగించుట పాడి కాదు. తర్వాత మనం చేసే రచన మనకు, ఇతరులకు కూడ అర్థమయ్యేటట్లు చెయ్యాలి. భావకవిత్వం పేరుపెట్టి తన రచనలొన్నాళ్లకు తనకే అర్థం కానట్లు చేస్తే చాల చిక్కున్నది. చదివేవాళ్లు తమ కర్థం కాక గడబిడపడతారు.

అతినియమనిబద్ధ మైన భాషారచన ఎప్పటికిని సార్వజనీనము కాదు. విశ్వజనీనము కాకపోవడమే కాక, గోనెసంచిలో కాళ్లు కట్టిసి మనిషిని నాట్యంచేయమంటె ఆవ్యక్తి ఏలాగ తైతక్కలాడి క్రింద బోర్లపడతాడో ఆలాగే కవిత్వాన్ని కూడ శాస్త్ర మనే గోనెలో వ్యాకరణం, ఛందస్సు అనే సంకెళ్లను తగిలించినట్లైతే, ఇటూ వెళ్లలేక అటూ వెళ్లలేక ఎగిరెగిరి క్రింద పడుతుంది.

కనుక అర్థవంతము, రసవంతము నైన భాషారచనలే విశ్వజనీనము, విశ్వశ్రేయస్సు, విశ్వకళ్యాణము, విశ్వసౌభాగ్యము నౌతాయి. వానికి వ్యాకరణాలతో పని లేదు.

(ఇది 29-12-33-వ దినమున రాజమహేంద్రవరంలో జరిగిన మహారాజశ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారి డెబ్బదవ జన్మదినోత్సవ సందర్భమున జరుపబడిన అభినవాంధ్ర కవిపండిత సమావేశంలో చదువబడ్డది.)

## నవోదయము

దామెర రాజగోపాలరావుగారు

చీకటివాకిటకడ నిలబడి
వేకువ తనకాంచనవిపంచి
సలలితగతి—పలికించెన్!

తీయనితేనియ సోనలాని
హాయిగ భ్రమరాంగనతన
నీరవగళమును—సవరించెన్!

ఏయెలమామిడిచివురులు వడి
మేయుచు కోయిలవనిత తన
మోహనరాగము—వినిపించెన్!

# నిష్పాక్షికం

ఉభయభాషాప్రవీణ కాంభట్ల విశ్వనాథశాస్త్రిగారు(శారదాసమితి)

మేడపై కిటికీమీద పుస్తకం పెట్టుకొని సవిలాసంగా చిరునవ్వుతో చూస్తూన్నాది లక్ష్మి. అస్తమిస్తూన్న సూర్యకిరణాలు ఆ అమ్మాయి సుకుమారమూర్తిమీద ప్రసరిస్తున్నాయి. ఆ యింటిచుట్టూ ఉన్న పూలమొక్కలూ, పైగా కనుచూపుమేర శాద్వలస్థలాలూ, సూర్యకిరణప్రవాహంలో మునిగి బంగారురంగు పూసినట్లు మనోహరంగా మెరుస్తున్నాయి. పిల్లగాలిచేత పూలమొక్కలన్నీ తలలూపుతున్నాయి. ఆయింటికి తిన్నగా కొంచం దూరంలో నిర్మలజలంతో ప్రవహిస్తూన్నాది గోదావరినది. మారుతపోతములను తరంగహస్తాలతో యీ తీరాన్ని చేరుస్తూన్నాది నదీమతల్లి. కొంతసేపట్లా పుస్తకంచూస్తూ బొమలు ముడిచి దీర్ఘాలోచ నేదో చేస్తున్నాది లక్ష్మి.

సుమా రిరవైయేండ్లుంటా యామెకు. సుగుణవతి; రూపవతీని; పోసిన బంగారుబొమ్మ. ఆమె నిల్చుంటే ఎవడో అసమానుడైన శిల్పిచెక్కిన విగ్రహంలాగుంటుంది. ఆమె కదలేటప్పుడల్లా, మలయమారుతోచ్చలితమైన లేదీగలాగ విలాసాలొలుకుతూంటాయి. ఆముఖంలోని ప్రసన్నత, కళ్లలోని గాంభీర్యమూ, పెదవులపై నాట్యమానే వెన్నెలాన్నూ, ఎంతమందిని ముగ్ధుల్ని చేసేయో అని ఆలోచన కలుగుతుంది. ఆమె పల్లెటూరిబిడ్డ. క్రొత్త 'ఫేష'న్సేమీ లేకపోయినా పులుగడిగిన ముత్యంలాగ స్వచ్ఛంగాను, అందంగాను ఉంటుంది. మంచి తెలివితేటలు కలదే. కాని, సిగ్గుచేత కాబోలు అధికంగా ప్రసంగించదు. వాళ్ల తండ్రి మంచి పండితుడు. చిన్నతనంలోనే ఈమెకు కావ్యాలు అవి చెప్పేడు. చాలా శీఘ్రంగా అవగాహన చేసుకుంటూ చురుకుగా చదువుతూండేది. ఇంచుమించుగా కావ్యజ్ఞానం బాగనే సంపాదించింది. ఇంతలో పాపం ఆమె తండ్రి కాలంచేశాడు. అప్పటికి పన్నెండేండ్లుంటాయి లక్ష్మికి. కొంచం బలిష్ఠంగాను పొడవుగానూ ఉండేది. పన్నెండేండ్లే ఉన్నా పద్నాలుగేళ్లదానిలాగ కనిపించేది. ఎలాగైనా యీ సంవత్సరం పెళ్లిచేయక తీరదనుకున్నారు తల్లీవాళ్లు.

పెండ్లి అయినదగ్గరనుంచి అత్తవారింట నుండడంచేత అణకువ, అనురాగం, భయభక్తులూ, అలవడ్డా యామెకు. ఏవిధంగా భర్తృప్రేమ సంపాదించాలో తెలుసుకున్నాది. పల్లెత్తురాడేదికాదు పెనిమిటిమాటకు. ప్రసంగవశాత్తూ మాటల్లో కొన్ని అసందర్భాలు కనిపించినా, ఊరుకొనేది, సమాధానం చెప్పకుండా. తనత్తారింటి కళ్లేసరి కింకా పెనిమిటి చదువు పూర్తికాలేదు. కొన్నాళ్లు రాజమండ్రిలో చదువుకుంటూంటే తనుకూడా అక్కడే ఉండేది పెనిమిటితో. భర్త అప్పుడప్పుడు ఇంగ్లీషు చెప్తూండేవాడు. కాని పాపం అతనుకూడా విద్యార్థి. అనుకున్నంత చెప్పలేకపోయినా, కొద్దో, గొప్పో, చెప్తూండేవా డాకాలంలోనే అవకాశం చూచుకొని. ఇతని ఉద్దేశం కనిపెట్టి, పూర్వం 'ఫేషన్స్' విడిచిపెట్టి కొత్తబద్ధతుల నవలంబిస్తూండేది లక్ష్మి. తరచుగా దేశీయవిషయాలు, సాంఘికవిషయాలున్నూ ఆయ నెప్పుడైనా చర్చించాడంటే, వాటిని బాగా 'క్రాస్' చేసి తెలుసుకొనేది. తనుకూడా బాగా విమర్శిస్తూండేది మంచి చెడ్డల్ని. ఇల్లా క్రమంగా చాలా లోకజ్ఞానాన్ని సంపాదించింది లక్ష్మి. పెనిమిటి స్కూలు కెళ్లిపొయ్యేడంటే, వ్యర్థంగా కాలయాపన చెయ్యకుండా, గృహకృత్యాలవో చూచుకొని, ఏ నవలలో, ఏ నాటకాలో, ఏ వార్తాపత్రికలో చూసుకుంటూ కాలంగడిపేది. చిన్నతనంలో ఒక సంస్కృతమే అభ్యసించినా ఇప్పుడు నాలుగింటిలోను కాస్త విజ్ఞానం సంపాదించింది. కొద్దో

గొప్పే ఇంగ్లీషు, శాస్త్రపుస్తకాలు చదివి అర్థం చేసుకోగలిగేపాటి హిందీ, తెనుగులో శాస్త్రవిజ్ఞానమున్నా కూర్చుకుంది. సంస్కృతంమాట వేరే చెప్పక్కర్లేదు కదా! మొట్టమొద టభ్యసించిందే అది. ఇన్ని ఉండేటప్పు డా పాటిలోకజ్ఞాన ముండకపోదుగద. ఇన్ని తన దగ్గరున్నాయన్న గర్వం రవంతున్నా భయం చేత ఎదురాడలేకపోయ్యేది పెనిమిటికి.

నా డాదివారం. సాయంత్రం 5 గంటలయింది. చల్లగాలికోసం గోదావరిగట్టుకి షికార్లేడు కృష్ణన్. గోదావరీ తరంగాలమీదించి చల్లగాలి వీస్తూంటే మధ్యాహ్నం తాపమంతాపోయి హాయిగా ఉండేది. ఆకాశంలో పక్షుల్లాగ గోదావరిలో పడవ లెగురుతున్నాయి. విహారంకోసం కొంతమంది పడవలను తెడ్లేసుకొని ఆవలకు చేరుతున్నారు. కొందరు యువకులు కూనిరాగాలు తీసుకుంటూ, సవిలాసంగా తిరుగుతున్నారు. కొంతసే పట్లాతిరిగి ఒక్కచోట నిశ్శబ్దంగా కూచొని వ్రాసుకుంటున్నా డేదో కృష్ణన్. ఈయన చిన్నకవి. ముద్దు ముద్దుగా చిన్నపద్యా లల్లుతూంటాడు. ఎక్కువ పరిశ్రమచేసి మంచి 'ఆర్టికిల్స్' వ్రాసి బాగా పేరు ప్రతిష్ఠలు సంపాదించాలని ఉండేది. కాని అవకాశంలేకపోయ్యేది. ఎప్పుడైనా మిత్రులతో ఏదైనా చర్చించాడంటె తుదకు తన మాటె నిల్చేది. చాలాపట్టుదలతో పని చేసేవాడు. రెగ్యులరయిన మనిషి. కాలాన్ని వ్యయపరచకుండా విద్యావ్యాసంగంతో వెళ్లబుచ్చుతూండేవాడు. కాస్త అవకాశం దొరికిందంటే, ఏ "టెన్నిస్"కో ఏ "బాట్మింటన్"కో వెళ్లడమంటె తలకాయనొప్పి కృష్ణన్కి. ఎంతసేపూ నిశ్శబ్దంగా ఉన్న ప్రదేశంలో ఒక్కడూ కూర్చోడమంటె బ్రహ్మానందం.

ఇంచుమించుగా 30 ఏండ్లుంటాయి క్రిష్ణన్కి. చామనచాయ. పల్చగా పొడవుగానుంటాడు. చిన్నమీసం. చాలా నెమ్మదైనవాడు. శాంతమూ, సౌజన్యమూను అముఖంలో ప్రతిఫలిస్తూంటాయి. ఈయన చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోయారు పాపం. విజయనగరంలో "ఇంటర్" చదువుతుండగా పెండ్లయింది. అప్పటికి 20 యేండ్లుంటాయి కృష్ణన్కి. పల్లెటూళ్ల ప్రాకృతజనము అంటే కొంత వ్యగ్రంగా ఉంటాడు కృష్ణన్. అయినా, పిల్ల బాగుందనో, లేక వస్తూన్న సంబంధాలన్నీ తిప్పేస్తూంటే లాభంలేదని తోచిందో, కాక కొత్తపద్ధతులు, నాదగ్గరఉంటె 1, 2 యేళ్లలో నేర్పలేనా అనుకున్నాడో, కాని తననుకున్న ఫేషన్స్నేమిలేక పోయినా లక్ష్మిని పెళ్లాడ్డాని కిష్టపడ్డాడు. వెంటనే తనతో తీసుకుపోదామనుకున్నాడు లక్ష్మిని. కాని సాగదని కాబోలూరుకున్నాడు. అప్పుడప్పుడు సెలవల్లో తనతో "కేంపులు" తీసుకెళ్తూండేవా డెక్కడికైనా.

రాజమండ్రిలో బి.యె. చదువుతూండగా కాపరాని కొచ్చింది భార్య. కొన్నాళ్లు తనొక్కడూ ఉన్నా, తర్వాత తీసుకెళ్లేడు లక్ష్మిని. అప్పటికింకా బాగాపోలే దామెకు పల్లెటూరివాసన. ఒకసారి తనకొచ్చే ఇంగ్లీషంతా చెప్పి దొరసానిలాగ తయారుచేదామని ఉండేది క్రిష్ణన్కి. లక్ష్మికూడా అతని ఉద్దేశాని కనుగుణంగానే నడుస్తూండేది. రోజూ సాయంత్రం పత్రికల్లోని దేశీయవిషయాల్ని వినిపిస్తూండేవాడు లక్ష్మికి. ఏదైనా లక్ష్మితో చర్చించాడంటే, తనదగ్గర భయంచేత నిష్కర్షగా మాటాడేదికాదు కాని తగిన తెలివితేట లామెదగ్గరున్నాయనిమాత్రం గ్రహించేవాడు కృష్ణన్. కొంత చదువుకలిగితే స్వాభిప్రాయాన్ని నిర్భయంగా చెప్తుందికదా అని అనురాగంతో బుజ్జగించేవాడు లక్ష్మిని.

సంవత్సరం కావచ్చింది క్రిష్ణన్ ఉద్యోగంలో ప్రవేశించి. ఉద్యోగంలోనున్నపుడు మునపటంత హడావడుండదుగా. కావలసినంత అవకాశం. ఆ టైములో యేమేనా రాదామా అనుకొనేవాడు కాని కొంతసేపు కచేరీలో 'వర్క్'చేసి యింటికొచ్చిన

తరవాతనైనా, బుద్ధి కామాత్రం విశ్రాంతిలేకపోతే ఎట్లా? కచేరీనుంచి రాగానే ఒక్కసారి ఇంటికొచ్చి కాస్త కాఫీ పుచ్చుకొని బయల్దేరేవాడు "క్లబ్బు"కో పేకాటకో.

సంతానవతి అయిందంటే స్త్రీ సమస్త హక్కులను సమానంగా పొందుదామనుకుంటుంది పురుషుడుతో. మునపటికంటె స్వేచ్ఛ యెక్కువవుతుంది. మగాళ్లలో ఉండే లోపాలను సవరించడానికి తగిన సాహసంకూడ కలుగుతుంది. అప్పటి కొక కొడుకూ, కూతురూను లక్ష్మికి. కొడుకు 5, 6 ఏండ్లవాడు.

రాత్రి 9½ గంటలయింది; యింకా క్లబ్బునుంచి రాలేదెందుచేతనా అనుకొని కొంగుపరచి పిల్లదాన్ని జోగొడుతునాది లక్ష్మి. దగ్గరగా కూచొని 'లాంపు' పెట్టి చదువుతునాడు కుర్రాడు.

"అబ్బాయీ! తలుపెవరో తట్టుతున్నారు, నాన్నగారుకాబోలు; చూడమ్మా" అన్నదిలక్ష్మి పండుకొని కుర్రాడితో. అబ్బాయి పరుగెత్తివెళ్ళి తలుపుతీశాడు. "ఇవాళ చాలా ఆలస్యమయిం"దనుకుంటూ గదిలోకెళ్ళి, కోటుగీటుతీసి లోపుకొచ్చాడు కృష్ణన్.

"లక్ష్మీ! ఇవాళ మీపల్లెటూరి భోజనాలే మనవి, 10 గంటలకు" అన్నాడు కృష్ణన్ హాస్యంగా.

"ఇప్పుడు భోజనానికి పల్లెటూరివాళ్ళమే అయినా, తెల్లవారితే నాగరికులమేగా తాగుడికి?" అన్నాది లక్ష్మి చిరునవ్వుతో.

"అంటే"—

"వేగం భోజనాన్కి లేవండి, తరవాత మాట్లాడవచ్చు" నన్నది లక్ష్మి. ఇదివరకు లక్ష్మిఅంటె మంచి అభిప్రాయమే ఉన్నా, కృష్ణన్ చదువుకున్నవాడి నన్న గర్వంచేత కాబోలు, తను వ్రాసేకథలూ, అవీని, చూపించేవాడు కాదు లక్ష్మికి, ఆడవాళ్ళకు చూపించట మెందుకాఅని. అవి "పబ్లిష్" అయిన తరవాతనైనా చూచి అందులో మంచిచెడ్డలు ఆయనతో విమర్శిస్తూండేది లక్ష్మి. ఆయనకూడా అభిప్రాయం మారింది క్రమంగా. "లక్ష్మి చాలా బాగా విమర్శిస్తునాది గదా! ఈమె కంచేత చూపెట్టకూడదు "ఆర్టికిల్స్" ముందుగా?" అనుకున్నాడు కృష్ణన్. "ఇదివరకు అంటే చనువు తక్కువగా ఉండడంచేతనూ, భయంచేతనూ స్వేచ్ఛగా మాటాడేదికాదు. ఇప్పుడలాంటి చికాకేమీలేదుగా. ఎంతసేపూ నన్నెదిర్చి వాదిద్దామా అని ఉద్దేశపడుతునాది. సరే, చూదా" మనుకున్నాడు కృష్ణన్.

"లక్ష్మీ! ఇల్లా ఒక్కసారిరా! మళ్ళీ వెళ్లిపోదుగాని" అన్నాడు కృష్ణన్ ఆఫీసు రూములోంచి.

"అమ్మాయిని ఊయల్లో పరుండేశాను. అదింకా నిద్రపోలేదు. వేగం చెప్పం"డన్నది లక్ష్మి దగ్గర కొచ్చి. "కూచో చెప్తా"నని చేయిపట్టుకొని కుర్చీలో కూచోపెట్టి—

"లక్ష్మీ! ఇదుగో చూచేవా, గమత్తుగా క్రొత్త "ఫేషన్సు"తో కథలువ్రాస్తునాను. ఇలాంటివి మన "ఇండియన్ లిటరేచర్"లో లేవు. పాశ్చాత్య పద్ధతుల ననుసరించి వ్రాశాను. చూడు. చదువుతాను. సాంతంగా విని నీఅభిప్రాయం చెప్పాలి తుదిని" అన్నాడు కృష్ణన్, చెయ్యిపట్టుకొని లక్ష్మిముఖం కేసి చూస్తూ.

"నాకు విమర్శించేపాటి శక్తుందా? మీరు వ్రాసేదాన్ని" అన్నది లక్ష్మి సవిలాసంగా చిరునవ్వుతో.

"కాదు. ఒక్కొక్కరి బుద్ధిలో ఒక్కొక్క విశేషముంటుంది. ఇదేమో నీకు తెలీనిభాషకాదుగా" అన్నాడు.

"ఏవో క్రొత్తగా ఇంగ్లీషుపద్ధతుల్లో వ్రాస్తునా మన్నారు. నాకు తెలీకనో, నచ్చకనో, బాగులే దంటే వ్రాయడం మానేస్తారా మరి? అదీకాక ఇదింకా వ్రాస్తునారుగా. పూర్తికానీండి. తొందరెందుకు? సగం విన్నతర్వాత మీముఖ్యోద్దేశం

తెలీక నే బాగులేదంటే మరి కోపమువస్తుందేమోని?" అన్నది లక్ష్మి కళ్ళతో నవ్వుతూ—

"పోనీ నేను పూర్తిగా వ్రాసిన పుస్తకం ఇంకో టుంది. అది చదవనా? ఏదైతేనేమి నీఅభిప్రాయం తెలుసుకుందికి. అదీ ఇల్లాంటిదే. సాంతంగా వింటా నంటే చదువుతాను. ఇదిగో"—అన్నాడు కృష్ణన్ పేజీలు తిప్పుతూ—

"ఓహో! ఈపుస్తకమా, నిన్న నేను చదివేను మీ టేబిల్లోంచి తీసి. ఇప్పుడు మరెందుకు అది చదవడము?" అన్నది పెదవి విరుస్తూ—

"నేను లేనుగా, నువ్వు చదివేటప్పుడు." అన్నాడు కృష్ణన్. "మీరు లేకపోతే ఆపుస్తకం చదవలేరా? లేక చదవకూడదా? "పబ్లిష్" చేస్తె అందరి దగ్గర కూచొని చదివిస్తారా ఏమి" టన్నది లక్ష్మి.

"అయితే సరే, నిర్మొగమాటంగా నీయాశయ మేదో చెప్పు. ఉచితంగా చెప్పవలసిన విషయ మంటె భయపడకు. పుస్తకంలో నీకెక్కడైనా తెలీని విషయమున్నా, సందేహాలున్నా, అడుగు చెప్తాను.—కానీ—"అన్నాడు కృష్ణన్ చెయ్యిపట్టు కొని ఆడిస్తూ,—

"ఏమి చెప్పమంటారు. మొదటనుంచి కొసదాక నేను చెప్పేదంతా మీకు వ్యతిరేకంగానే కనిపిస్తుం దనుకుంటాను. మీరు వ్రాసింది బాగులేదంటె మీ కాగ్రహంవస్తుంది.—సెలవీయండి నిద్దరొస్తున్నా"ద న్నది లక్ష్మి నిల్చొని.

"నిన్న చెప్పమన్నానుగా, నేను. నీఉద్దేశ మెట్లాఉంటే అదేచెప్పు. దానికి సందేహమెందుకు? నిద్దరొస్తునాదనా! నేనుమాత్రం నిద్రపోనా," అన్నాడు కృష్ణన్.

"సరే అని పుస్తకం చేత్తోపట్టుకొని పేజీలు తిరగేస్తూ......ఏదైనా వ్రాసినదాన్ని విమర్శించడ మంటే అందరూ పెద్దలే, కాని వ్రాయడమంటే మాత్రం ఉంటాడో ఉండడో వెయ్యికొకడైనా! పద్యరచనకంటె గద్యరచనే కష్టమనుకొంటాను. ఎంచాతనంటే యతిప్రాసలతో నీరసంగా ఒక తడిక నల్లినా కవిత్వమనుకొని సంతోషించేవాళ్లు కొంద రుంటారు. కాని, కల్పనావైచిత్రి, భావనాశక్తి, లేందీ గద్యరచనకు సంతోషించేవాళ్లరిది. అదీకాక కేవలపద్యరచనే కవిత్వమనుకొనేవాళ్లు కొందరుం టారు. కాని......

కవిత్వమంటే సుందరమైన పద్యరచనేకాదు. సుందరమైన ప్రతివస్తువులోనూ ఉందికవిత్వం. ఆ వస్తువును చూచేటప్పు డల్లా ఆవిర్భవిస్తూంటుంది. అదీకాక కవిదృష్టికి అసహ్యమయిన పదార్థమంటూ ఉండదనుకుంటాను. ప్రతిది వానిదృష్టికి సుందరం గానూ, మనోహరంగానూ, కనిపిస్తూంటుంది. కవి అనేవాడికి గోచరించని పదార్థమంటూ ఉండదు. కనకనే మనకు తెలీని యెన్నో విషయాలు, చాలా విశాలంగానూ, మనోహరంగాను, మనకు చూపెడ తారు. వారి శక్తి అద్భుతం. శ్మశానానైనా దివ్యభవనం చెయ్యగలరు. రెక్కలు లేకపోయినా అంతరిక్షంలో పరుగెత్తగలరు. వారిది కామగమనం. వారికగమ్యమెక్కడా ఉండదు. వారిభావనాశక్తి ఆశ్చర్యంగా ఉంటుంది. స్వల్పమైనదానైనా, అధికంగా చెయ్యగలరు. ఇంత ప్రతిభాశాలిఅయినా, ఇంత నిరంకుశప్రభావం కలవాడైనా, కవి, లోకాన్ని చూస్తూంటాడు ఏమంటున్నాదా అని. ఇదంతా లోకంమీద ఆధారపడి ఉందనుకొంటాడు. ఆత్మానందంకొరకు లోకంమీద ఆధారపడడమెం దుకా, అంటె "ఆపరితోషాద్విదుషాంనసాధుమన్యే." అంటాడు సత్కవి. నిజంకూడఅంతే. తనుచేసింది మంచిపని అనుకొని సంతోషించుతూన్న స్థితిలో తనలాంటివాళ్ళు సంతోషించడాని కింకావున్నా రంటె అధికమవుతుందిగా, సంతోషం. అంచేతనే, కొన్నివిషయాల్లో స్వతంత్రించినా, కవి, ప్రయోజ నాన్నిమాత్రం గమనిస్తూంటాడు. ఎంత క్షుద్రవస్తు వును లక్ష్యంగా చేసినా, అందులో కొన్ని సదుపదేశా లుండకపోవు. అందులో కొన్ని ఆదర్శాలుండక



స్వాగతము

శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయిగారికి— శ్రీమతి చుండూరు రత్నమ్మగారు, ఏలూరు.



హరిజనులు—నీటికొళాయి



మిస్. మోనికాదత్తు బి. ఎ., బి. టి. గారు

ఈమె, వంగకవయిత్రి మిస్. తోరూదత్తుగారి మేనకోడలు, కలకత్తాలో విద్యాభ్యాసముచేసి అఖిల భారతమహిళావిద్యాసంఘమువారి ఉపకారవేతనముతో కేంబ్రిడ్జివెళ్లి పై పరీక్ష ప్యాసయినది. ఈమె ఇంగ్లాండులోనే గొప్ప సంగీత పరీక్షలు శరీరవ్యాయామ పరీక్షలు ప్యాసయినది. దత్తు కుటుంబములో నీమె యే ప్రథమ పట్టభద్ర. విక్టోరియా బాలికా ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయిని.



మిస్. సరోజినీ మాతాక్

అమృతసరవాస్తవ్యులు ప్రొఫెసరు మానోమోహన లాల్ గారి పుత్రిక. వయస్సు ఆరు సంవత్సరములు. తన నృత్యకళావిశేషమువలన అనేకసభికులను రంజింపజేయుచున్నది.

పోవు. ఇంకో సంగతి. స్వచరిత్రలను కూడా కావ్యంగా సంఘటించేవాళ్ళు లేకపోలేదు. ఉన్నా సామాన్యంగా "కావ్యంయశసే... ఉపదేశయుజే" అన్నట్లు ఇందుకు తగే ఉంటుంది కొంతవరకు. ఒక గ్రంథాన్ని వ్రాశాడంటే, కవి, స్వానుభవాన్ని కొంతవరకు మేళవిస్తునే ఉంటాడు. అంచేతనే వారి గ్రంథాలను బట్టి కొంతవరకు ఆకవుల అనుభవాన్ని తెలుసుకోవచ్చునంటారు విమర్శకులు. కాదనడానికేం. మీరు నిర్భయంగా చెప్పుతున్నారు కాబట్టి నా ఆశయాన్ని మనవి చేస్తున్నాను.—

ఏకో అల్లిబిల్లిగా ఒకతడిక నల్లినంతమాత్రాన ప్రతీవాడూ, కవి అవుతాడా? ఆవ్రాతల్లో ప్రాపంచకజ్ఞానం ప్రతిఫలించాలి. సంవిధానం సరసంగా నుండాలి. కథలపుస్తకమయినా, కల్పనావైచిత్రి కనిపించాలి......ఆకథలకు ప్రత్యేకంపేర్లు రమణీయంగాఉన్నా మొత్తంమీద నామకరణంమాత్రం గ్రంథానికి సమిష్టిగానుండాలి. చూశండి—కవీంద్రుని కథాగుచ్ఛం. నాల్గయిదు కథల్లోను ఒక కథ పేరా గ్రంథానికి నామకరణంచేస్తే, ఇంత మనోహరంగా ఉంటుందా? సరే—యీసంగతిట్లా ఉండనీండి. గ్రంథంలో స్వానుభవం ఎక్కువగా ఉండాలనడంచేత కాబోలు ఈపుస్తకంలో మీరు ఉదయం మొదల్కొని తెల్లవారేసరకు చేసేదంతా వ్రాశారు. ఎక్కడచూచినా మీగంభీరౌదార్య వర్ణనలేనా పేజీ తిప్పేసరికల్లా? "చెంబకుచారడేసి కళ్లూ, అణిముత్యాల్లాంటి పళ్ళూ, కుందనంవంటి ఒళ్ళూ," అంటూ మీ వాళ్ళను వర్ణించుకోలేక లోలో మురిసిపోతూండడమేనా? మీదాంపత్య సుఖంలో సౌష్ఠవముంటే ఉండుగాక. అందులో లోకానికి ఆదర్శప్రాయమేమీ లేదుగద. అపూర్వ విషయాలు సదుపదేశాలూకూడ అంతేగదా? అట్టి స్థితిలో- రాత్రింబవళ్ళు విచారించవలసిన స్థితిలో— ఇంతకంటే తెలివితక్కువలేదని పరితపించవలసిన స్థితిలో, ఎంతో, గొప్పగా, గమ్మత్తుగా వ్రాశానని సంతోషించడంకూడానా?—

ఇంకో సంగతి—ఎక్కడచూచినా వంకపాపిటలు, వాల్జడలు, వాయిల్జాకట్లు, లేసుచీరలు, 'లేడీయుష్' రిష్టువాచీలున్నూ. ఇంతేగా మనసౌభాగ్యం! మాదగ్గర కూడా ఇట్లాంటి సుందరతర విగ్రహాలున్నాయని ఎడ్వర్టయిజుమెంటా లోకానికి? మీ వాల్జడలతోనూ, మీవంకపాపిటలతోనే మీరు సంతోషిస్తూ, ఈనూతనవేషాన్నే అభినందిస్తూ, కుచ్చెళ్ళకు చాలని పంచ, ఒంటినిండా పసుపు, నుదుట డబ్బంత కుంకుమ, చాలీచాలని ముదుగురవిక, మధ్యపాపిట, అందెలు, మట్టెలు, మెళ్లో చిటికెడేల్లావు బంగారు తాడు వీటితో అమాయకంగాను అనాగరకంగాను కనిపించే పుణ్యానువాసినీల వేషాన్ని నిందిస్తున్నారు. కాని అందులోనున్న - నిర్మలమైన—పవిత్రమైన—గభీరాశయాన్ని తెలుసుకోలేక పోయేరుగదా! అదీ కాక-ఈకొప్పుపిన్నులు కొత్తగామారారా? ఈ వాల్జడలు ముందుగా మీరే పోల్చేరా? ఈ లేసు చీరలు మొట్టమొదట మీరె చూసేరా? లేదే. అయినా అప్పుడెక్కడో ఉన్న వేషం ఇప్పుడెక్కువగా తిరుగుతుందన్నమాట. ఎలాగైనా సుందర వేషంతో మాపరహృదయాన్ని చూరగొందామన్న ఉద్దేశం లేకపోవడంచేత వాళ్లకీవేషం రుచించక పోవచ్చు. అంచేతనే కాబోలు మీకళ్ళ కసహ్యంగా కనిపిస్తున్నారు.

సరే—ఇంకో విషయాన్ని చూదాం. చాలాచోట్ల స్త్రీసంఘానికి తోడ్పాటుగా కొన్ని సదుపదేశాలు ప్రారంభించారు. మీరుకూడ సంఘసంస్కర్త ననిపించుకుందామనా? "ప్రతీసంస్థలోనూ స్త్రీలకు ప్రత్యేక ప్రాతినిధ్యంకావాలి. పురుషులతో సమానంగా సమస్తవిషయాల్లోను స్వతంత్రం ఉండాలి. బహిరంగంగా స్త్రీలుకూడ సాంఘికవిషయాల్లో పాల్గొనాలి." అంటూండడమే కాని స్వవిషయంలో మాత్రం పనికిరాదు. మీరు కచేరీకెళ్లాక, ఏపురుషుడితోనో, ఏస్త్రీతోనో, కాస్తపేదన్నా మాటాడేమంటే—సిద్ధం బెత్తుపట్టుకొని, ఎవరాజ్ఞపై వెళ్లావనుకుంటూ. ఇంటిదగ్గర మమ్ములను దాసీలగాతలంచి,

బాహ్యప్రపంచంతో సంబంధం కలిగితే మీ మోసాన్ని తెలుసుకుంటామన్న దురుద్దేశంచేత మమ్ములను ఉన్నతస్థితికి రానియ్యకుండా, — పైపెచ్చు శ్రీరంగ నీతులు గంభీరంగా చెప్పడానికైనా వెనుదియ్యరు గదా! జపించేవి మంత్రాలు, దూరేవి గుడిశలన్నట. ఆశయాలేమో మంచివే. కాని, ఆచరణ మాత్రం సున్న. కాకపోతే — భేదదృష్టి ఉండకూడదన్న మహామహులంతా - తప్పక ప్రాముఖ్యం ఉండాలన్న ప్రతిభాశాలురంతా — వ్యక్తిత్వం కావలన్న బుద్ధిమంతులందరూ — వాళ్ళు లేని సంస్థలకు ప్రాధాన్యముండకూడదన్న వక్తలంతా — తాము చెప్పినట్లె స్వవిషయంలో ఆచరించినట్లయితే, మన దేశానికి — సంఘానికెన్ని, ఇట్టి దుర్దశ — ఇంత నీచస్థితి — ఈ బానిసతనము — మన్నింత పీడిస్తుందా? మీకు మాత్రం తెలికపోదు. చూడండి — దేశాంతరాల్లో కూడా పురుషులు ఇట్లాంటి శ్రీరంగనీతులు పలికేవాళ్లే అయితే, స్త్రీలింత ఉన్నతస్థితికివచ్చి దేశోపకారంలో ముఖ్యస్థానాన్ని పొందగలరా? — రష్యా, యూరపు, అమెరికా, మొదలైన దేశాల్లో మహాసంగ్రామస్థితిలో కూడ స్త్రీలు తగిన ధైర్యసాహసాలు చూపించారంటే — ఎందుచేత? — సంపూర్ణ వ్యక్తిత్వమేగా? — అందుచేత ఆచరణలేని వ్రాతలేల?

ఇంకోసంగతి — "స్త్రీలు ఏ విషయంలోనైనా మంచిధైర్య సాహసాలుపయోగించి, తగిన త్యాగాన్ని చూపించగలరు. వారిబుద్ధి చాలా సూక్ష్మమయినది కాబట్టి దాన్ని వినియోగించి మంచిగౌరవాన్ని సంపాదించగల"రని మీరు పైకనకపోయినా, మీ అంతరాత్మకు దృఢంగా తెలిసే ఉంటుంది. అందుచేతనే మామూలంగా మీరు గౌరవం సంపాదించడానికి ప్రయత్నిస్తున్నారు. అట్లాగే తనభార్య గొప్పదనుకుంటే తనకు గౌరవముగదా, అని కాబోలు చాలా చోట్ల — లేకపోయినా, నేననకపోయినా, నా ఉద్దేశాలు భిన్నంగా ఉన్నా, నాముఖంగా మీరే మాటాడుతూ నన్ను పెద్ద ప్రొఫెసరుగా వ్రాస్తూవచ్చారు. మాకు తగిన ఉపకారం చేదామనుకొని, లేనిపోనివి మాయందారోపించి, మా ఆశయాలు భిన్నంగా ఉన్నా మధ్యవరచి మీభావంతో అయిక్యంచేస్తూ మావ్యక్తిత్వాన్ని నశింపచేస్తున్నారు. కాని మమ్ములను గౌరవించడం కాదది. ముప్ఫైయేళ్ళు పాముపేర్చి ముసలిదాన్ని యెదురుకున్నట్టు యెవడో. — మీ తీక్ష్ణ బాణ పరంపరలు, మేమంటే చాలా వేగంగా బయల్దేరుతాయి. సరే దీనిమాటకేం. ఇట్లాంటి గ్రంథాలను వ్రాసి కొందరికి తెద్దునా, అందరికి తెద్దునా అన్నట్టు మాపని ఒకవూలనుంచి అవుతున్నా ఆత్మగౌరవానికికూడా హాని తెచ్చుకుంటున్నారు. కొన్నిచోట్ల హృదయసంకోచంకూడా వెల్లడౌతూంటుంది. రవీంద్రునికథలు చూడండి కవివిశాలహృదయాన్ని ఎట్లా చూపెడుతున్నాయో! చిన్నచిన్నకథలైనా మంచిముద్దుగా ఉదారంగానూ, గంభీరంగానూ, ఉంటూ యాశయాలు. అందుచేతనే కవిదృష్టికి ప్రతీది గంభీరంగానే కనిపిస్తుందంటారు. గ్రంథాలవల్ల కవి హృదయంకూడ తెలుస్తూంటుంది లోకానికి. కాబట్టి ఇట్లాంటి సంకుచితభావాలను ప్రకటనచేసి హృదయవైశాల్యాన్ని తగ్గించుకున్నకంటె వేరేవత్తిముంది" అన్నది లక్ష్మి. పాపం చాలా సేపటినుంచి మాట్లాడడంచేత చిన్న ఆయాసం కలిగిందామెకు. చిన్న నిట్టూర్పువిడచి, "క్షమించండి! పట్టుదలచేత కాదు. నిష్పాక్షికంగా చెప్పమన్నారు కాబట్టి నా ఉద్దేశం తెలియజేసే" నన్నది లక్ష్మి చిరునవ్వుతో.

లక్ష్మి ఇట్లా చెప్తుందనుకోలేదు కృష్ణన్. నేను విద్యావంతుడననే గర్వం కొంచెం ఉందనీ, ఏమన్నా శాంతంగా ఊరుకుంటాననిన్నీ తలచి ఇట్లా మాట్లాడిందేమో అనుకున్నాడు. కాని, మళ్ళీ లక్ష్మి చెప్పినదాంట్లో నిజంలేకపోలేదు. నేను చెప్పమని బలవంతంచెయ్యడంచేత స్వాభిప్రాయాన్ని నిర్భయంగా చెప్పిఉంటుందిట్లా. అంతేకాని నాదగ్గర పాక్షికంగా మాట్లాడుతుందా లక్ష్మి యెప్పుడైనా, అనుకున్నాడు కృష్ణన్.

"లక్ష్మీ! చాలా బాగానే మాటాడావు. అయితే ఏంలేకపోయినా నిన్ను ప్రొఫెసరుగా వ్రాసేనన్నా నేమి మరి?" అన్నాడు కృష్ణన్.

ఇంతలో ఊయల్లోపిల్ల ఏడుపు ప్రారంభించింది. "ఇంక చాలివాళకి. చాలారాత్రి అయింది. నిద్ర కూడా వస్తూంది," అంటూ వెళ్ళిపోయింది లక్ష్మి పిల్లను తీయడానికి.

# చిట్టి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

అది బొమ్మల నోముకు ఆరంభదినం. వన్నెవన్నెలచీని చీనాంబరాలూ రకరకాల స్వర్ణాభరణాలూధరించి స్త్రీలూ బాలికలూ మేళతాళాలతో సావిత్రీగారు వెంట ఊరేగుతున్నారు. చిట్టి ఆఉత్సవం చూచింది. తానూ వారిలో ఒకతై ఉత్సవంతో వెళ్లితే ఎంతబాగుంటుంది అనుకున్నది. మనస్సు సంతోషంతో నిండిపోయింది. తనువు ఉత్సాహంతో పొంగిపోయింది. ఆపుకోలేక పోయింది. ఒక్కగంతుతో అమ్మదగ్గిరకు పోయింది. దొడ్లో నిర్జీవప్రతిమలాగ వాళ్ళమ్మ యేదో పనిచేసుకుంటున్నది. మేళతాళాలు ఆమెకు వినబడుతునే ఉన్నవి. కాని ఎందుకో ఆమెకు చూచే ఉత్సాహంలేదు. చిట్టికి ఆతల్లి దైన్యంగుర్తించే యీడు కాదు. "అమ్మా! చూచావూ" అన్నది సంతోషంతో. "ఏమిటమ్మా"అన్నది తల్లి. "వాళ్ళంతా సావిత్రీగారు నోమునోచుకోడానికి వెళ్లుతున్నారే, నేనూ నోచుకోవద్దూ" అన్నది ముద్దుగా చిట్టి. తల్లి ముఖమింకా వాడిపోయింది. కనుకొలుకులు నీళ్లతో నిండినాయి. "ఏమేఅమ్మా! నాకుగూడా ఆనోము పట్టించవ్రూ" అన్నది మళ్ళీ చిట్టి మారాముచేస్తూ. జవాబీయక తప్పలేదు తల్లికి "వాళ్ళంతా పెండ్లైనవా"ళ్ళన్నది తల్లి. "అయితే నాకూ అయిందిగా, నేనెందుకు పట్టగూడదు నోమూ"అన్నది చిట్టి మెళ్ళో మంగళసూత్రం చూపిస్తూ. తల్లి కండ్లవెంట నీళ్ళు జొటజొటవచ్చి చెక్కిళ్ళమీద జారినవి. చిట్టి తెల్లబోయింది. శారదా ఆక్టు రాబోయ్యేటప్పుడు తనకు మూడోయేటనే పెండ్లైందనీ, ఆ మఱునాడే తనభర్తపోయినాడనీ తానిప్పుడు విధవననీ, తానే నోములూ వ్రతాలూ పట్టరాదనీ ఆ బాలకేమి తెలుసు?

ఆమె కిప్పుడు యేడేండ్లేగా పాపము!

# సెంట్ హెలీనా

కామరాజు కృష్ణమూర్తిగారు, ఎడ్వొకేటు, హైకోర్టు.

నెపోలియను చరిత్ర తెలియనివారుండరు. నెపోలియను ప్రతిభ, అసమానశౌర్యము, దూరదృష్టి, తెగింపు-అందరికి తెలిసిన విషయములే. రాజ్యతంత్రంలో కూడా ప్రఖ్యాతి సంపాదించాడు. యూరపు ఖండాన్ని నిద్రనుంచి మేల్కొల్పి, ఒక విదళింపు విదళించాడు. పరాసుదేశముయొక్క అంతర్జాతీయ ప్రతిభ నిలపెట్టాడు. ఇరవయిసంవత్సరాలు యూరపుని పాలించాడు. పరాసుదేశమే తనకన్న ఎక్కువగా భావించి, తాను రాజుగానున్న యెడల దేశశాంతికి భంగముకలుగునని ఎంచి, తన పదవిని వదలిపెట్టిన మహాయోధుడు. కాలవశాన్ని 1815 సంవత్సరములో, 'వాటర్లూ' అనే ప్రదేశంలో, యూరపు, ఆంగ్లేయసేనలు, ఆయన్ని ఓడించాయి. చరిత్రకారులు వ్రాసినట్లు "వెల్లింగుటన్ గెలువలేదు. నెపోలియను ఓడిపోయినాడు." ఆయన ఓడిపోవటానికి కారణాలు ఆయనే చెప్పాడు. "మిత్రద్రోహం-నా సేనానాయకులే నన్ను మోసపుచ్చారు." "నాదుస్థితికి నేనేకారణం......" అపుడు నెపోలియనుని, నెపోలియనే పడతోయాలి. యోంధ్ర మయింది. ఎక్కడకు పోదామా అని ఆలోచన.

సేనాని:—యింగ్లీషువారు పట్టుకుంటే.

నెపోలియను:—తెగించాలి—ప్రభుత్వము మంచిది కాదు. కాని గొప్పదేశం-వారు ఉదారస్వభావులు. యింగ్లీషువారు నన్ను తగురీతి చూస్తారు. కాని వెల్లింగ్‌టన్ చేతచిక్కి రాజకీయ బందీవలె లండన్ పురవీధులందు త్రిప్పబడుటకు ఒప్పుకోందునా—పూర్వపు కింగ్ జాన్ వలె? యితర స్థలములకు పోవలెను.

సేనాని:—రాజప్రభూ! మీరు పలాయనంచేస్తారా!

నెపోలియను:—పలాయనమా! నీవేమి మాట్లాడుతున్నావో తెలుసునా?

సేనాని:—యింగ్లీషువారు మీకోసము కాపలావేసి వుంటారు. మీ...అంతం...తగురీతిని వుండాలి.

నెపోలియను:—ఆత్మహత్యా! హానిబాల్ వలె. అది మతిస్థిమితం లేనివారు చేసేపని. కర్మజరుగవలెను. గాని 'నా' చేతులలో బ్రతుకవలసిన రోజులను తగ్గించను."

చివరకు యింగ్లీషువారి ఆధీనములో వుండదలచుకొని ఒకవుత్తరం వ్రాసాడు.

"నాయొక్క రాజకీయ జీవితం సమాప్తిచెందనది—థెమిస్టాక్లీసు జీవితమువలె. మీమర్యాదకు లోనయ్యెదను. ఇంగ్లీషు 'లా' రక్షణలో నుండెదను. శత్రువులలో పరమశత్రువయి, పట్టుదలగల శత్రువులగు మీరక్షణలో వుండుటకు ఏర్పరచుకొన్నాను—

ఇట్లు, నెపోలియన్."

ఈవిధంగా ప్రిన్సు రీజంటునకు వ్రాసి యింగ్లీషు నాకయుగు 'బెల్‌ఫరోన్'కువెళ్ళి "నెపోలియను, ఆంగ్లేయులవద్ద ఉచితమయిన గౌరవమును పొందుతాడు" అని చెప్పాడు. పరమ శత్రువులయిన ఆంగ్లేయుల శరణుచొచ్చి-వారి ఆదరణలో, వారి గౌరవములో వారికీర్తిలో ఎంతనమ్మకం వుంచాడు!

నెపోలియన్ వ్రాసిన వుత్తరానికి, ఆంగ్లేయుల ప్రత్యుత్తరం "అంతర్జాతీయ శాంతికి హానికలుగజేయుదువని మాకు నమ్మకముకలదు కావున నిన్ను 'సెంట్ హెలీనా' అను లంకలో రాజకీయ బందీగా వుంచుటకు నిశ్చయించినాము" అని.

ఎంత నమ్మకం వుంచాడో అంత ఆశ్చర్యం, ఆవేశంకలిగింది "నేను రాజకీయ బందీనికాను. ఇష్టపడి మీనౌకకు వచ్చాను. మీ రక్షణకు లోబడి వచ్చాను.—మీ మర్యాదలలో నమ్మకంవుండి. లేనియెడల నాజాతీయ పతాకం ఎగురుచున్న 'రాక్ ఫోర్టు'వకు పొయ్యేవాడిని. లేక సాధారణపు మనిషివలె నాస్వజనంతో వుండేవాణ్ని. నేను మామూలు మనిషివలె వచ్చాను. మీ నౌకానాయకుణ్ణి అడిగి వచ్చాను ప్రభుత్వపు ఆజ్ఞవున్నదని చెప్పాడు, నేను

నెపోలియనెడల మీ ప్రభుత్వం, చాలా అక్రమంగా ప్రవర్తించినటు లవుతుంది. మీ జాతీయ పతాకమునకు అప్రతిష్ఠ తెచ్చిపెట్టిన వారవుతారు. సెంటుహెలినా నన్ను రెండునెలలో చంపుతుంది. రోజుకు రెండువందలమైళ్లు స్వారిచేసే అభ్యాసముంది. ఈచిన్నలంకమీద స్వారిచేయుటకు ఏమి వీలవుతుంది? మీ ప్రభుత్వము నన్ను చంపదలచుకొన్నయెడల—ఆపని యిక్కడనే చేయకూడదా! రాచగౌరవమునకుతగినట్లు ప్రవర్తించుటకు మీ ప్రభువునకు అవకాశము కలిగినది. మీ దేశమునకు గర్భశత్రువుని. అటువంటివారి రక్షణలోనికి స్వయముగా నమ్మి వెళ్ళుటే ఒకగొప్పసంగతి. ఇప్పుడు చేయదలచుకొన్నది—యింగ్లీషువారికి మరువరాని అపకీర్తి" అని చెప్పెను.

## (౨) సెంట్ హెలీనా

ఆలంక చరిత్ర ఏమి! అగ్నిపర్వత సృష్టి. లంక అంతయు రాతిగుట్టలే. ఆలంకలో సార్వభౌముడు, కాలుపెట్టగానే నేలక్రుంగింది. సార్వభౌమనెపోలియన్ను ఆహ్వానిస్తోంది మరణదేవత! ఆలంక అట్లాంటిక్ మహాసముద్రంలో వుంది. దానికి ఆంగ్లేయ ఫిరంగుల కాపలా. ఆలంకలో వుండుజనం—సంవత్సరానికి ఒక నెలరోజులు వ్యాపారం నిమిత్తం వుండే అయిదువందల 'తెల్ల' యజమానుల సేవకొరకు—పన్నెండువందల చైనా, నీగ్రో బానిసలు.

శీతోష్ణస్థితి దుర్భరం. ఎండ వానలు మెండు. ఆలంక ఈక్వేటరుకు దగ్గరగావుండుటచేత, ఓర్వజాలని ఎండ—ఉక్క—కాస్తలో వాన. ఆ లంకలో సేవలను నిలకడగా వుంచాలని ఆంగ్లేయులు ప్రయత్నిస్తే, సహంమంది గతించారు. ఆ లంకలో, ఒక ఎత్తైన గుట్టమీద, 'లాంగువుడ్డు' అనే ప్రదేశంలో (ఆ లంకలో బానిసలు ఆ స్థలాన్నే 'డెడ్డువుడ్డు' అంటారు) ఒక ఏబది సంవత్సరాలు గావున్న ఒక గుజ్జపుశాలను బాగుచేయించి ఆయనకు భవనం ఏర్పరచారు. అదే ఆయన మరణగృహం అయింది చివరకు. నెపోలియన్‌తో వచ్చిన సొంతనౌకర్లు గాక ఆయనకు పరిచారకులు ఎవరు? ఎన్నాళ్లనుంచో ఆ గుజ్జపుశాలలో నివసిస్తున్న బలిసిన మూషికాలు.

ఆ లంకకు గవర్నరుగా 'సర్ హడ్సన్‌లో' గారిని నియమించారు. 'లో' ప్రభువు నెపోలియను జీవితాన్ని దుర్భరంచేశాడు. లేనిపోని నిర్బంధాలు పెట్టాడు. ఎప్పుడు నెపోలియను పారిపోతాడో అని భయం. నిరంతరంకాపలా! రోజుకు రెండు వందల మైళ్లు స్వారిచేయు నెపోలియను ఎనిమిది, తొమ్మిది మైళ్లకంటె స్వారిచేయకూడదు. అదయినా వంటరిగా వెళ్లకూడదు. ఆంగ్లేయ యుద్యోగి వెంబడించాలి. విషమస్థితికి వచ్చింది. నెపోలియను యిది భరించలేకపోయ్యాడు. అసలు స్వారియే చాలించాడు. శరీర దౌర్బల్యం ఎక్కువయింది. దీనికి తోడు మంచినీళ్లు, మంచిపాలు కరువయ్యాయి. వస్తువులు తాకట్టు పట్టికొనేవాళ్లు తాకట్టు తీసుకొనగూడదని శాసించాడు ఆ 'లో' ప్రభువు. ఎన్నివిధాల నిరసనచెయ్యాలో చేస్తుండేవాడు. క్రొత్తవిధాలు ఆలోచిస్తూవుండేవాడు. డాక్టరు ఓమెరా అను ఆంగ్లేయుని తీసివేశాడు, నెపోలియను దేహస్థితి ఆ లంకలో వుండుటవల్ల చెడిపోతున్నదని యింగ్లాండులో చెప్పాడు కాబట్టి. రహస్యపత్తేదారులతో నింపాడు ఆ లంక అంతాను.

ఒకరోజున 'లో' ప్రభువు నెపోలియనుని కలసుకొని "నీవు కర్చు ఎక్కువ పెడుతున్నావు. కర్చు తగ్గించు" అన్నాడు. నెపోలియనుకు ఆగ్రహం వచ్చింది. "ఈవిషయం నాతో మాట్లాడుటకా వచ్చింది! నీవు ఒక జైలరువి. నీవు బందిపోటు, నాయకుడవు. పేరుపొందిన ప్రతిఆంగ్లేయ సేనానాయకుడును నాకు తెలుసును. ఎప్పుడయినా నిజమయిన సిపాయిలకు నాయకుడవుగావున్నావా! అటువంటి సిపాయిలతో విందారగించటానికి ఒప్పుకొంటూ,

నా దేహాన్ని కష్టపెడుతావు నీవు. నా హృదయాన్ని చలింపచేయలేవు. యూరపుఖండమంతా నా ఆజ్ఞకు కనిపెట్టుకొని వుండగా నా హృదయంలో ఎంత పౌరుషము వుండేదో—యిప్పుడు ఈ లంకమీద అంతే"—'లో' భయకంపితుడయి, గుడ్డాన్ని దొడు ఎత్తించాడు.

ఇంకో రోజున నెపోలియను యింట్లో వున్నాడో లేదో అని ఆయన్ని చూడాలనుకొన్నాడు 'లో' ప్రభువు. కబురు పంపాడు వాకిట్లోనుంచుని. 'లో' ప్రభువునకు వినుపించిన మాటలు యివి "యిష్టమయితే గవర్నరుతో తలారిగొడ్డలి తీసుకునిరమ్మని చెప్పు: నా గదికి రావాలంటే నా శవంమీద రావలసిందే." మరల ఆ చాయలరాలేదు ఆ గవర్నరు.

"నీ కష్టముల సంగతి యూరపులో చెప్తాను" అని ఆయన్ని చూడటానికి వచ్చినవారు అంటే, "మీ యిష్టమయితే చెప్పుకొండి. నేను చెప్పుకొనను. నేను ఆజ్ఞాపిస్తాను. లేకపోతే పూరికేవుంటాను. (I command or else I hold my peace) అని చెప్పాడు ఆ యోధుడు. రెండుసార్లు ఆయన్ని ఆ ఖయిదు తప్పించాలని సహాయంవస్తే నిరాకరించాడు.

ఏప్రిల్ 21-1821. ఆంగ్లేయ డాక్టర్ని పిలపించాడు తన సేనాని బెర్ట్రాండుచేత. "బెరట్రాండు, దగ్గరకురా! నే చెప్పేది ప్రతిముక్క తర్జుమాచేసి ఆ డాక్టరుకు చెప్పు. నా అకాలమరణానికి ఎవరు కారణమో వారికి అపకీర్తి వస్తుంది. ఆంగ్లేయుల స్వాధీనంలోనికి స్వయంగా వెళ్లాను ఆదరణ, మర్యాద చూపిస్తారని. అంతర్జాతీయ మర్యాదలను ఉల్లంఘించి నాకు సంకెళ్లువేశారు. యూరపుఖండరాజులను ప్రోద్బలంచేశారు. నాలుగు దేశములు కలసి ఒక నామీదపడ్డాయి. ఎంత నీచంగా చూశారు ఈ గుట్టమీద? నన్ను చిత్రవధ చేసి చావునకు తీసుకొనివచ్చారు. నా అకాలమరణంవల్ల వచ్చే అవమానం, ఆంగ్లేయరాజసంతతికి వదలిపెడుతాను."

మరణం ఆసన్నమయింది. తన సేనానాయకులను పిలుస్తున్నాడు. "డిసేమాక్స్—మెసీనా! జయం మనది తొందరగా పైనపడండి—చిక్కారు" చివరమాటలు "ఫ్రాంన్సు ఆర్మీ-టీ డి-ఆర్మీ జోసఫైను."

డాక్టర్లు పరీక్షించారు—శవాన్ని. పోస్టుమార్టం చేశారు. అందులో ఒకడాక్టరు "లివరు చూచారా! సెంటుహెలీనా శీతోష్ణస్థితియే కారణం. అదియే సార్వభౌముని అకాలమరణానికి కారణం." అందరు డాక్టర్లు ఒప్పుకోలేదు. వోటు తీసుకొన్నారు. "లివరు సరిగ్గావుంది" అని డాక్టర్ల రిపోర్టు.

నెపోలియను తల్లియగు 'లెటిజా' తన రెండవ పుత్రుని అకాలమరణానికి దుఃఖిస్తున్నది. కళ్లు గ్రుడ్డివయ్యాయి. కొన్నిసంవత్సరాలకి నెపోలియను శిలావిగ్రహం ప్యారిసునగరంలో నిలపెట్టారు. 'లెటిజా'ను తీసుకొనివచ్చి చూపించారు.

"తిరిగి సార్వభౌముడు ప్యారిసు నగరంలోనికి వచ్చాడు" అని కౌగలించుకొని దుఃఖాశ్రువులుచే దీవించింది—రెండవసమారుణ్ని.



# 'నిశావార్త'

తుమ్మలపల్లి వేంకటరత్నము పంతులుగారు

శ్రీరాయశర్మగారు.

ఆర్ద్రయియాపడియున్న మామకమనోరామాంఘ్రిపద్మద్వయీ
భూయఃపాతిపరాగపూగమసృణీభూతస్వరూపప్రథన్
ఆయిన్ నేనొకపుష్పమై, హృదయమాకరందాలి నీరంధ్రవాః
పీయూషంబునఁ బాద్యమిత్తుననినావే! జ్ఞాపకంబున్నదా? 1

నడిగాఁగూసెనుపాలపిట్ట కలవాగ్వైహాయసాహ్లాదియై
పడుకోఁబోయెడునప్డు; శోభనకలాపైశున్యధన్యంబులో
నుడులన్ గిన్నెరలొల్కు; దత్ఫలమిదందోరంతరప్రాప్యలో
గడెదాపాటని, సాగెనాదుమదిలో గంధర్వహూహాహూకృతుల్. 2

గంటల్ తొమ్మిది మ్రోసె మామకఘటీకారంబునన్—మన్మనో
ఘంటావర్త్మలు నీరవంబులయి నిష్కంపంబులయ్యెన్; క్షుధా
లుంటాకోద్యదశోకనై కటికభూలుప్తేంద్రియున్ నన్ను, నీ
వంటీయంటకమాయమైతివి, నవైలావల్లికోల్లాసినీ! 3

నిన్నున్ నన్నెడసేయగా నడుమనెన్నే లేవు పెన్గొండ?, లె
న్నెన్నే నేఱులు లేవు? కాఱడవులెన్నే లేవు? నిర్భీతివై
నన్నీదాటియుఁబాదచారివయి, యియ్యర్ధక్షపావేళ, నన్
మన్నింపన్ జనుదెంచి, తక్షణమెటో మాయంబుకానేటికో? 4

చుక్కలలోనిచందురునిఁజూచి సహింపఁగలేను: పెంటికిన్
ముక్కునఁబెట్టితెచ్చి ఫలముల్ తినిపించుపులుంగుఁజూచి, ఇం
కెక్కడనేదిచూచిన సహింపఁగలే, నిటనీవులేనినా
కెక్కడిశాంతి, మానసనికేతనతోరణ సాలభంజికా! 5

పూటకుపూటకెంతయు, నపూపఁపుఁజక్కెరవెట్టి నీవయిన్
బాటలునేర్పినాను, పొరపాటది, నాకడనేర్చి, నాకె, ఆ
పాటలనొప్పఁజెప్పుచు వివాసనశోకశిఖన్ రగుల్చు, నీ
మాటలప్రోగుచిల్క వెడమాట లబింధనసామిధేన్యముల్. 6

ముక్కున దొండపండుపయిమోపిన చిల్కనుఁజూచి, యీసునన్,
ప్రొక్కపడెన్ మనంబు—శుకపోతముఁ బ్రాప్తఫలానుభూతికిన్
తక్కఁగఁజేసినన్ గలుగు ధన్యతయేమని యెంచకేసితిన్
ఱెక్కలమీఁద,—ఘాతసయిరించునె? యిట్టి వృథాపరాధునిన్. 7

# మగని చెవిలో

"అనసూయ"

(దాన ధర్మాలగురించి)

మీదూబరాకూ, మీ అప్పులకూ తోడు మీకు దానాలూ ధర్మాలూ కూడానా? మీకేలేదు గదా మీ రోకళ్ళకి దానాలూ ధర్మాలూ చేసేస్తూ ఉంటే ఇక మన సంసారము అడుక్కొనితిన్నట్లే ఉంటుంది. గుంటలు పండుగకి గుడ్డలో అని యేడుస్తూ ఉంటే వాళ్ళకి లేదులేదని చెప్పేసి ఈ దానమేమిటి చెప్పండి! పోనీ యేం మహాపాత్రదానమై పోయింది గనుక మీరు గొప్పపుణ్యం సంపాదించినారనుకోండికి! నోరు పెట్టుకొని బతుక్కొని వస్తూయున్న ఆదిబ్బ వాడికి దానమేమిటి? పోనీ వాడేం సెమ్మదిగా బ్రతిమాలి అడుగుతాడా! అలాంటిదేమిలేదు. ఇంటిమన్న వాళ్ళువచ్చి అడిగినట్లే వాడు అడగడం! ఇచ్చేరని మెప్పూలేదు! మీ ముందర యితరులనీ యితరుల ముందర మిమ్మలినీ తిడుతూ ఉంటాడు. అటువంటి వాడికి దానమేమిటి? ఇకవాడు చేయిచాచి పుచ్చుకుంటూఉన్నా మనకేదో అనుగ్రహము చూపించినట్లేగదూ వాడికీవి? ఏచేటూ వాడికి యిదో అలవాటై పోయింది. మీమెత్తదనంచూచి మరీసవారీ అయిపోతూవుంటాడు. ముష్టికి అలవాటుపడ్డవాడు అవసరమున్నా లేకపోయినా అలవాటు బలంచేత చెయ్యిజాచకమానడు పొడుం అలవాటున్న వాడిలాగు. వీడికి యిప్పుడు యీముష్టి అవసరమేమిటి చెప్పండి? కొడుకుల చదువులు పూర్తిఅయిపోయి ఏదో వాళ్ళపొట్ట వాళ్ళుపోషించుకొంటున్నారు. వీడు వాళ్ళని కనిపెట్టుకొని ఉన్నాడు గదా, వీడికి వేరేముష్టెత్తవలసిన అగత్యమేమిటి? మీ పింతండ్రి పెళ్ళానికి ఏదోదూరపు చుట్టమని చెప్పుకోవడం తప్ప మీకేందగ్గర బంధుత్వముగాని మొగమాటము గాని లేదుగదా! మీ పింతండ్రి ఏమిటి యిచ్చేస్తున్నాడు వాడికి? మీపింతండ్రి పేరుచెపితే వీడికి పడదెందుచేత? అతడు ఒకకాణీఅయినా యివ్వడు వీడికి-అందేత అతడి పొడఅంటే వాడికికిట్టదు. మీ పింతండ్రి యేంలేనివాడా? మంచిస్థితిపరుడు, రెండు చేతులాగడించాడు. అతడు ఒకకాణీఅయినా వాడికి దానం యివ్వడని వాడు అతనిగురించి యేమిటంటూ వుంటాడో మీరే యెన్నోసార్లు విన్నారుగదా! వాడు యెంగిలి చేత్తో కాకినైనా కొట్టడనీ వాడు ఉష్ణం యెరువిమ్మన్నా యివ్వడనీ వాడిమొగం చూస్తే మరి ఆరోజున యెక్కడా అన్నంపుట్టదనీ యిలాగు మీపింతండ్రిని గురించి అనడం మీముందరే ఎన్నోసార్లు జరిగిందికదా! యివ్వకపోతే మిమ్మలిని కూడా అలాగు అనవలసినవాడేనా? అటువంటివాడికి దానమేమిటి చెప్పండి?

"అటువంటివాడు గనకనే వాడి నోటికి జడిసి దానంచేయడం"

అది బాగుంది! నోటికి జడిసి దానాలూ, తిట్లకు జడిసి తీర్థాలూ, చేస్తే మరి సంసారాలు ఎందుకూ? అలాగైతే ప్రతీవాడూ తిడుతునే ఉంటాడు! నా పాపమేమి! నేనుకూడా తిడతాను, నాకు ఇన్ని బట్టలూ నగలూ కొనిపెట్టండి! తిడతాడనిచెప్పి పది రూపాయీలు ఒక్కమారు దానంచేసీడమా! "పది రూపాయీ"లని యెవరుచెప్పేరా? వాడే చెప్పేడు! మీదగ్గర అయిపోయిన తరువాత లోపలకువచ్చి నన్ను కూడా ఏమైనా యిమ్మని అడిగేడు. 'నేనేం యివ్వగలను! పంతులుగారు యివ్వలేదా?' అని అన్నాను. 'ఇచ్చేరుగాని' అని అంటూఉంటే 'ఎంతిచ్చేరు' అని అడిగేను. 'పదిరూపాయి లిచ్చేరుగాని—అమ్మా! యెవళ్ళుచేసిన పుణ్యంవాళ్ళదే! ధర్మరాజుతో ద్రౌపది అయినా రథమెక్కి వెళ్ళగలిగిందా స్వర్గానికి?' అని అన్నాడు. అంటే నాకు ఒళ్ళుమండింది. 'పంతులుగారు ధర్మరాజులాగు స్వర్గానికి వెళ్ళినప్పుడు నేనువస్తే

వెళ్లేను లేకపోతే మానేనుగాని నువ్వుమాత్రం ధర్మరాజు వెంటవెళ్లిన నల్లకుక్కలాగు తప్పవు కాబోలు, అన్నాను. అనేసరికి వాడికి కోపంవచ్చింది కాని అప్పుడే పదిరూపాయీలు మావల్ల ముట్టి ఉండడం చేత మరేమీ మాట్లాడకుండా గిర్రునతిరిగి వెళ్ళిపోయాడు. అంచేత పదిరూపాయిలు దానం యివ్వలేదని మీరు మీ అబద్ధపు ప్లీడరీవాదం సావద్దచేస్తే లాభంలేదు. ఇంతదురుసుగా ముందువెనకలు చూడకుండా యిటువంటి దానాలు చేసేస్తూఉంటే కొంపలు రెండెట్లో కూలిపోవడము? ప్రాణంపోయినా మేష్టరుగాని మరియే ఉద్యోగస్థుడుగాని అంతసొమ్ము ఒక్కమారు ఒక్కడికి దానంచేస్తాడా? అసలు మేష్టరుదగ్గరకు వెళ్ళేవాడెవడు? వాడే ఏముష్టివాడిలాగో కనబడుతూ ఉంటాడు! మనయింటివెనకాతల కాలేజీ హెడ్డుమేష్టరు ఉన్నాడు ఎరుగుదురా? నేనడిగితే అతని పెళ్ళాం చెప్పింది. రైలు ప్రయాణమైతే అర్ధణాదమ్మిడీలుతప్ప వాళ్ళకి నిత్యకృత్యములో దానాలూ ధర్మాలూ చందాలు వీటిక్రింద ఖర్చేలేదంది. మీదుమిక్కిలి అంటుంది "మావారేం ప్లీడరాయేమిటి? రెండుచేతులాదోచీడానికీ దానాలూ ధర్మాలూ చేసేడానికీ. ఏదోజీతపురాళ్ళు కడిగేసినవి నాలుగువస్తే వాటిలోనే యిమిడి కాలక్షేపము చెయ్యాలి! మాకు మీలాగు విత్యవ్యమ్మణించడానికి ఎలాగు జరుగుతుందమ్మా!" అని అన్నది. దాని మొగుడికి నూటతొంభైయైదు జీతం మనకు రాబడి నూరైనా నిఖరంగాఉన్నదో లేదో? దీనిలో గుమాస్తాలు, ఇళ్ళద్దెలు, బళ్ళద్దెలు, బంట్రోతులు, వాళ్ళ క్రింద సగం; మన దానాలూ ధర్మాలూ తక్కిన దానిలో సగం; మిగిలిన దానితో మనము చచ్చిచెడీ అప్పులపాలైపోయి జీవయాత్ర! ఆహా! దేనిలో ఉన్నా లేకపోయినా దీనిలో పాలిస్తున్నాము మనము శాస్త్రవిధిని—ధర్మార్థకామమోక్షాలలో ధర్మంక్రింద నాలుగోవంతు ఖర్చుపెట్టడం మూలంగా. పదిరూపాయీల దానమూ ఒక్కమారు! ఒకరూపాయో రెండురూపాయిలో యిస్తారుగాని ఒక్కమారు పదిరూపాయిలా! ఏమని బూకరించి చెప్పేదు అంత పెద్ద భారీదానానికి అగత్యము? శీతాకాలపు శాలువ కోసమా!

ఆహా! ఏమి తెలివితేటలు! ఈకాలంలో శాలువకు పదిరూపాయి లెందుకు? అంత విధిలేకపోతే మీ కే కొనియిచ్చి వేయలేకపోయినారా? అయిదు రూపాయీలకు వీశాలువో ఏకంబళియో దొరక్కపోవునా? లేకపోతే కుండలాలకీ శాలువకీకూడా శాంక్షను చేసి ఆ పదిరూపాయీలు యిచ్చేరా? మీ కలెక్టరూ మున్సబూ అయినా ఇంతేసి దానాలు చేస్తారూ? అసలు మునసబంటే యేఅరవవాడో ఏ నాయుడో ఎరగని దేశంనుండి వస్తాడు. పైకి రాకుండా యింటిలోపలనే గబ్బిలంలాగు కూచొని రెండు మూడేళ్లు కాగానే మరోచోటికి పోతూ ఉంటారు! అంచేత వారికీ యీ దానపాత్రులకీ సంపర్కంవుండదు. ఇకను మేజిస్ట్రేటుగారి యింట్లో నిత్యమూ బంట్రోతులు ఉంటారు. మేజిస్ట్రేటుగారు ఖైదులో పెట్టించేస్తారేమో అన్న భయం. అంచేత వారి యింటికి వెళ్లరు. ఇక కలెక్టరు, జడ్జీలు వాళ్లు సర్వసాధారణంగా దొరలు అయివుంటారు. మన యాచకులు దొరలవైపు తేరిచూడలేరు. బంగాళాలో అడుగుపెడితే తుపాకీపెట్టి దొంకొట్టేస్తాడని భయం. పోలీసువాళ్లు మనవాళ్లైనా, వాళ్ల యింటికి జొత్తిగావెళ్లరు! వెళితే ఏ ఆచోకీ తెలియని కేసులోనైనా ముద్దాయీగా ఎరెస్టుచేసి ప్రాణాలు పుచ్చుకొంటారేమోనని అపరిమితమైన హడలు కాని యేజంకూ గొంకూలేకుండా, ఏ నదురూ బెదురూ లేకుండా, లోపలకు జొరబడివచ్చి, కుర్చీలమీద కూర్చొని తాతగారి సొమ్ము దాచపెట్టినట్లు ముష్టి అడిగిలాగేది మీ ప్లీడర్ల కొంపలలోనే గదూ! పార్టీవాడు కాబోలని మీరు మర్యాదచేసి కూర్చోపెట్టడం! వాడు పార్టీకాక ముష్టిలోనికి దిగడం! ఇలాంటి పరాభవాలు మీప్లీడర్లకి అనేకం జరుగుతూ ఉంటాయిగదూ! అటునుండి యిటు

కూడా మోసపోతువుంటారు అప్పటప్పట! అంతేందుకు! మీపింతండ్రి యెవళ్ళైనా యెరగనివాళ్ళ యింటికి వెళితే తప్పకుండా యేదానమో ధర్మమో అడగడానికివచ్చిన బాపడని అనుకోకమానరు! అవుమగాని మీపింతండ్రి అంత పీసరేమిటండీ! ఒకనాడైనా రైలునుండి కూలివాడిని మాట్లాడడు గదా! ఎప్పుడూ పెట్టె చేత్తోపట్టుకొని యెంతదూరమైనా బెజవాడ యెండలోకూడా నడిచేస్తాడు! ఇప్పుడిప్పుడు నూరుకట్టుకుందికి బట్టలు తెచ్చుకుంటున్నాడుగాని ఇదివరకు అవికూడా ఎవరింట అతడు దిగితే వారు సప్లయి చేయవలసినదేగదా! మీ పింతండ్రేగదూ వారంరోజులు కమాను చేసి పట్టుకెళ్ళిన సొమ్ములో పావలామాత్రం ఖర్చుపెట్టేసుకొని వెళ్ళిపోవచ్చేడు? ఆలాంటివాళ్లదగ్గర కాకపోతే మీలాంటివాళ్ళదగ్గరా డబ్బు ఉంటుంది? అతడికే యీ దానం సంగతి తెలిస్తే మిమ్మలిని బ్రతకనిస్తాడూ?

'బ్రతకనియ్యక ఏంచేస్తాడు? వాడేం నన్ను పోషిస్తున్నాడా యేమిటి?'

అథార్టీ చెలాయించడానికి పోషించాలీ? మీ అమ్మగారు నన్నేపాటి పోషించేస్తున్నారు? 'పెట్టనేరని విభుడు కోపింప పెద్ద' అన్నమాట మీపింతండ్రిలాంటివాళ్ళను గురించిచెప్పినదే! మీరు అనాదుగా వెర్రిమొగం పెట్టుకొని వాడిని ఆశ్రయించుకొని తిరిగినట్లు కనిపిస్తూ ఉంటారు గనుకే మీమీద వాడు అధికారం చెలాయిస్తాడు? పోనీయండి, ఇన్ని గొడవలెందుకు? అతనితో యీదానం సంగతి చెప్పడానికి సెలవిద్దురూ చూద్దాము మీధైర్యము! పదిరూపాయిలంటే అతని కొక యేడాదిరైలు ఖర్చులకీ పైఖర్చులకీ సరిపోతాయి! అయినా, మీప్లీడర్లకు డబ్బు విలువ తెలియదు! సులభంగా, అన్యాయంగా, వచ్చేడబ్బు గనుక మీకు లక్ష్యమూ ఉండదు, ఉన్నా ఆఖరికి అది దక్కనూదక్కదు! ఈఊళ్లో ఎందరు ప్లీడర్లు పనిచేసి గతించేరు? అప్పుచెయ్యనిదే శవము యింట్లోనించి వెళ్లిందా? తాము మామూలుగా ఉన్నప్పుడు నెలకు వందలకొద్దీ ఖర్చుపెట్టిన పంతుళ్లవాళ్లు ఆఖరు దశవచ్చేసరికి నానాయిబ్బందులూ పడిపోయి అప్పులలో మునిగిపోయి కాళ్లూ చేతులూ ఆడక కాలంచేయడం రివాజు అయిపోయింది. ప్లీడరు పోయినతరువాత పచ్చగా ఉన్న ప్లీడరుకొడుకు ఒకడు కనబడడుగదా! ఎంత పాపిష్టి సొమ్మోగాని ఒకతరములోనే కానీ అయినా నిలవకుండా గంగలో కలిసిపోతుంది! మన పెద్దబ్బాయి చదువుకొంటూఉన్న ప్రయిమరీ మేష్టరుట - ముసిలివాడు - మొన్న పోయేడు — అయిదువేలరూపాయీలు ఖంగోరాలు కూడబెట్టేడుట!

'ఎక్కడేనా ఎత్తుకొచ్చాడా యేమిటి?'

మేష్టరునుండా వాడు ఎక్కడనుంచి యెత్తుకురాగలడు? ప్లీడర్లైతేగదూ ఎత్తుకురావడమో, తత్తుల్యమైన పని చేయడమో జర్గించేడనుకొందికి! ఏదో ప్రయివేట్లు చెప్పుకొని, జీతం మిగుల్చుకొని, వడ్డీలకు యిచ్చుకొని, చీమూ నెత్తురూ కూడబెట్టినట్లు కూడబెట్టేడు! మీప్లీడర్లలో ఒకడిని చెప్పండి అలాగు హాయిగా డబ్బు నిలవచేసి అమాయికంగా కాలంచేసినవాడిని! "కాయెళ్ళ భాస్కరరావో?"

చెప్పేదేమిటి! మీపినతండ్రినీ వాడినీతలచుకొంటే ఆలోజన మరి అన్నంనుస్నే! కూని కేసులలో గణించిన సొమ్మున్నాదే, అది కూనీలమీదనేగాని పోదు! చప్పచప్పగా తెలియకుండా జారిపోయేది మీచిల్లర వకీళ్ళదే! అంచేత కాయెళ్ళ వాడిసంగతి చెప్పకండి! అసలు సొమ్మే పాపిష్టి! దానికి తప్పకుండా ఏదో విధంగా గాలిరాకమానదు!

"అంచేతనే ముందుగా దానాలుచేసేస్తే కొంత పుణ్యమైనా ఉంటుందని నేను భారీగా యిచ్చేస్తున్నాను."

చెప్పేదేమిటి మీదానగుణము, కలియుగకర్ణులు! దిబ్బవాడి నోటికిజడిసియిచ్చింది దానమా! కళ్ళూ కాళ్ళూలేక పూటతిండికిలేక కట్టుకుందికీ కప్పుకుందికీ లేక తలదాచుకుందికిలేక బాధపడుతూ వున్నవాళ్లు

ఆసేకులుండగా వాళ్ళకు యేదో తృణమో కణమో మనకు శక్తిగలిగినప్పుడు యివ్వడంమానేసి, యింత పిసరైనా విశ్వాసము లేనివాడికి, తృప్తిలేనివాడికి, దుక్కలాటివాడికి, పదిరూపాయిలు పోసేస్తే మీకు పుణ్యంమాట వెళ్లిపోవస్తుందీ! నీవృత్తిలో యేపాటి పుణ్యమో యిట్టి దానములవల్ల కూడా అట్టి పుణ్యమే! ఏచేటా ఋతువులైనా తప్పిపోతాయిగాని యీ దిబ్బవాడు రాకమానడుగదా తన వార్షికానికి! వార్షికమేమిటి? మీరేం విక్రమదేవవర్మ మహారాజులుంగారా? లేక పూసపాటి ఆనందగజపతి రాజు మహారాజులుంగారా? కాఫీహోటలువాడికి బాకీపెట్టేసి వాడిని మూడునెలలనుండీ తిప్పుతూ వీడికి పదిరూపాయిలు వార్షికమా! ఇలాచేస్తే కొద్దికాలంలో మీరే వార్షికాలకి బయలుదేరవలసి వస్తుంది! కాబట్టి ఇక చాలించండి యీత్యాగాలూ దానాలూ! ఇటుపైని యిలాంటివి జరిగేయంటే మీ అమ్మతో చెప్పేస్తాను. ఆవిడ ఒక్కమాటు మీమీద చేటలు చెరిగేస్తే యీ దాతృత్వము కట్టిపోతుంది! మీ అమ్మకి వాడంటే పడదన్న సంగతి మీకు తెలుసునుగదా! 'ఆడవాళ్ళలో ఆవిడే, మగవాళ్ళలో మీపింతండ్రి, వీళ్ళిద్దరూ బెలూన్సులాగు ధనంమాటలమీద కూర్చొనేస్వర్గానికి వెళ్ళిపోతారు' అని వాడు అందరితోనూ యెగతాళీ చేస్తూవుంటాడని ఆమెకు తెలిసింది. అందుచేత వాడిమీద అంటే నిప్పుపెట్టేస్తుంది మీ అమ్మ. వాడికి యిలాగు తమ పుత్రరత్నంగారు భారీగా వార్షికం శాంక్షను చేయించేరని ఆమెకు తెలిస్తే ఆమె కోతి గెంతినట్లు గెంతి మీకు తిన్నతిండి ఒంటపట్టకుండా బుర్రవాచిపోయేటట్లు చీవాట్లుపెట్టి మరెప్పుడూ దానమివ్వకుండా చిచ్చుపెట్టేస్తుంది! ఈమాటుకు ఊరుకుంటాను! ఇటుపైని మాత్రం యిలాంటి తెలివి తక్కువ దానాలు చెయ్యకండి! చేస్తే తప్పకుండా వీడికి మీరిచ్చిన వార్షికంసంగతి నేను మీ అమ్మతో చెప్పడం, ఆమెవల్ల మీకు కితాబులురావడం తప్ప దనుకోండి! జ్ఞాపకం ఉంచుకోండి!

---

## బాల ప్రబోధము

మల్యాల వేంకట శేషగిరి రావుగారు.

౧. అమృత సమములు

సద్గుణాఢ్యురాలి సతిగఁ జేకొనుటయు,
ముద్దుబిడ్డలాడు ముద్దుపల్కు,
యుక్తభోజనంబు, నుర్వీశుగౌరవం
బమృతసమములందు రవని బాల!

౨. వ్యర్థములు

తల్లిలేనిచో వ్యర్థంబు పిల్లబ్రతుకు,
నాథుఁడుండమి వ్యర్థంబు నాతివయసు,
శాంతిలేనిచో వ్యర్థంబు జపము తపము,
ఆమ్లహీనపుఁగూర దరుచ్యంబు బాల!

వానకడలియందుఁ గురియ ఫలములేదు,
భాగ్యవంతునకిడుఈవి ఫలములేదు,
వయసువలసను బేదకు ఫలములేదు,
అన్నమిడవృథ క్షుత్తులేకున్న బాల!

గుణములేనట్టి నూర్గురు కొమరులేల?
సుగుణుఁడొకఁడున్నఁజాలఁడె సుఖముఁగూర్ప,
వేయితారకలేల వెన్నెలుఁగునిచ్చు
చంద్రుఁడొక్కఁడె సుఖమిడఁజాలు, బాల!

శాంతమతిలేని జపతపస్సంధ్యలేల?
సద్గురునిశిక్ష లేనట్టిచదువులేల?
శిష్టరక్షణసలుపని సిరులవేల?
ఈశుఁ గీర్తింపని బ్రదుకులేల? బాల!

3. అశ్వమేధ సమములు

కడుదరిద్రునకిడు ఘనమగుదానంబు,
పూజలేనిగుడికిఁ బూజలిడుట,
పేదలకనుకేయు ప్రేతసంస్కరణంబు,
నశ్వమేధసమములండ్రు బాల!

# నిషిద్ధదీవి

శ్రీమతి డి. కమలావతికన్యగారు

ప్రతాపసింగ్ యను నొకసంస్థానాధీశ్వరుని సైనికదళములో వీరాగ్రేసరులని పేరెన్నికగాంచిన వారలు విజయసింహ విక్రమసింహులు. తోబుట్టువులు గాకున్నను, విధాత వారల రూపరేఖాదులందు వ్యత్యస్తముల నంతగా పాటించనందున చూపఱుల కేకగర్భజనితులట్లే గాన్పించుచుండిరి. వారిరువుర మధ్య రహస్యగోపనమనునది లేశమేని గాన్పించకుండెడిది. బాల్యమాదిగా దృఢస్నేహపాశబద్ధములా హృదయములు. ఆహార విహార శయ్యాసనాదులందు నొండొరుల వీడక ఛాయవోలె నొకరినొకరు యనువర్తించుచుండిరి.

యౌవనాంకురమగుటతోడనే విక్రమసింహుని హృదయావరణమున ప్రణయాంకురములును బొడసూపసాగెను. ప్రతాపుని ఏకపుత్రియగు ప్రసన్నకుమారిదెస కాతని డెంద మాకర్షింపబడదొడంగెను. నాటికాలపు వీరులలో నగ్రగణ్యుడెవ్వడో నాతనికి తన తనుమానసముల నర్పింప నిశ్చయించుకొనిన యాసుందరిని బడయునిమిత్తము యనేక వీరులు సాధించనేరని యొకానొక దుష్కరకార్యనిర్వాహణమున కాతడు బూనుకొనెను.

ప్రతాపసింగ్ యొక్క సంస్థానసరిహద్దుల కనతిదూరమున అజయసింహుడను సార్థకనామధేయు డొకడు నిషిద్ధదీవికి నాయకుడుగానుండి మానవమాత్రులనెల్లరిని తన యమానుషబలముచే పరాజితులనుగా జేసి వారల నిహతుల గావించుచుండెను. అసంఖ్యాకులగు శూరు లాతనిచే యోడింపబడి ప్రాణములతో స్వస్థానములకు జేరుకొనగలిగినను తమ పరాభవస్మృతి చిహ్నముగా తమ దక్షిణహస్తపు చిటికెనవ్రేలి నాతనికడ నుంచి పోవలసివచ్చుచుండుట యాచారముగా నుండెను. ఈ ఘోరసమాచారము నెల్ల నామూలాగ్రముగా నెఱిగియుండియు విక్రమసింహుడు తన ప్రణయదేవతకు ఈ యపూర్వవిజయమును అరణముగా నీయ దలచి రహస్యముగా యాదీవిమార్గముబట్టి చనెను.

ఒక భీకరారణ్యమున కావలనున్న నిషిద్ధదీవి నాయకునకు యీ నూతన ప్రతిపక్షియాగమనవార్త యథాకాలమున నివేదింపబడెను. ఘోరాతిఘోర సంగ్రామములను క్రీడా సమానముగా భావించు ఆనాయకుడు శౌర్యరసముట్టిపడ ఎఱ్ఱని కవచము, డాలు, శిరస్త్రాణము మున్నగు పరికరములతో ద్వంద్వయుద్ధమునకు సన్నద్ధుడయ్యెను. అవలీలగా విక్రమసింహుని గుఱ్ఱముపై నుండి పతితుని గావించెను. క్రుద్ధుడై విక్రమసింహు డొక్క యుదుటున కరవాలమును దూసి యాతనిపై లంఘించి సంతతధారగా ఖడ్గఘాత వృష్టి గురిపించెను గాని యేమి లాభము! ఆ కత్తిపోటు లాదృఢ కవచమును భేదింపజాలవయ్యె. అజయుని ప్రతిదెబ్బకును తనకవచము లొంగిపోవుచుండ, యాక్షత బహిర్గత రక్తస్రవణముచే శక్తి సన్నగిల్ల,

ముఖముమీదుగా స్రవించుచున్న రక్తము దృష్టి నాటంకపఱుప శత్రుపాదములచెంత యా నిర్భాగ్య యువకుడు మూర్ఛితుడయ్యెను.

పునః స్మృతివచ్చి చూచుకొను సరికి యానిబిడారణ్య మధ్యమున తన మృతాశ్వము చెంత తా నొంటరియై బడియుండెను. సమీపపు నీటిపట్టుకడకు ప్రాకికొనుచుబోయి కాలుసేతుల శుభ్రపఱచుకొని తనగాయముల పరిశీలించుకొనుచుండ తనకుడిచేతి చిటికెనవ్రేలు గాన్పింపదయ్యె. "ఇస్సీ"! యని యొక్క నిట్టూర్పుబుచ్చి అజయుడు నిర్దయుడు గనుకనే తన్ను సంహరించక యిట్టి పరాభవ క్లేశాగ్ని కీలలచే దహింపదలచెననియాతని నిందించుచుండ తనప్రక్కనే యిట్టి యదృష్టమును బడసి దీర్ఘనిద్ర బోవుచున్న యొక వీరుని, ఆప్రక్కనే మేయుచు నిలుచున్న యాతని బక్కగుఱ్ఱమును జూడగలిగెను. అతిప్రయాసతో దానినధిరోహించి యావిక్రమసింహుడు స్వగృహాభిముఖుడాయెను.

నిరాశాచిత్తుడై తన దురదృష్టమునకు పలవించుచు యాదినమెల్ల ప్రయాణమొనర్చి సూర్యాస్తమయ వేళకు సరిగా యొకనందనోద్యాన మధ్యమున నొక గొప్ప భవనమును గని యట విశ్రమింప నుద్యుక్తుడగుచుండ మనోహరాలంకారిణి యగు నొక విశ్వమోహిని సాక్షాత్కరించి మంజులస్వనంబున నిట్లనియె.

"ఆర్యా! నా పితృగృహద్వారము వీరులకు స్వాగతమిచ్చుటకై సదా తెరువబడియే యుండును. పరిచర్య లందుకొను దుస్థితిలో నున్న నీవు కటికనేలపై శయనింపజాలవు."

"దయామతీ! నేనును కడుబడలిన నా గుఱ్ఱమును విశ్రాంతి నభిలషించవలసిన సమయమిది. అయినను, నావంటి దౌర్భాగ్యశాలి నీపితృగృహమున నతిథిగా నాదరింపబడ దగడేమో యని యనుమానించుచున్నాను.

ఆమె నిరుత్తరయాయెను, ఒక్కక్షణమూరకుండి తనదాసీల బిలచి అనుజ్ఞల నొసగెను. ఒకతె గుఱ్ఱమును గొనిపోయెను. వేరిర్వురు విక్రముని లోనికి గొంపోయి, కడు నిపుణతతో గాయముల శుభ్రముజేసి, కట్లుగట్టి, భోజనాదుల నిడి, మెత్తని పాన్పుపై శయనింపజేసిరి. వీరమతి—యాగృహాధికారి కొమరిత—యేతెంచి యాతని కుడిహస్తవీక్షణ మాత్రమున సర్వము గ్రహించి, యొక్క దీర్ఘనిశ్వాసము విడిచి, ఆతడు నిదురించు వరకును వీణానాదముతో తన కోమలకంఠస్వరము నైక్యముజేసి పాడ దొడంగెను. నిషిద్ధదీవినుండి మగిడి వచ్చు అనేకవీరులామె సపర్యలనంది యాయనుపమగానమాధుర్య రసాస్వాదనముచే ధన్యులమైతిమని తలచి హాయిగా ఆరేయి సుఖనిద్దుర జెందిన వారలే.

మఱునాటి యుదయమున ఆ మృదుమనస్క తిరిగి యాతని గాయములకు చికిత్స గావించి త్వరలో బైలుదేర నాతురపడుచున్న యాతని దక్షిణహస్తమునకు తనపట్టు

చేతిగుడ్డనుజుట్టి నూతన శక్తిని ప్రసాదించు సంజీవినివంటి యౌషధమును ద్రావనిచ్చి సాగనంపెను. అహంకారయుక్తయగు ప్రసన్నకుమారిసుందరమూర్తినే హృదయమున ప్రతిష్ఠించుకొనిన యా యువకుడు తనకిట్టి మహోపకారమొనర్చిన సుగుణరాశి నామమేయక్షరములచే నలంకరింపబడుచుండెనో తెలిసికొన నపేక్షింపక కృతఘ్నుని భంగి వెడలిపోయెను.

ప్రతాపసింగ్ కోటద్వారమును సమీపించుసరికి గాయములనుండి తిరిగి రక్తము ప్రవహింప నారంభించెను. మనోవేదనచే శరీర మింకను అవశమగుచుండ అతడు గుఱ్ఱమునుండి భూమిపై గూలెను. గుఱ్ఱ మాతని విడిచి చనెను. కొంతతడవునకు నేత్రములివ్వచ్చి చూచి తన నిస్సహాయస్థితికి నగచుచు ఆ సంధ్యా చీకటిలో ఒరులు తన్ను గుర్తింపకనే కాళ్లీడ్చుకొనుచు తనగది జేరుకొనగలిగెను. అకస్మికముగా లోచన గోచరమైన తన ప్రాణస్నేహితుని అట్టి విషమస్థితియందు జూచి విజయసింహు డాశ్చర్యవిషాద సంభ్రమములు ముప్పిరి గొన వేవేగ మాతని పరుండజేసి విశ్రమించిన పిదప ఖండఖండములుగా అతని కథనెల్ల తెలిసికొన గలిగెను.

"గౌరవ సంపాదనార్థము బయల్వెడలిన నేను శాశ్వత అపయశస్సును కొనిరాగలిగితిని" యని యాతడు వాపోవు చుండెను.

"నీ వింతగా విలపింపవలసిన యావశ్యకత లేదు. అజయునిచే విజితులైనవారలు శౌర్యహీను లనబడరు, యాతని పరాక్రమము సాటిలేనిది. అయితే ముఖ్యసంగతి యొకటి గలదు. నీవాతనిచే యోడింపబడినటుల ప్రసన్నకుమారి చెవిని బడరాదు" అని విజయసింహుడనుచుండ ద్వారమున కవతల ఎవ్వరిదో పదధ్వని వినవచ్చె. వెళ్లి చూచుసరికి గర్వితయు అభిమానవతియు నగు ప్రసన్నకుమారి వీరి సంభాషణము నాలకించి తిరిగి పోవుచున్నటుల గ్రహింపగలిగెను. మిత్రుని మనస్సంకట మధికమగునను తలంపుచే, ఇవ్విషయమును దాచియుంచి కుక్కవలన గలిగిన సవ్వడిగాని మరేమి లేదని యాతని యనుమాన పిశాచము పాఱద్రోలెను.

విక్రమసింహుని గాయముల పరీక్షించిన రాచవైద్యులు తలలూపిరి. తొమ్మిది దినము లాతడు మృత్యుసన్నిధానమున బడియుండ ప్రసన్నకుమారి దక్క తదితరు లెల్లరు నాతనినిమిత్తము కంటనీరు బెట్టుచుండిరి. తన యాత్మప్రీత్యర్థ మిట్టి ఘోరాపాయమున బడవలసి వచ్చిన యా ప్రేమమూర్తిని గాంచుటకు కఠిన హృదయయగు నా ప్రసన్నకుమారి యిచ్ఛగింపలేదు సరిగదా పైగా శూలములవంటి పరుషవాక్కుల నాతనిమెడ ప్రయోగించుచుండ వానినెల్ల తన మిత్రుని చెవిని బడకుండ మిగుల జాగ్రత్తతో విజయుడు దివారాత్రము లాతని పర్యంకము దగ్గఱనే కనిపెట్టుకొనియుండెను. ఒకనా డాతడు ప్రసన్నకుమారిని సమీపించి యామెతో నిట్లనెను. "నీకొఱకై తిరిగి అజయునితో యుద్ధమొనర్చుటకు నామిత్రు డిష్ట

పడుచున్నాను; గనుక ఆతనియెడల కనికరము బూని, యీ సాహసికోద్దేశము నుండి యాతని మరల్పుము."

"ఆతని యిష్టమునకు నావ్యతిరేకమేమియు నుండదు. ఆతని విజయములగాంచి ముగ్ధనై ఆతనికన్న శ్రేష్ఠు లెందరినో నేను నిరసించితిని, ఇప్పుడై తేనో ఆతని నాజ్ఞాపించుటకుగా చిత్త మంగీకరించుట లేదు."

ఇట్టి ప్రత్యుత్తరమును విని విజయుడు కోపోద్రేకముతో తన మిత్రున కామె యవిశ్వాసమును వెల్లడించెను; ఆమె తిరస్కరణమునకు హేతువును గ్రహింపగలిగిన విక్రమసింహుడు ఆ కళంకమును దుడిచి వేసికొనవలెనని తలచి యాభావోద్రేకజనిత బలమువలన క్రమముగా నారోగ్యదశకు రాదొడంగెను.

స్నేహితుని యుత్తేజమునకు మనస్సు గరగ విజయు డాతనితో "మిత్రుడా! నా సలహా నంగీకరింతువేని యాగర్విత నొక్కమాసములోగా పరిణయ మాడగలవు" యనెను.

"అదెట్లు?"

"కొన్ని దినముల పర్యంతము ఇతరుల కగుపడక నేనే అస్వస్థుడనై యున్నటుల వర్తింపనిమ్ము. నా సోదరుడు జగత్సింహుడు నీకడనుండును. నీనామమునుదాల్చి, నీవేషమును ధరించి అజయుని జయించుటకుగాని, కానిపక్షమున నాయసువుల నచ్చట బాయుటకుగాని నాకు సెలవిచ్చి పంపుము."

"అటుల కాజాలదు. నే నీరీతిగా యేడుమాసములు బడియుండవలసి వచ్చినను సరే గాని నాకార్యమును మరొకడు ముగించరాదు. పగదీర్చుకొనవలసిన వాడను నేను."

విజయుని సలహాయెడ నింత విముఖత గనుపఱచిన విక్రమసింహుని వీనులకు ప్రసన్నకుమారి వివాహ సన్నాహములు జరుగుచున్న కఠోరవార్త వినవచ్చెను. ఆతని పట్టుదల తగ్గ నారంభించెను. విజయుని ప్రార్థనల మన్నింపదొడంగెను. తుట్టతుదకు తనకు మారుగా తనప్రాణతుల్యుడగు విజయుని అజయునిపైకి బంపుట కియ్యకొనెను. తనకు దయతో పరిచర్య గావించిన యోగ్యురాలిని దర్శించి రావలసినదని వేడి ఆమె తనకిడిన పట్టు గుడ్డను విజయునకిచ్చి బంపెను.

కడు నేర్పుతో కొనసాగింప బడినందున యీ మోసము బయల్పడలేదు. విజయుడు జబ్బుగా నున్నటులను విక్రమసింహుడు పూర్వస్థితిలో అటునిటు తిరుగులాడుచున్నటులను ప్రత్యక్షముగా చూపగలిగినందున యెల్లరును విక్రమసింహుడే నిషిద్ధదీవికి తిరిగి వెళ్లినటుల విశ్వసించిరి. నియమితదినమున విక్రమసింహుడు ఆయుధములబూని ప్రతివారి సెలవుబడసెను. అందరును ఆశీర్వదించిరి. ఇంత దుర్బలుడవుగా నున్న నీవు శత్రువు నెటు లెదుర్కొనగలుగుదువని కొందరు జాలిబూని ప్రశ్నించిరి. ప్రసన్నకుమారితో "వెళ్లుచున్నాను, దివ్యసుందరీ!" యనగా, యామె అలక్ష్యముతో "పూర్వముకంటెను అధికకీర్తి బడసెదవుగాక" యని మాత్రము నుడివి చివాలున అటనుండి వెడలిపోయెను.

తన గుఱ్ఱమును దెచ్చులోగా విక్రమసింహుడు గదిలోనికివెళ్లి విజయుని శయ్యనాక్రమించుకొనెను.. విజయుడు మిత్రుని దుస్తుల నొక్క క్షణములో దొడిగి కవచధారియై గుఱ్ఱమునెక్కి యందరును చూచుచుండగనె వెడలిపోయెను.

౨

వీరమతి సంగ్రామసింహుని కొమరిత. అజయుఁడు వారల కుటుంబమునకు గర్భశత్రువు. త్రోవపొడుగునను గ్రామవాసులావిజయుని సంకల్పమును విని యానందబాష్పముల గురిపించుచు అతని పలువిధముల దీవించుచుండిరి. అజయసింహుడు సంగ్రామసింహుని పుత్త్రిని, కాబోవు జామాతను కడుక్రూరముగా వధించెనని చెప్పదొడంగిరి. గనుకనే కాబోలు! వారి గృహము అజయునిపైకి యుద్ధమునకు వెడలు ప్రతి వీరునకు స్వాగత మొసంగుచుండెను.

ఉన్నత ప్రాకార పరివేష్టితమైన యాగృహోద్యానమున దాసీజన పరివృతయైయున్న వీరమతిం గాంచి, వీక్షణ మాత్రముననే యసమానరూప లావణ్యాదులచే విస్మయుడయి, విక్రమసింహుని పాత్రనభినయించుచుండుటం బట్టి, వినయముతో ఆమెకు నమస్కరించి నిలచెను.

“సాహసిక యువకుడా! నీవు నాకపరిచితుడవు” అనుచు అతనివైపు దృష్టి సారించి, తానిచ్చిన చేతిగుడ్డను గుర్తించి మందస్మితయయ్యెను. విజయుడు ఆమెకు కృతజ్ఞతా పురస్సరముగా వెలలేని మాణిక్యములను విలువగల యాభరణములను సమర్పించెను. వీరమతి పోల్చుకొనజాలక పోయెను. విజయుని విక్రమసింహునిగా భావించి క్షేమమరయ దొడగెను. విజయు డామె ప్రేమాలాపములచే పరవశుడై సహజప్రేమస్వరూపిణియగు నామెయెడ దృఢానురాగబద్ధుడయ్యెను. మరియు, మైమరచి తన దక్షిణహస్త కవచమును దీసివేసెను. వెంటనే వీరమతి “ఆర్యా! నేర్పరుడగు వైద్యుడెవ్వడేనియు ఖండితాంగుళీయమును తెచ్చిపెట్టజాలడు. ఇదెట్టి పరిహాసము! నన్ను వంచించుటకు ఆవీరుడు నిన్నంపెనా?” యనుచు లేచిపోవుచుండ విజయు డామె హస్తమును బట్టుకొని దీనముగా ఇటులనెను.

“సుందరీ! నాదొక్క విన్నపముగలదు. సహనము గలదేని సర్వము వినిపించెదను.” వీరమతి యాగ్రహమునకువెఱచి విజయుడు సత్యమును వెల్లడించెను. విక్రమసింహుని మాన ప్రాణరక్షణ నిమిత్తము తానాతనికి మారుగా అజయసింహునెదుర్కొన బోవుటను తెలిపెను.

“స్నేహితుని కొఱకిట్టి త్యాగముచేయ గలిగినట్టియు ఒక యువతి యాగ్రహము నీరీతిగా నుపశమింపజేయ గలిగినట్టియు నీ యౌదార్యము నీ రసికత మెచ్చదగినవి.” యనుచు వీరమతి యాగ్రహమెల్ల యదృశ్యముకాగా అతనిని గృహాభ్యంతరమునకు దోడ్కొనిపోయి పరామర్శించెను. తన తండ్రి తన యనుంగు సోదరుని మరణానంతరము ఎవ్వరికైనను గాన్పించుట లేదని గూడ వినిపించెను. ఆరాత్రి వారలు భుజింప

జాలకపోయిరి. తన స్నేహితుడు శయనించిన తల్పముపైననే తాను పరుండెను. వీరమతియు వీణాగానముతో అతని నిదురింప జేయబూనెనుగాని యేలనో యామెకంఠము రుద్ధము గాజొచ్చెను. మనోదుఃఖము గానమూలకముగా ప్రకటిత మగుచుండ విజయుడు,

"కలకంఠీ! శ్రావ్యగానమును దుర్భర దుఃఖమును ఈరీతిగా మిశ్రమమైయుండుట మిగుల విస్మయముగాదా?" యనెను.

"వీరాగ్రణీ! అజయుఁడు ప్రాణములతో నుండు నందాక నాకు శాంతి యెక్కడిది? వాడు నాప్రియుని సంహరించి వివాహమునకు పూర్వమే నాకు వైధవ్యదుఃఖమును దెచ్చి పెట్టెను. నాసోదరు డీదారుణవార్త విని అజయుని జంపబోయి తానే జంపబడియె, ఇంకెందరో వీరు లాతనిచే మడసిరి."

పాప మాయువతి దుఃఖమాపుకొనజాలక దురపిల్లుచుండ విజయుడు లేచి అజయుని ఆయుష్కాలము క్షీణించినదనియు ఇంకొక్కదివసమే యాతడు జీవించియుండుననియు ఆమె నోదార్చెను. ఈ యూరడింపు వాక్యము లామె పలువురద్వార విని యుండెను గావున విశ్వసింపజాలకపోయెను. విజయుడా రేయెల్ల జాగరణము జేసెను. వీరమతికి గూడ ఆకాళరాత్రి శివరాత్రియయ్యెను. ఈ వీరుడు నయిత మా క్రూరుని కరవాలమున కెరయగునేమో యాతనికి జయమును గూర్పవలసినదని తనయిష్టదైవమునకు మ్రొక్కుచుండెను.

తెల్లవార జొచ్చెను. విజయుడు లేచి తన యీప్సిత మీడేరునను రెట్టింపు ఉత్సాహముతో ప్రయాణమునకు త్వర పడజొచ్చెను. వీరమతి అతిబలవంతముపై అతనికి ద్రాక్షరసము ద్రావనిచ్చి, వెను కటి పట్టుగుడ్డ నాతని శిరోవేష్టమునకు జుట్టి, యాతనితో నీరీతి నుడివెను.

"వీరవరా! అజయునికి రాక్షసబలము గలదు. మధ్యాహ్నము మొదలు నడిరేయి వఱకు ఆతని శక్తి యధికమగుచుండును. నడిరేయి మొదలు మధ్యాహ్న పర్యంతము సన్నగిల్లుచుండును. మరియు, అశ్వారోహియైయున్నప్పు డాతని పరాక్రమ మతిశయించియుండును గనుక నీవు గురిజూచి యాతని గుఱ్ఱమును నేలబడవేయుము. నన్ను విస్మరింపకుము."

వీరమతి సలహాను గైకొని విజయుడు కడువేగముతో వెడలిపోయెను. ఆ దినమెల్ల ఆమె కఠినోపవాసము బూనెను. దేవి పూజ గావించెను. సాయంసమయ మాయెను. అంధకారము నల్దిశలలముకొనెను. వీరుడు రాలేదు. అతనికొఱకు భోజనము సిద్ధముగావించి తాను భుజించక యాతని రాక నిరీక్షించుచు గూర్చుండెను. గడచిన రాత్రి యీ గృహమధ్యమున నిదురించిన యా యౌదార్యపురుషుడు నేడు అజయుడు సిద్ధపఱచిన శయ్యపై నిద్రించుచున్నాడేమో! యని యనేక రీతుల తలపోయుచు తన ప్రియుని స్మరించుచు దుఃఖించుచుండ వాకిట నుత్సాహపూరిత కేకలు వినవచ్చెను. రక్తసిక్తములైన వసనములతో విజయసిం

హుడు లోపలి కేతెంచెను. వీరమతి
యాతని కరగ్రహణము గావించి "సమా
చారమేమిటి?" యని ఆతురతతో ప్రశ్నిం
చెను. "అజయునివలన ఇక నెవరును భీతిల్ల
నవసరము లేదు" అనుచు, నొకవస్త్ర
ముచే జుట్టబడియున్న పెద్దదగు హస్తమును
పైకిదీసి జూపించెను. వీరమతి చిత్తమునం
దలి ప్రణయరసమును జూరగొనుట కా
హస్తప్రదర్శనము తాళముచెవి వంటిద
య్యెను. ఆతని స్వల్పగాయములకు తైలము
రాచి యీ శుభవార్త తన తండ్రికి వినిపిం
చుటకు పరుగిడెను. అజయుని హస్తమును
గాంచి యాతని సంహారము సత్యమని యా
వృద్ధుడు నమ్మగలిగెను. తన కుమార్తె
హస్తమును బట్టుకొని, యీ సుదినమును
గాంచగలుగుటచే తాను ధన్యుడనైనటుల
నేమోమో యనుచు తన దీర్ఘశత్రు
సంహారకుని వీక్షించుటకు త్వరపడి వచ్చి,
"నాకుగల సమస్తము నీది; వరమును
గోరుము" అనియెను.

"అటులైన నీ కుమార్తెను నా కొస
గుము; అదియే నా వాంఛితము" అని
విజయుడనెను. అతి సంతసమున అందు
లకు సమ్మతించి, తలవాల్చి లజ్జాభరమున
నేలవైపు దృష్టుల సారించుచున్న వీరమతి
కరకమలమును విజయుని హస్తమునసుంచి,
సుముహూర్తము నిశ్చయించి వారలను
దంపతుల గావించెను.

వివాహానంతరమున అట నిలువనొల్లక
అజయుని మరణవార్తను స్నేహితున కెఱి
గించుటకు బైలుదేరెను. వనమధ్యమున
నొక సురక్షితస్థానమున గుఱ్ఱమును విడచి
తాను రహస్యముగా తన మేడకేతెంచి
విక్రమసింహునకు తన విజయమును దెల్పెను.
గుణవతియగు భార్య తనకు లభించిన
వృత్తాంతమును వినిపింపగా విక్రమసింహుడు
మనస్ఫూర్తిగా ఆనందించెను.

కార్యకలాప మింతటితో ముగియలేదు.
మర్నాటి యుదయము విక్రమసింహుడు
వనమున కేగెను. విజయుఁడు ఆరోగ్య
స్నాన మాచరించి, స్నేహితుడు వెడలి
వారము రోజులయినను ఇదివఱ కేల
రాలేదో యని యనుమానించుచు ప్రసన్న
కుమారి చిత్తకాఠిన్యమును దూషించుచుండ
దే వా ల య ము ను ం డి తిరిగివచ్చుచున్న
ప్రతాపసింహాదులకు ఒక యశ్వారోహ
కుడు కాన్పించెను. సమీపింపగా ఆతడే
విక్రమసింహుడని తెలియగా విజయు డెదు
రేగి, యాతనిడించి, క్షేమమారయ, ఆతని
జయసమాచారమును అందరికన్నను అధిక
శ్రద్ధతో వినుచు ప్రజలెల్ల చుట్టును మూగిరి.
ప్రభువు గౌరవించెను. ప్రజలు జయధ్వాన
ములు గావించిరి. ప్రసన్నకుమారియు శీఘ్ర
గమనమున నేతెంచి సంభాషింప నుద్యుక్త
యయ్యెగాని విజయుని ఇష్టమునసుసరించి
విక్రమసింహు డామెతో "ఒకప్పుడు తిర
స్కరింపబడిన స్నేహితులను తిరిగి బడయుట
దుర్లభము" అనియె.

గర్వభంగమొందిన యా నిర్భాగ్యురాలు అతని నామము నుచ్చరించుచు మూర్ఛితయయ్యె. ఆసమయముననే విక్రమసింహుడొకానొక ధనికుని కొమరితను వివాహమాడ నేగుచున్నాడను వార్త వ్యాపింప నారంభించెను. తన గర్వము పూర్తిగా అంతరించ ప్రసన్నకుమారి తన ప్రియుని తనయెడ ప్రసన్నుడగునటుల ప్రార్థింప బోయెను. తన బింకము నిక నిలుపుకొనజాలక ఆమె పాణిగ్రహణమున కాతను సమ్మతింప విజయుడు అతివైభవముతో ఆ వివాహవేడుకల జరిపించెను. విందు ముగియగనే ప్రధానపాత్రధారులెల్లరు సంగ్రామసింహుని మేడ నలంకరించిరి. నేత్రపర్వముగా అట విజయుని వివాహవేడుకలను రెండవపర్యాయము గావించి తృప్తుడయి విక్రమసింహుడు స్వస్థానమున కేగెను.

కథను కడవఱకు వినగోరిన, అసంతుష్టులుగా ఆ దంపతులు వారి భావిజీవనమును గడుపవలసివచ్చెనని తెలియవలెను. వివాహమైన కొలది కాలమునకు యోగ్యుడగు విజయసింహుడు యుద్ధములో వీరస్వర్గ మందెను. విక్రమసింహుని దుఃఖమునకు మేరయే లేదు. తన ప్రాణమిత్రుని యుత్తమాంగముకడ నిలుచుండి అతని త్యాగశీలములనుగూర్చి తన బంధుమిత్రాదుల కెఱిగించెను. అజయుని సంహరించినది విజయుడని తెలిసిన యనంతరము, స్నేహితు లిరువురు తనయెడ గావించిన ద్రోహమునకు దురాగ్రహపరవశయై ప్రసన్నకుమారి భర్తయెడల విద్వేషియై సంసారము యెడ విరక్తయై సన్న్యాసాశ్రమ స్వీకరణ మొనర్చెను. విజయసింహుని పత్ని పతి గుణముల స్మరించుచు అతని మానసికముగా నారాధించుచు జీవితశేషమును మానవసంసేవయందు గడపి చిరకీర్తి నార్జించెను.

ఉత్తమ మిత్రరత్నమును ప్రియభార్యను ఏకకాలమున బోగొట్టుకొనిన విక్రమసింహుడు కడువృద్ధుడగు పర్యంతము జీవించి అవిరళాశ్రుధారలచే తన హృద్గతవేదనను అప్పుడప్పుడు వెలువరించుచు చివరకు ఈ మాయాప్రపంచమున నేదియు స్థిరముగాదనియు సర్వము ద్వంద్వభావసమ్మిశ్రితమనియు అనుభవపూర్వకముగా తెలిసికొనగలిగి ఐహికాముష్మికసౌఖ్యమును జేకూర్చు సాధనముల నవలంబింప దీక్షాపరుడయి జన్మసాఫల్య మొందెను.

(ఆంగ్లమునుండి యనువాదము)



# వెలి

వేమూరి వెంట్రామయ్యగారు

రంగాపురము బ్రాహ్మణ అగ్రహారం. మిశ్రితము కాకుండా అచ్చాడీగా ఒకటే శాఖ. అంత సంఘము మీద అభిప్రాయభేదములు లేకుండాయుండడము అస్వాభావికమే; కాని అది యేమి ప్రభావమోగాని అచ్యుతావధానులుగారుగీసినగీటు తప్పడానికి ఎవరికీ సాహసము లేదు. అవధానులుగారిది నిరంకుశ ప్రభుత్వము. మొక్కవోని పూర్వాచారపరాయణత్వము. శృంఖలములు సడలించడు. అసిధారావ్రతముగానున్నది గ్రామస్థులజీవితము. గ్రామములో ఎవడైనా పూర్వాచారపంథ తప్పద్రొక్కినా, అవధానులుగారి ఆంక్షాజ్ఞకు గురియయినాడనుటకు ఆశ్చర్యమా? ఆయన పౌర్ణిమినాడు అమావాస్యయన్నచో తలయూపవలెనేగాని ఇదియేమి యనుటకు సాహసమేది పాపము! ఈవిధముగానున్నది ఆయన పరిపాలన అకుంఠితముగా.

రామమూర్తిగారు ఆగ్రామములో ఒక సామాన్య సంసారి. అతని ఏకైక పుత్రిక. ఆ పిల్లపైననే కేంద్రీకరింపబడినది మాతాపితల సర్వస్వమును. అపహరింపబడిన తన భార్య నగలతో బ్యారిస్టరు పట్టము సంపాదించి తిరిగివచ్చినా డతని అల్లుడు ఇంగ్లాండు నుండి అయిదు సంవత్సరములకు. అతని రాకవలన అగ్రహారములో కలిగిన అలజడి అప్రతిహతము. అవధానులుగారి క్రోధానలమునకు మేరయే లేదు. సముద్రయానము, విదేశనివాసము, పూర్వాచార బ్రాహ్మణసంఘమునందు విగతస్థానునిగ జేసినవి ఆ బ్యారిస్టరును. "నీ కుమార్తెను భర్తవద్దకు బంపి ఆమెతో నీకుగల యావత్సంబంధము త్రెంచుకొనెదవా? ఆమె రాకపోకల నెఱపుచు సంఘమును వదలుకొనెదవా?" అని కబురు పంపినాడు అవధానులుగారు రామమూర్తికి. తన ఏకైకపుత్రిక ముందు సంఘ సాంగత్యము లేకముగా తోచినది రామమూర్తికి. రంగాపురము వీడి మనగలనా యనుకొనినాడు. అల్లునిచేత గోమయము తినుపించెదనని ప్రాయశ్చిత్తము చేయించెదనని యనినాడు. కాళ్లపై బడినాడు. రక్షించమనినాడు. అవధానులుగారిది అంతమాత్రమున చలించు గుండె కాదు.

ఇక రాజమండ్రి జేరినాడు, తరతరములనాటిదగు గ్రామము ఇక తనదిగాదని విగళిత మోహపాశుడై. జన్మస్థాన విసర్జనా జనితక్లేశము తనలో పట్టుదలగా పరిణామము జెందినది. అవధానులుగారి గృహము ఇంతకు అనేకరెట్లుపచారమునకు తావలమగునట్లు జేయుదునని శపథముతో వీడినా డాగ్రామమును, ఇక ఎన్నడు ఆ గ్రామము వెళ్లు అవసరము లేకుండ జేసుకుని. అంతటితో తృప్తిజెందక, అవధానులుగారు రామమూర్తిగారి మేనల్లుని వివాహము ఇక కొద్ది రోజులలో కానుండ, పెండ్లికుమార్తెవారిని ప్రేరేపించి ప్రయత్నము నెరవేర్చుకొనినాడు పెండ్లి కాకుండజేసి. రామమూర్తిగారి పట్టుదల కిది దోహదమయినది.

## ౨

ఆనందమోహనుడు విద్యార్థి రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో. వసతిగృహజీవితము తదేకదృష్టిగ గ్రంథపరిశీలన కాటంకమని తాను స్వయముగ నొకగది అద్దెకుగొనినాడు హృదయనైర్మల్యముకొఱకు. పై మిద్దెపైకూర్చుని చదువుకొనుటయు గలదు. తూర్పున మరియొక డాబా విశ్వనాథంగారిది. ఆ రెండు డాబాలు కవలలాయని యనిపించును. మధ్యయొక సందుమాత్రమున్నది లోయవలె. విశ్వనాథంగారి ఇంట్లో స్వర్ణరేఖ యను యువతియున్నది, అన్వర్థనామవతి. అప్పటప్పట స్వర్ణ డాబాపై తడివస్త్రము లెండవేయుటయు అందందు విహరించుటయు గలదు. ఆనందమోహనునిది మోహనాకారము. ఎప్పుడు మొలకెత్తెనోగాని ఒండొరుల స్నిగ్ధహృదయములలో నూతనవికారము లుద్భవిల్లినవి. రానురాను కాలేజీకి హాజరగుటమాని డాబా

పైననే నారంభించినాడు చదువుటకు. స్వర్ణకు గృహకార్యనిర్వహణమునగల నైపుణ్యము ఇంకినది నూతన భావములలో. ప్రతివిషయమందును ప్రమత్తయగుచున్నది. విశ్వనాథంగారు స్వర్ణను కాలేజియువకుల కలుషితదృష్టులబారినుండి ఆచ్ఛాదిత మొనర్చుచునే యుండెను. తాను విఫలప్రయత్నుడనైతినని గ్రహించాడు ఆమె మైపురచి యడపతడప వెలిబుచ్చు వికారలక్షణములచే. శంకరునికొఱకు పార్వతివలె ఆమె వర్జించినది నిద్రాహారములను. నిర్హేతుకాశ్రులు రాల్చును కొన్ని సాయంకాలములందు పెద్దలున్నారని మరచి. స్వర్ణానందమోహనుల హృదయసన్నిహితత్వము అర్థముచేసుకొనినాడు విశ్వనాథంగారు. ప్రణయతత్త్వము ఆత డెరుగడో లేక మరచెనో కాని విరోధింపబూనినాడు తద్వాహినిని. ప్రకృతిని యరికట్టుట సాధ్యమగునా యనునది వానికి దురూహ్యము.

రామమూర్తిగారు రాజమండ్రికి వచ్చిన తరువాత విశ్వనాథంగారితో గాఢ పరిచయము కలిగినది. విశ్వనాథంగారు జరిగినఅపచారమును ఏకాంతముగా వాపోయినాడు రామమూర్తిగారి దగ్గిర. రామమూర్తిగారికి ఆనందమోహనుడు అవధానులుగారి పుత్రుడని తెలియకపోదు. తన శపథము నెరవేరుటకు గొప్ప వెఱవు దొరకినదని పొంగిపార్లినది యాతని హృదయోదధి. స్వర్ణ జన్మక్రమములు వానికి పూర్వపరిచితములే. విశ్వనాథంగారితో అనినాడు "నీవు బహుకాలమునుండి యుద్దేశించిన తీర్థయాత్రలు వెఱపుకో. నీ స్వర్ణబాధ్యత నాది" యని. తనపై ఆరోపించుకున్నాడు ఆమె భవిష్యత్తంతాను. దీర్ఘముగా సమన్వయించుకొనినాడు. పూర్వాపరములు పరిశీలించినాడు. ఒక తెఱవు ఏర్పడినది. నిర్వక్రస్థైర్యముతో ఆరంభింప బూనినాడు తనవెఱవు ఆచరించుటకు.

నారాయణశర్మ రామమూర్తిగారికి పూర్వ పరిచితుడు. శ్రోత్రియ కుటుంబసంజాతుడు. వాని యింట స్వర్ణ నివాసము. నారాయణశర్మ స్వర్ణ తండ్రిగా లోకులనుకొనునట్లు తగు కట్టుబాట్లు చేయుటలో రామమూర్తి జాగరూకుడై యుండెను. ఆనందమోహనుడు పెంటికొఱకుతిరుగు మగపక్షివలె తిరుగుచు శ్రమపడెను స్వర్ణపంజరము కనుగొనుటలో. కాలేజీకి మార్గము మారిపోయినది. నారాయణశర్మ ఇంటి ముందటిసందు, దగ్గిర రాజవీధి యయినది. రామమూర్తిగారు స్వర్ణస్థితిని గూర్చికూడ పరిశీలించుచునే యుండెను.

ఈ శర్మగారు అచ్యుతావధానులుగారు సహశాఖీయులు. వారివురికిని రాయబారములు నడిపించినాడు రామమూర్తిగారు తెరచాటుననుండి. ఆనందమోహనుడు కూడ తన నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చినాడు తన పెండ్లినిగూర్చి. అవధానులుగారు అంగీకరించినారు. పెండ్లిఅయినది. స్వర్ణానందమోహనులు ఆనందించుచుండిరి సఫలమనోరథులై.

## 3

అది ఫాల్గుణము. నాడు పూర్ణిమ. చూతపరాగపరిమళిత మామందమలయానిలము. మందమారుతమును లోబోనిచ్చుచున్నది ఆనందమోహనుని గదిలోని వివృతగవాక్షము. రాకా చంద్రునికిరణములు మెల్లగ జొచ్చుచున్నవి ప్రభుని గూఢచారులవలె. ఆస్వర్ణ యేలకో ప్రకృతికన్య చిఱునవ్వులకు విముఖురాలు. మోహనుడు స్వర్ణకీలజడ సవరించుచు వ్రేలికి జుట్టుకొనుచు కంకణములు కదలించుచు పుష్పలతితో క్రీడించు మలయకుమారునివలె నున్నాడు. నిరాలంబన దృష్టులుపరచుచు, అన్యచింతా నిమగ్నురాలగు స్వర్ణదృష్టి మరల్ప విఫలప్రయత్నుడైనాడు. గవాక్షబాహ్యప్రదేశమంతయు ఆమె దృష్టిలో నున్నదేగాని ఏమిచూచుచున్నదో ఆమెకే యెఱుకలేదు. భౌతిక శరీరము భర్త యధీనమందున్నది. అత డేమిచేయుచున్నది యూహ కజ్ఞాతము. ఇదియంతయు మోహనునికి దుర్గ్రాహ్యము. జాగ్రదవస్థకు త్రిప్పబూని

నాడు. "నీమనస్సు నన్విడిచి గుర్తింప నశక్యమగు నంతటిదూరము పోయినదే! లెమ్ము. ప్రకృతికాంత శశికిరణములచే హస్తములుజాచి నిన్ను రంజింప నాహ్వానించుచున్నది. అహా! ఎంతరమణీయమీరాత్రి" అనినాడు. స్వర్ణ వీక్షణపంక్తిని మోహానునిపై మరలించినది. "ఈ రమణీయతవలన గలుగు హర్షవీచికల పటాపంచ లొనరింపజాలు మంత్రమొకటి నాయొద్ద నున్నది" అనినది స్వర్ణ.

"అట్టి మంత్రము ఉచ్చరించుము. వారమునకు 3, 4 దినములు సెలవులు తేగలట్టియు, రాత్రులు సాయంత్రము అయిదుగంటలవరకు పొడిగింపగల మంత్రము గలిగిన అట్టిదానికి స్వాగతము" అనుచు దగ్గరకు తీసుకొనినాడు స్వర్ణను. కౌగిటనుండి విడినది స్వర్ణ.

మరణశయ్యపై మీకు వెలిబుచ్చ నిశ్చితమైన రహస్యము మీకు నేడే తెలుప తత్తరపడుచున్నది నా మనస్సు. మీకు విధింపబడిన శిక్ష నోరిమితో భరింపగలనని నాకు ధైర్యమున్నది" అని అనినది. మోహనునకీమాటలు అర్థశూన్యములు.

ఇంతలో పరిచిత చరణధ్వనులు వేగిరపాటుతో గదిని సమీపించుట వినినాడు మోహనుడు. కవాటమునతల నిలబడి గర్జించినాడు అవధానులుగారు "తక్షణము నీభార్యతో సంబంధము వదులుకో. ఇంటినుండి గెంటివేయుము" అని.

మోహనుడు భార్యముఖము చూచినాడు. ఇంచుక మాత్రమైన చలించలేదు. చకితురాలు గాలేదు. ఆశ్చర్య ముద్రితముగు మాడ్కి లేదు. ముఖము మాత్రము అరచేతుల సంవృతపరచినది. అక్షణములో తన యాత్మనివృత్తియగుటకు కోరినది మనస్సులో. ఆపేక్షలు, ఆజ్యోత్స్న, సర్వము ఇపుడు నిర్గుణములై పోయినవి.

తండ్రితో సంభాషించి వచ్చినాడు తిరిగి మోహనుడు.

"అదినిజమేనా" అని ప్రశ్నించినాడు.

"తప్పక నిజము" అని స్థైర్యముతో ప్రత్యుత్తరము

"నానుండి యేల దాచితివి. ఇదివరలో నేల నెరిగింపలేదు నాకు" అని తిరిగి అడిగినాడు.

"విఫలురాలనై. పలుమారు యత్నించితిని. నాది వేహ్యజీవితము" అని జవాబిచ్చినది.

"ఇప్పుడైన చెప్పుటకు ఆటంకముగలదా?" అని కోరినాడు.

తన హృదయముపై ఆఛ్ఛాదనము తొలగించినది. సర్వము తన కాంతునికి బహిరంగపరచినది.

వినుటకు తడవుగ గది వీడినాడు మోహనుడు. తిరుగ నతనిరాక కలలోనివార్త యయికొనినది పాపము స్వర్ణ. కాని యామె గుండె రాయి యయినది. పాతకులనుభవించెడి మాత్రపు ఆతురత యామెకు గలదా యనునది సంశయము. ఇది ప్రతిదినము జరిగెడి సామాన్య కార్యమే యనునట్లుగా నున్నది ఆమె దృష్టియందు. అగ్నిపరీక్షకులోనైనది యామె కోమల హృదయము. మిథ్యావాది యయినది. ఆమె దృష్టిలో ప్రేమతత్త్వము ఆమెయెడ అన్యథా అన్వయించుచున్నది.

౪

అనంపె మోహను డెట్లో గడపినాడు రాత్రి. ఉదయమెన్నటికా యనుచు కొలుచుచున్నాడు. మరునాడు రామమూర్తిగారి ఇంటివద్ద తలుపు తట్టినాడు. రామమూర్తిగారి కుశలప్రశ్నలకు మోహనుడు విముఖుడైనాడు. "మీరు వంశమును పాడుచేసితిరి. కులభ్రష్టుల జేసితిరి. మాకుటుంబనాశకులరు మీరు. ఫలితము కట్టికుడిచెదరుగాక" యని గర్జించినాడు మోహనుడు. రామమూర్తిగారు మోహనుని తట్టుచు "మీప్రేమామృతము చేతనేగదా నేటికి మావంశ పావిత్ర్యము నిలిచినది. అంతఃతప్పినది" అని పలికినాడు సహాస్యముగా.

"నీకేమి హాని చేసితినని నాకొనరించితివి ఈగడవ రాని మహోపకారము" అనినాడు మోహనుడు.

"మీతండ్రికి నాకుమార్తె యేమిహాని జేసినది. ఓహో? నీ కావిచిత్రవిషయము తెలియదుకాబోలు" అనుచు జరిగినదంతయు విడువకుండ వ్రాకుచ్చినాడు.

"మా వివాహమునందు నీకేల యంతటి బాధ్యత" అని ప్రశ్నించినాడు.

"కేవలము ప్రతీకారము కొఱకే. శపథము నెరవేర్చుకొనుటే నాయాదర్శము. ఎలుకను చంపుటకొఱకు ఇల్లు కాల్చుటవలె, లేశకారణమున మరణాంతము సంఘుదూరునిగజేయు మీతండ్రిని కూత్రబాలికను కోడలిగా పరిగ్రహింపజేయుటయే నాయాశ

యము" అని వెనుకాడకుండ ప్రత్యుత్తర మిచ్చినాడు.

""శూద్రాబ్రాహ్మణ సంజాతుడనని, నన్ను పెండ్లాడుటకు స్వర్ణ అభ్యంతర పెట్టలేదా? ఆమెకూడ నన్ను కులభ్రష్టుని చేయవలెనని కోరినదా?''

" ఆడువారి హృదయములు అగాధములు. "ఔను" అని హృదయము ధ్వనించిన 'కాదు' అని వాక్కు వెలువడును. వాక్కునుబట్టి హృదయమును పరిశోధించుట వృథా ప్రయత్నము. స్వర్ణ మాతాపితలు లేని అనాథ బాలికగా గ్రహించుము. నారాయణశర్మగారి యింట నామెయుండ, వృద్ధుడగు నాయెడ నామె భీతియును జయింపజేసితిని. నీ ప్రణయమామెకు పలుమారులు వర్ణించితిని. ఆమెయు నీకంటె ఎక్కువ నీకొఱకు పరితపించుచున్నదని గ్రహించితిని. ఒకనాడు సాహసించి, "బ్రాహ్మణునితో వివాహము నాకందరాని కోరికగదా" యని సంశయము వెలిబుచ్చినది. నిన్ను బ్రాహ్మణ బాలికగా వ్యవహరింప జేయుదునంటిని. నీ కామోదమేనా ముందు నిర్ధారణ చేసుకొమ్మనినది. మోహోన్మత్తుడగు నాతడింకను తడవుచేసిన ప్రమాదస్థితికి వచ్చును. వివాహముకానిమ్ము. రహస్యము బయల్పడుటకు కారణమేది? యని వాదించితిని. ఈ తెలుపు ఆమె హృదయాంగీకారము పడసినది లేనిది నాకు తెలియరానిదై యుండెను. ఒకప్పుడు నేత్రములు అశ్రుపూరితములు. వేరొక తడవు ఆశాప్రపూర్ణములు. వివాహ రాయబారములు మొదలగునవి నీకే తెలియును. పెండ్లి రద్దుపరుపుమని హెచ్చరించినది, ముహూర్త మిక రెండుదినములు మాత్రముండ తనను వేఱొకచోటకు బంపి, తాను మరణించినదని ప్రచురింపమనినది పాపము స్వర్ణ. ఆమెను జయించితిని మాటలసహాయమున. అతని మరణమునకు హేతుభూతమగు అట్టి వార్తయే ప్రచురించినచో అతని మరణవార్త నీచెవిని బడి నీ ప్రాణములు తీయవచ్చును. ఈ వయస్సున, ఈ ముదిమిని, బ్రాహ్మణహత్య స్త్రీహత్య నాకంఠమున జుట్టుకొనమనెదవా? అని ఆమెమనస్సు మరల్చితిని. తుదకు వివాహము జరిగినది. చాలసంతోషించితిని, నావిద్యుక్తధర్మము నెఱపితినిగదా యని."

"ఈవార్తమాతండ్రికి తెలియజేయుట క్రౌర్యము గాక మరేమిటి" అనినాడు మోహనుడు.

"స్థిమిత మనస్కుడవగుము. నావిద్యుక్తధర్మము నెఱవేర్చుటకొఱకు, మీవంశమును కులభ్రష్టముగా జేయుటలో దోషములేదు. శూద్రకన్య పరిగ్రహణముచే కళంకాపాదితమగు మీయింటి బాంధవ్యముచే, మరొక కుటుంబమును సంఘదూరులుగ జేయుట నా అంతరాత్మ అంగీకరింపని పని. మీసోదరి వివాహము నిశ్చయమగుట విని పెండ్లికుమారుని తండ్రికి స్వర్ణవృత్తాంతమును తెలుపుచు, ఋజువు పరుప సిద్ధముగ నుంటినని కబురు చేసితిని."

హృదయవేగమును, మిక్కిలి కష్టమున నాపుకొనుచు మోహనుడనినాడు "ఆ బాలికను నేను పరిత్యజింతుననుకో. ఆమెను భరించువారెవరు? నీవేమైన గ్రాసవాసము లొసగెదవా."

"విడువబడిన భార్యల భరించు భారము బూన వ్రాయబడెనా నానొసటి? నాకేమి బాధ్యత?" అని నాడు రామమూర్తిగారు జంకక.

*

నాడు కృష్ణపక్షపంచమి. ఇంకను చంద్రోదయము కాలేదు. చీకటి. విహంగారావములు లేవు. మలయానిలము మిగుల మందముగనుండెను జోగుచు నడచువానివలె. అంతయు నిశ్శబ్దము. మోహనుని గదియందు దీపముకూడ లేదు. న్యాయాధికారి పాదముల నంటి అపరాధిని. ఆగదియందు ఉత్తర ప్రత్యుత్తరములుకూడ వినరావు. తిరిగి గదికవాటముదరి పరిచిత చరణధ్వని.

"నీకు తగినంత గడువొసగబడినది. తక్షణము స్వర్ణను ఇంటినుండి గెంటివేయుము" అని అవధానులు కోపముతో అరచిరి.

స్వర్ణ కవాటపాళిక నుంచి, అతని పాదముల మూర్ఖుని కౌగలించి, నమస్కరించి వదలిన చాలని పాదయుగ్మము.

మోహనుడు తండ్రివద్దకుబోయి "నేను నాప్రేమమూర్తిని విడువను" అని జవాబిచ్చెను.

"ఏమి! కులము చెఱుపుకొనుటకు వెనుకాడవా?"

"కులమును నేను గణింపను"

"అగుచో నీకును వెలి"

"నాజీవితేశ్వరి సాహచర్యమునకు వెలిగానిచో ఈవెలివలన నాకేటిభయము?"

# ముందంజ

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ. బి. యల్.

ఇటీవల రాజమంద్రిలో జరిగిన కవుల సమావేశములో స్త్రీలుకూడ విశేషముగా పాల్గొన్నారు.—ఎంతేని ఉత్సాహముచూపినారు. ఈ అపూర్వ దృశ్యమున ఆనందలహరి వెల్లి విరిసినది.

ఆంధ్రదేశములో అప్పటప్పట కవితా సమితులు జరుగుచునే ఉన్నవి. ఈసమితులలో పెక్కండ్రు పురుషులే చేరుటకు అడలువారనిన, వనితలు వానిదాపలఁ జేరెడివారే కారనిన ఎవ్వరును ఆశ్చర్యాన్వితులు కానక్కఱలేదు. సాధారణులగు పురుషుల గుండియలనుండియు, స్త్రీల హృదయముల నుండియు బరువైన భీతిని, బాధకరమైన సంశయమును తొలగించి, నేటి సమావేశమున నెల్లఱను ఒకచోఁ జేర్చిన అద్భుతశక్తి స్వాతంత్ర్యశక్తి!

నేటియుగము స్వాతంత్ర్యయుగమని ఈవఱలో పలుమాఱు పలికి యుంటిని. స్వాతంత్ర్యసిద్ధి యింకను కలుఁగకున్నను, ఇంతదనుక ఇందును అందును అల్లాడు మానవులు స్వాతంత్ర్యమును దృష్టియందిడికొని, దానిదెస అడుగులను సాగించుచున్నారు.

భయసంశయములు మౌఢ్యమును, అలసదనమును, ఆత్మశక్తియెడల అవిశ్వాసమును పెంపొందించి, బ్రదికినవ్యక్తినిచచ్చినవానితో సమునిజేయును. భయసంశయములను పోఁగొట్టఁజాలునది స్వాతంత్ర్యకాంక్షయే.—కావుననే స్వాతంత్ర్యము స్వర్గలోకమనిరి పెద్దలు. నేటి స్వాతంత్ర్యభావ స్పర్శవలన గుండెభారము గుభిల్లుమని నేలఁగూలెను.—కావుననే పల్వురు యువకులును యువతులును నేఁటి సమితియందు తలయెత్తి నిలిచిరి!

నేఁడు వీరు కొంత కనులఁజూచిన స్వాతంత్ర్యము భాషాస్వాతంత్ర్యము. ఈ స్వాతంత్ర్య సమరమున జయభేరిమ్రోఁగించిన మహావీరుఁడు మహోపాధ్యాయుఁడు శ్రీ గిడుగు వేంకటరామమూర్తిగారు. నిన్నగాక మొన్నటి వఱకు తెలుఁగువ్రాయుటకు అనుభవనీయులగు వారే జంకువారు. ఏమివ్రాసినను, "ఇది వ్యాకరణ స్ఖాలిత్యములకుప్ప!—యిది తప్పులగుట్ట!!—ఇట్టిపనికి మాలిన వ్రాతలు అచ్చుపడరాదు; ప్రజలకన్నులందు పడరాదు" అని పండితులును, పండితుల వెనుక "భళాభళి" అనువారును హుంకరించువారు. తెలుఁగువ్రాయుట తెలుఁగులకు కాక సంస్కృతులకే అనియు, ఎఱుఁగని వ్రాతలువ్రాసి తలవంపులను, చివాట్లను తెచ్చుకొనుట ఏలయనియు పలువురు తలవాకిట తలదాచుకొని ఉండిరి. ఎల్లైన తెలుఁగని చెప్పఁబడుచున్న తెలుఁగును నేర్చికొనవలెనని ఎంచి, కొందఱు ధీరచిత్తులు పండితుల



మిస్. ఇందుమతీ పండిత

వయసు 16. కొల్హాపుర కళాశాలయందు వక్తృతా విషయమున మిగుల గొనియాడఁబడినది.

ఛా॥ చి॥ ఆర్. వెంకోబారావు, శ్రీరంగం.



శ్రీమతి జయలక్ష్మి వరదాచారి

మైసూర్ మహారాజా కళాశాలయందు వక్తృ
శక్తిగలవారిలో నగ్రగణ్య. ఇండో బ్రిటిష్ డిబేటిం
సొసైటీయందు నియమ పాల్గొని బహూకరింపఁబడె

ఛా॥ చి॥ ఆర్. వెంకోబారావు, శ్రీరం

# వనితా లోకము



మిస్. శాంతన భట్టాచార్య

డా॥ డి. ఆర్. భట్టాచార్యగారి ద్వితీయ పుత్రిక. ...సు 8 యేండ్లు. అలహాబాదు యూనివర్సిటీ సంగీత ...షత్తునందు ఈబాలిక ఆరు బహుమానముల నందినది. ...త్యమునందును తబ్లా వాయించుటయందును ప్రథమ ...హుమాన మీయబడె.

ఫొ॥ చి॥ ఆర్. వెంకోబారావు, శ్రీరంగం.



మిస్. మాయాభట్టాచార్య

డా॥ డి. ఆర్. భట్టాచారిగారి కుమార్తె. అలహాబాద్ యూనివర్సిటీ సంగీతపరిషత్తునందును, గాత్రపాటయందును నృత్యమునందును అగ్రబహుమానము నొందెను.

—ఫొ॥ చి॥ ఆర్. వెంకోబారావు, శ్రీరంగం.

కొరడాలనుండి తప్పుకొనుటకై, నిర్దుష్టమైన భాష వ్రాయనిశ్చయించి వ్యాకరణములు తెఱచువారు. తెఱచినను, వీనిని వీరు తమంతకు తాము బోధపఱుచుకొనిరని నొక్కి చెప్పలేము.

తుమున్నర్థక, శత్రర్థక, క్త్వార్థక, చేదర్థక, అనంతర్యార్థక, వ్యతిరేకక్త్వార్థకములని తెలుపబడిన వ్యాకరణాంశములను తల్లిమాటలలో వాడుచున్నను, సాధారణ దురూహ్యశబ్దములందు గోచరించునవి యేమేమో కొఱుకుపడని కొయ్యలని కొందఱు చకికిల పడిరి. ఆమ్రేడితము పరమగు టేమో, అచ్చునకు దీర్ఘము వైకల్పికమగు టేమో, అమహద్వాచకములననేమో, బహుళమగు టేమో ఎఱిఁగినవారు ఎందఱో లేరు. "హ్రస్వమైన త్రికమునీఁదిచోటు శబ్దముయొక్క ఓకారమునకు హ్రస్వముగాని అకారముగాని విభాషనగును" అను కొండొక వ్యాకరణ వాక్యమున కర్థము తెలియక చక్కని తెలుఁగు వ్రాయఁగలిగిన ఒకయువకుఁడు తెలుఁగు వ్యాకరణమును తెఱువనని ఒట్టుబెట్టుకొన్నాఁడు. చెప్పఁదలఁచిన దేమన, తెలుఁగు నేర్చికొనఁదలఁచిన తెలుఁగులు వ్యాకరణమువ్రాసి శతాబ్దములకు మున్నె చచ్చి స్వర్గముచేరినవారి సాయముఁగాని, సంధ్యావందన వతుగా వ్యాకరణములను పెనవైచి బండసూత్రములను బట్టీపట్టి గొంతుకపట్టని ముక్కలను గట్టిగ లోనికి దిగఁగొట్టి అర్థమెఱిఁగినను ఎఱుఁగకపోయినను నాలుఁగు పెద్దముక్కలను విసరివేసి 'చూడండి మా త్రాణ!' అను వారి సాహాయ్యముఁగాని గొనియే కృతకృత్యులుకాఁ కలుఁగుచున్నారు. అవతారము లెత్తినను కొఱుకుపడని ఈ వ్యాకరణములు తప్పుల తుట్టలనియు,—ఒకరి జుట్టు ఒకరు పట్టుకొనుటందున ఆఱితేఱి ఒకరివ్రాత లింకొకరు బండబూతులనియు, తప్పుడుకూఁతలనియుఁ హుమ్మును పండితులకు తెలుఁగే రాదనియు, గునపమువంటి మాటలను విసరి గిడుగు రామమూర్తిగారు తెలియని డొంకలోపడి తెన్ను తెలియక 'ఏమి దైవమా ?' అని దేవులాడు ఆంధ్రలేఖకులచే "అమ్మయ్యా!" అనిపించిరి. శ్రీరామమూర్తిగారిని సమ్మానించు నవసరమున యువకులును, యువతులును, గెలుపుసిడె మెత్తుటకు ముదంజ వేయుటకు కారణమిది.

భాషాస్వాతంత్ర్య మెంతవఱకు కొనసాగెనో, శ్రీరామమూర్తిగారి వాదన లెంత దూరము గమనార్హములో, వీనినిపాటించుపట్ల యువతులును, యువకులును భాషాంగణమున నెట్లగ్రసరులు కావలెనో ముందు సంచికలోఁ దెలుపుదును.

—



# ఇంకెక్కడి జయము?

శ్రీమతి తాడి నాగమ్మగారు

౧

మహేశ్వరచంద్రచక్రవర్తి గొప్ప సంస్థానాధీశుడు. సంవత్సరమునకు పదిలక్షలు రాబడి. సద్వినియోగము చేసినచో ఫలితము గొప్పదై యుండెడిది.

జీవితము క్షణభంగురము. అందును మానవజీవితము బుద్బుదప్రాయము. నిన్న సజీవి నేడు నిర్జీవి. నేటి సజీవి రేపు ఏమో! రెప్పపాటుకాలమున జీవితము సమాప్తి కాగలదు. ఇట్టి అనతికాలములోనే మానవ జీవిత మెన్నియో మార్పులకు లోనగుచుండును. ఓడలు బండ్లును, బండ్లు ఓడలును అగును. నేటిలక్షాధికారి రేపుభిక్షాధికారి. నేటిభిక్షాధికారి రేపులక్షాధికారి. నేటి అనామకుడు రేపుప్రధాని. నేటిప్రధాని రేపు అనామకుడు. నిన్నటి రాజాధిరాజు నేడు రాజ్యభ్రష్టుడు. నేటి రాజ్యభ్రష్టుడు రేపురాజాధిరాజు. అందును నాగరికత వాయువేగమున ప్రవహించు ఈకాలమున మార్పులకు కొదువలేదు. వింతలకు విడ్డూరములేదు. చపలత్వమునకు అంతులేదు.

ఇట్టిది మానవజీవితము. మహేశ్వరచంద్రుడును మానవుడే!

౨

మహేశ్వరచంద్రుడు ఇరువదవయేట పట్టాభిషిక్తుడయ్యెను. దానికి రెండుదినముల క్రితమే కళాశాలను విడిచిపెట్టెను. అకస్మాత్తుగ తండ్రి చనిపోవుటచే ఇది జరిగెను. విశ్వవిద్యాలయమును విడిచినది మొదలు మహేశ్వరుడు మరియొక క్రొత్తప్రపంచమును ప్రవేశించెను. అందు తాను నూతనపురుషుడు. ఇంత వరకు తాను నివసించిన విశ్వవిద్యాలయప్రపంచమునకును, తాను ప్రస్తుతము ప్రవేశించిన ప్రపంచమునకును పోలికయేలేదు. షేక్స్పియరు, మిల్టను, బర్కు, బేకనులు విశ్వవిద్యాలయములందు జీవింపవలసినవారే గాని తక్కిన మానవలోకమునందు వారికి తావులేదు. ఆదర్శములందు బర్కు ఉత్తమోత్తముడే యైనను ఆచరణమునందు విఫలుడగుటకు కారణము మానవప్రపంచ మతనికి భిన్నముగుటయే. అఖిల మానవప్రపంచమునకు విచక్షణాజ్ఞానము నేర్పి మానవకోటి నుద్ధరించిన సోక్రటీసు చంపబడుటకును, పరులను తనవలెనే ప్రేమించి ప్రాణవిరోధులకు కూడ కీడు రాకూడదని ప్రార్థించిన క్రీస్తు సిలువవేయబడుటకును, బర్కు నిరసింపబడుటకును కారణము మానవప్రపంచము ఉత్తమపురుషులకు భిన్నముగ నుండుటయే. అనుభవముమీద తెలవలసిన విషయమిది.

గొప్ప ఆడంబరముతో పట్టాభిషేకము జరిగెను. వైస్రాయి, గవర్నరు, కలెక్టరు మొదలగు రాజ్యాంగతంత్రములను నడుపు రథులకు మహారథులకు ఆహ్వానము లంపబడెను. అతిథులకు పరిమితిలేదు. విందులకు లోటులేదు. ఉపన్యాసములకు కొదువలేదు. పొగడ్తలకు మితములేదు. అభినందనములకు అంతులేదు. కవులకు పారితోషికములు, వందిమాగధులకు వరదానములు, బ్రాహ్మణులకు భూరిదానములు, అతిథులకు సత్కారింపులు అన్నియు కలిపి లెక్కలు తేల్చ సరికి ఆదాయమును మించిన అప్పు ఆరులక్షలు తేలినది.

౩

మహేశునకు యూరపునందలి వింతలు వినోదములు చూడ కోర్కె జనించెను. జనించుటే తడవుగా స్వజన సపరివారముగ యూరపుయాత్రకై బయలుదేరెను. ప్రత్యేకముగ సుందరమైన నౌకను కంట్రాక్టు తీసికొనెను. బొంబాయిలో గొప్ప విందులు జరిగెను. ప్రాక్పశ్చిమముల నాగర అనాగరికతలకు నిలయానిలయమైన బొంబాయిపట్టణమునకు మరుగై నౌక అరేబియాసముద్రమునందు, ఊగుచు, ఈదుచు పోవుచుండెను. మహేశుని మనస్సు ఊహాసముద్రమునందు తేలి యాడుచుండెను.

తాను పోవున దెక్కడికి? అఖిల మానవప్రపంచ జ్ఞానవిజ్ఞానమునకును, అర్థానర్థములకును, ఆకారవికా

రములకును, నాశనవినాశములకును ఆటపట్టై ప్రస్తుత ప్రపంచచక్రమును త్రిప్పుచున్న యూరపుఖండము నకు. ఎందుకు? వింతలు, వినోదములు, భోగములు, విలాసములు అనుభవించుటకు. తనకు లోటేమిటి? ఖర్చుపెట్టుటకు ధనముగలదు. వెళ్లుటకు శక్తికలదు. చూచుటకు కండ్లుకలవు. అనుభవించుటకు అంగములుకలవు. భళీ! యూరపునందు కర్చుపెట్టి భారత దేశమునందు పేరు సంపాదింపవలెను.

ఇది మహేశుని తీర్మానము. ఈతీర్మానమును స్మరించుచు అతడు యూరపులో కాలుపెట్టెను. కాన్స్టాంటునోపిలు దర్శించెను. అప్పటికి కెమల్ పాషాగారు అధికారమునకు రాలేదు. రోము పట్టణము చూచెను. అప్పటికి మస్సులోని ఇటలీకి డిక్టేటరు కాలేదు. పెట్రోగ్రాడ్ దర్శించెను. అప్పటి కది లెనిన్ గ్రాడ్ గా మారలేదు. బెర్లిన్ నగరము గాంచెను. కైజరుయొక్క త్రిశంకు స్వర్గమును కనులారగాంచెను. ఫ్రాన్సుచేరెను. పారిస్‌నందు విడిసెను. వింతలుచూచెను. విలాసవతుల చెట్టబట్టెను. బ్రాంది విస్కీల భాగ్యమబ్బెను. పరానుభోగముల ననుభవించుచు కొంతకాలము గడపెను. తదనంతరము ఇంగ్లాండుచేరెను.

అక్కడి దృశ్యము వేరు. అనుభవము వేరు. స్టేటు శక్రటరీగారికి ఒకదినము విందు. అండర్ శక్రటరీ గారికి మరియొకదినము విందు. రిటైర్డు వైస్రాయి గారికివిందు. సెలవుపైనున్న వైస్రాయిగారికివిందు. చూడవచ్చిన గవర్నరుగారికి విందు. పలుకరించ బోయిన ప్రభ్విగారికివిందు. నైటుహోలునందు విందు. హోటేలునందు విందు. క్లబ్బులో విందు. ప్రతిఫలముగా ఉపన్యాస పరంపరలయందు పొగడ్తలు. మహేశునిది పురాణవంశజుల సారాంశ మన్నారు ఒక రిటైర్డువైస్రాయి గారు.

కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమువారు మహేశుని ఆహ్వానించిరి. గొప్ప సభజరిగెను. దానికి మహేశుడు అధ్యక్షుడు. అందు మహేశుని పొగడిరి. మహేశుడు భారతదేశమునకు యింద్రుడు. భూలోకమునకు చంద్రుడు. పరలోకమునకు బాంధవుడు. జ్ఞాని. విజ్ఞాని. ధర్మమునకు పెట్టినిల్లు. త్యాగమునకు పుట్టినిల్లు. ఇట్టి పొగడ్తలకు మహేశుడు ముగ్ధుడాయెను. హృదయముప్పొంగెను. ఒడలుమరచెను. ఆరులక్షలరూపాయలు తూర్పుదేశముల విజ్ఞానమును పెంపొందజేయుటకు ఆవిశ్వవిద్యాలయమునకు దానము చేసితినని అప్రయత్నముగ పలికెను. ఈ సంగతి వెనువెంటనే ఇంగ్లాండునందు మారుమ్రోగెను. ఈ సంగతినె వేనోళ్ల శ్లాఘించుచు రూటరు పది ప్రత్యేక తంతీవార్తలను భారతదేశమునకు పంపెను. వెంటనే మహేశుని మరికొన్ని విద్యాలయములు ఆహ్వానించినవి. వాని నంగీకరించిన ధనమునకు లోటు. అంగీకరింపకున్న గౌరవమునకు లోటు. గౌరవమునకే మహేశు డాస్థానమిచ్చెను. ధనమే తన్నిట్లు గౌరవింప జేయుచున్న సంగతి అతడు మరచెను. విధిలేక ఆహ్వానముల నంగీకరించెను. అడిగినదే తడవుగా ధనవర్షము కురిపించెను. ఇట్లే అమితమైన ఖర్చు. కుక్కలను కొనుటకై వేలు ఖర్చుచేసెను. గుఱ్ఱములకై లక్షలు. తన ఎస్టేటునావ అప్పు సముద్రమునందు మునుగుచున్నదని మహేశునికి ఎన్నడును తట్టలేదు. ఇది మహేశుని యూరపుయాత్ర.

అట్టహాసముతో మహేశుడు యిండియాకు బయలుదేరెను. పీడ్కోలుపు విందులుగుడిచెను. తనతో పూర్వము విందు లారగించిన వారంతగ రాలేదు. గాని తమతమ ప్రతినిధులను మాత్రము సాగనంపిరి. ఓడ ఆరేబియాసముద్రమునందు ప్రవేశించెను. మహేశునిమనను ఇండియాలో విహరించుచుండెను. తనపేరు భారతదేశమునందు దిగంతములవరకు మ్రోగుచుండునని మహేశుడు భ్రమించెను. నాగరికతలో యూరపువానులకు మూడు దినములు ముందుగనే తాను భారతదేశమునందు దారి చూపగలవని అతని నమ్మిక. అట్టి నమ్మికతోనే బొంబాయిరేవులో కాలుపెట్టెను. ఆహ్వాన

ములు సన్మానములు సక్రమముగానే జరిగినవి. అతడు తనరాజభవనము చేరెను. మహేశుడు యూరపుయాత్రలో విలాసవతుల చెట్టబట్టుట, బ్రాంది విస్కీల కలవడుట, దుర్వ్యయము చేయుట అందుచే ఎస్టేటు అప్పు సముద్రమునందు మునగనుండుట అతని అర్ధాంగి గుర్తించెను. కడుచింతించెను. వలదని వారించెను. వినకపోవుటచే దుఃఖించెను. క్రమముగా కృశించెను. దీనికితోడు భర్త విలాసవతుల చెట్టబట్టుట ఆమె సహించలేకపోయెను. క్రమముగా క్షీణించి విగతజీవియాయెను. మహేశుని అర్ధాంగ లక్ష్మి అంత ర్హితురాలాయెను. నవనాగరికుడు గాన అంతగా మహేశుడు విచారించలేదు. వెంటనే ద్వితీయ కళత్రమునకు దలపడెను. ప్రథమ పెండ్లిని మించిన వైభవముతో రెండవపెండ్లి ముగిసెను. అభినందనములు ఆశీస్సులు వర్షించినవి. ప్రత్యేకతంతు లనేకము లరుదెంచినవి. ప్రత్యేక వైస్రాయి; స్టేటు శక్రటరీ మొదలగువారిలేంతులకు అంతులేదు. పెండ్లి బహుమతి (Marriage gift) మహేశుడు ఒక కళాశాలకు ఏబదివేల రూపాయలిచ్చెను. వివాహ మహోత్సవమునందు నాట్యమాడిన "బొంబెమెయిల్" అని ప్రసిద్ధిగాంచిన వేశ్యకు, మహేశుడు బహుమానముగా బొంబాయిలో ప్రసిద్ధిచెందిన ఒక సౌధమును కొనియిచ్చెను.

౫

వివాహము ముగిసెను. మహేశుని విభవముకూడా ముగిసెను. పెండ్లిఅయిన సంవత్సరము మాత్రమే మహేశుడు రాజ్యభోగముల ననుభవింపగలిగెను. రాజప్రతినిధి వద్దనుండి లేఖవచ్చెను. అందిట్లున్నది. "మీరు దుష్పరిపాలన మొనర్చుటవల్ల ఎస్టేటు అప్పులపాలైనది. మీరాబడి సంవత్సరమునకు పదిలక్షలు. అప్పు రెండుకోట్ల యేనుబది లక్షలు. ఎందులకు మిమ్మును రాజ్యభ్రష్టుని చేయగూడదో 24 గంటలలో తెలియజేయవలెను. ఇట్లు—"

మహేశుడు నిశ్చేష్టుడాయెను. చిగ్గభయచేరు దాను. ఉచ్ఛ్వాస నిశ్వాసము లక్కే నిలిచిపోయెను. దేహము వణకెను. ముచ్చెమటలు గ్రమ్మెను. తలదిరిగెను. అవయవముల పటుత్వము తప్పెను. అప్రయత్నముగా కెవ్వుమని యరచి మూర్ఛబోయెను. గాని త్వరలోనే తెలివినొందెను. తనకు రాబోవు స్థితిని యూహించెను. గతించిన అనుభవము జ్ఞప్తికిదెచ్చుకొనెను తన యూరపుయాత్ర, బెర్లిన్, పేరిస్ నగరముల విలాసములు, లండనువింసులు కేంబ్రిడ్జి మొదలగు విశ్వవిద్యాలయముల అభినందనలు ఒకటివెంబడి మరియొకటి జ్ఞప్తిరాదొడగెను.

ఆనాటి యనుభవములు నేడు తనకు మెరపుమెరసినట్లయినవి. అంతగా తన్నుపొగడిన స్టేటు శక్రటరీగారును, ఇంతగా అభినందించిన వైస్రాయిగారును, తన్నిట్లు అకస్మాత్తుగా అధోగతిపాలు సేతురాయని తలపోసెను. ప్రిమియరుకు విన్నవించుకొనుట మంచిదేమోయని భ్రమపడెను. ఇంతలో ఇరువదినాలుగు గంటలు సమీపించుచుండెను. అంత స్వల్పగడువు చాలదని మాత్రము మహేశుడు విన్నవించుకొనెను, మరుసటిదినమే మహేశుడు పదభ్రష్టుడాయెను.

౬

కాలచక్ర మెవరికొరకును వేచియుండదు. అది ఒకరి సాధ్యమునందులేదు. కాలచక్రమునం దెన్నియో రాజ్యములు, మహారాజ్యములు, సామ్రాజ్యములు నమసిపోయినవి. అందెన్నియో మతములు జాతులు జీర్ణించి పోయినవి. అందెన్నియో దేశములు, నాగరికతలు జీర్ణించిపోయినవి. కాలచక్రమును పట్టి వెనుకకు త్రిప్పగల్గినయెడల అవన్నియు చూడగల్గుదుము. మహేశ్వర చంద్ర చక్రవర్తి పదభ్రష్టుడయి కాలచక్రమునం దిప్పటికి పదునైదువత్సరములాయెను. ఈ స్వల్పకాలములోనే మానవమండలియందు చిత్రవిచిత్ర సంఘటన లనేకములు తటస్థించెను. మానవ ప్రకృతియే మారిపోయినది. శిథిలమగుచున్న టర్కీకి కెమల్ పాషాగారు ప్రాణముపోసి విఖ్యాతపురుషుడాయెను. ప్రపంచమునందు మహాసామ్రాజ్య స్థాపన

లకు మార్గదర్శియై తుదకు నామరూపములు లేకుండ నాశనమగుచున్న రోమను సామ్రాజ్య చక్రము మన్నులోని హస్తగతమాయెను. నిరంకుశత్వమునకు నిలయమైన పెట్రోగ్రాడు ప్రజాపరిపాలనకు నిలయమైన లెనిన్‌గ్రాడ్‌గా మారెను. బెర్లిన్ నందు త్రిశంకు స్వర్గము ననుభవించుచుండెడి కైజరు పీఠభ్రష్టుడయి పారిపోయి వ్యవసాయము చేసికొనుచుండెను. మాడ్రిడ్ పట్టణముయొక్క గతి మారి అల్ఫాంసో రాజు అధోగతిపాలాయెను. ఇంగ్లాండునందు కన్సర్వేటివుల ప్రభ తగ్గి లేబరైటుల ప్రభ హెచ్చెను. ఇట్లు ఈ స్వల్పగోళమునం దెన్నియో మార్పులు సంఘటిల్లెను. కలిమి లేములు కావడికుండలు. వెన్నెలల ప్రభ చీకటులఅంధకారము మానవునకు సహజము. అట్లయ్యును వాని సంఘటనచే మానవుడు చలించుచుండును. ఇది సహజము.

౨

నాడు ఆపట్టణమునం దేమూలజూచినను ఉత్సాహము కాన్పించుచున్నది. జనులందరు ఆబాల గోపాలముగ ఒక్కదెసకు బోవుచున్నారు. ముఖ్యముగా యువకులు, యువతులు, గుంపులు గుంపులుగా పోవుచుండిరి. నడువలేనివారు ఒంటెద్దుబండ్లు, జట్కాలు, మోటారుల నెక్కుచుండిరి. పురాణయుగమునందు చేయబడినదాయను సంశయము దోచు నొకగుఱ్ఱపు బండిని దోలుకొని, ఎవరైనను కూలికి పిలిచెదరా యని ఉదయమునుండి యొకడు వేచియుండెను. పిలుపుమాత్రము రాలేదు. గతదినము దినినతిండి. ఉదయము లేచి ముఖమైనను కడుగలేదు. ఎవరైనను పిలువకుందురా యనెడి ఆశమాత్రము పోలేదు. ఇంతలో 'ఏబండీ—ఏబండీ,' అనెడి మాటలు వినవచ్చెను. ఆశతో అతడు బండితోలుకొని పరుగెత్తెను. పిలిచినవ్యక్తి ఒకస్త్రీ. నవనాగరికత మోమున తాండవమాడుచుండెను. ఒక కోమలాంగి తనయొక్క దర్జాను పురాతనపు జట్కా తగదనియెంచి ముఖము చిట్లించి మరియొక జట్కాబండికై వెదకసాగెను. ఒకకైనను కాన్పింపమిచే, తుదకు, గత్యంతరములేక ఆపురాతనపు బండిలో ఎక్కి కాలేజి వద్దకు బండితోలుమనెను. బండి వేగముగ కాలేజి వైపునకు పోవుచుండెను. బండివాడాస్త్రీని ఆపాదమస్తకముగ పరీక్షింప సాగెను. తానెప్పుడో ఆ స్త్రీని జూచినట్లుండెను. తనకామె చిరపరిచితురాలైనట్లు తలంచెను. జ్ఞప్తికి తెచ్చుకొన యత్నించెను. కాని వ్యర్థము. స్ఫురణకు రాలేదు. సమానపోలికలు గల మనుష్యులుండరా? కంఠస్వరముకూడ పరిచితమైనదె. "ఎవరీమె?" యనెడి ప్రశ్న బండివానిని ఒత్తిడిచేయ మొదలిడెను.

అంత బండివాడు "అమ్మా తమదేయూరు?"

స్త్రీ—"ఎందుకు?"

బండి—"తమరిని పూర్వ మెచ్చటనో చూచినట్లున్నది."

స్త్రీ—"మాది బొంబాయినగరము."

బండివా...."ఇపుడు కాలేజికి ఎందుకు వెళ్లుచున్నారు."

స్త్రీ—అక్కడ నేడు గొపఉత్సవము జరుగును. విద్యార్థులకు పోటీ ఆటలుపెట్టి గెలిచినవారికి బహుమానములీయ గవర్నరుగారు రేతెంచినారు. నేడు అక్కడ సైనికప్రదర్శనముకూడ జరుగును. గొప్పవారందరు నేడు అక్కడనే యుండెదరు.

బండి—ఇందుకై ఎంత డబ్బు ఖర్చగునో.

స్త్రీ—"ఆ డబ్బంతయు—పాపము—ఒక ఎస్టేటుదారునిది. అతని పేరు మహేశ్వరచంద్ర చక్రవర్తి. తన ద్వితీయ వివాహకాలమునందు 50 వేలు ధర్మముగ (Marriage gift) నిచ్చెను. దానిమీద వచ్చు రాబడితో ఏటేటా ఇట్టి ఉత్సవములు చేయుచుందురు. ఆ పెండ్లికి చేసే గజ్జెకట్టితిని. పాపము! దురదృష్టవంతుడు. వెంటనే పదభ్రష్టుడైనాడు. తరువాత ఏమాయెనో అతనిజాడ లెవరికిని తెలియవు."

బండితోలువానిని యీమాటలు కలతపెట్టసాగెను. మరచిన తన గత జీవితమంతయు తలపునకు రాదొడగెను. అనాదినుండియు అఖిల భారతీయులచే వేనోళ్ల శ్లాఘింపబడుచున్న ఇక్ష్వాకు వంశమునకు చెందిన తాను పదిలక్షలు రాబడిగల ఎస్టేటు దారుడైయుండి, ఒకప్పుడు ప్రాక్పశ్చిమములందు మెరుపువలె మెరసిన తాను— నేడు—క్షుద్వ్యాధితుడై హీనవస్త్రాలంకృతుడై ఒకానొకప్పుడు తన యింపుడుకత్తెయై తన యడుగులకు మడుగులొత్తిన వేశ్యకు బండికట్టి తోలుకొని జీవింపవలసివచ్చెను గదా! ఒకప్పుడు తళుకు బెళుకుల మోటారులయందు విహరించినవాడు తాను నేడు భోగముదానికి బండి తోలుచున్నాడు. ఒకప్పుడు స్టేట్ శెక్రటరీ వైస్రాయుల పొగడ్తలనందిన తాను— నేడు కూలిడబ్బులకై ఒక వేశ్యను పొగడుచున్నాడు. ఒకప్పుడు కేంబ్రిడ్జి విద్యాలయమందు అఖండగౌరవము నందిన తాను నేడొక చిన్ని కళాశాల యుత్సవసందర్భమున బండి తోలుకొని బ్రతుకవలసివచ్చెను. ఇట్టి తలపులతో బండిని తోలుచున్న మహేశ్వరచంద్ర చక్రవర్తి మనసు కలవరపడసాగెను. తన నీచపుదశ తనకు ప్రత్యక్షమాయెను. తన్నామె ఆనవాలుపట్టినదేమోయని దద్దరిల్లెను. తన నికృష్టపుదశ పరులెరుంగకూడదని మానవుని తలంపు. గతించిన జీవిత యాత్రారంగములు కండ్లయెదుట తరంగములవలె లేచెను. గత దినమున తినిన తిండి. తా నొకప్పుడు చేసిన ధర్మమును చూడబోవుచున్న వ్యక్తికి బండిగట్టి తోలినగాని నేడు తనకు పొట్టనిండదు. ఇట్టిది యీ మానవజీవితము! మహేశుడు పెద్ద నిట్టూర్పు విడిచెను. ఒకటి రెండు అశ్రుకణములు రాలెను. ఇంతలో బండి కాలేజి చేరెను.

ఒకవైపు పిల్లలు పరుగులెత్తుచున్నారు. కొందరు కాలిబంతి యాడుచున్నారు. మరికొందరు టెన్నిస్ ఆడుచున్నారు. కొందరు దుముకుచున్నారు. కొందరు ఎగురుచున్నారు. ఇట్టి వింత వింత చేష్టలతో కాలేజి ఆవరణమంతయు నిండియున్నది. సాయంత్రము నాలుగుగంటలు. గవర్నరుగారు వచ్చిరి. సైనికప్రదర్శనము జరిగెను. ఇంతలో ఆటలన్నియు పూర్తిఆయెను. గవర్నరు సతి గెలిచినవారికి బహుమతు లిచ్చుచుండెను. ఆఖరుబహుమతి నవరత్నఖచితమైన బంగారు మెడలు. దాని పేరు "మహేశ్వరచంద్ర చక్రవర్తి (Marriage gift). ఆ మెడలు గవర్నరుసతి పైకితీయుటతోనే మహేశ్వరచంద్ర చక్రవర్తికి జయ్ అను జయజయ ధ్వనులు భూనభోంతరాళము లదరునట్లు మిన్నుముట్టెను.

వేశ్యయిచ్చెడి డబ్బులకై అచ్చటనే వేచియున్న మహేశుడు "ఇంకెక్కడిది జయము" అనెను.



## భారతమాత

ధవళకాంతులచేత దనరుచుండు హిమాద్రి
రజతకిరీటమై ప్రభలనింప
పశ్చిమోత్తరమున బరగునారావళి
చెవులకాభరణమై చెలువుమీర
పరమపావనమైన బ్రహ్మపుత్రయుగంగ
కంఠహారములనుకరణి వెలుగ
తనుమధ్యమందున దనరారుచుండు మ
హానది యొడ్డాణమగుచునుండ
జీవనదులయిన కావేరికృష్ణలు
గజ్జలందియలయి కాళ్ళమెరయ
ఉపనదుల నై దుగలిగి దానొప్పుసింధు
కురులముడిచెడి ముత్యాలసరమనంగ
నొప్పుభారతమాత! నిన్నెప్పుడేను
హృదయమందున గొలుతు మమ్మేలుమనుచు.

శ్రీమతి కర్లపాలెం రాజ్యలక్ష్మమ్మగారు

# వి యో గి ని

నా యూహాప్రపంచమున ప్రజ్వరిల్లిన ఒక్క పవిత్రజ్యోతి. తోడనే జీవితమంతయు సాంద్రారుణరాగచ్ఛాయల వన్నెగాంచినది. ప్రాపంచికసుఖము లొక న్యూనతగాంచి, వివిధ విచిత్రవర్ణముల నలరారినవి. నవనవప్రేమాంకురములు పొడసూపినవి.

పూర్వ విషాదచ్ఛాయ లెందేగినవో! అపుడు జగత్తొక శూన్య స్వరూపముగా తోచెడిది. హృదయము జవలేశమై మ్రోడువాఱినది. జీవిత మొక తరళసలిల బుద్బుదమే!

నేటి యీ శోభకు కారణ మీ ఆకర్ణాయిత నేత్రముల దివ్యాకర్షణమా! ఈ జిలిబిలి పెదవుల చిఱునవ్వు వెన్నెలలా! ఈ లలితస్వరూపపు సమ్మోహనాస్త్రమా! ఈ కుమారి జగత్కళ్యాణి, నవమన్మథమూర్తి, నాపూర్వ ప్రేమాంకుర సుప్రసవము. నా జీవకొమ్మ. నా నోములపంట. నేను ధన్యను. ఈ విశాలప్రపంచమంతయు మే మిరువురమే. నేనూ, నా ముద్దులభాగ్యరాసియే...

* * * *

ఆహా! ఈ దివ్యానంద మొక్క క్షణభంగురమైనదే! ఈసుప్రణయ విశాల సౌధరాజ మొక్కపెట్టున నేలగూలినదే!

మాలదైవమా! ఏలనిర్మించితి వీమృగతృష్ణ? విషాదవార్ధినుండి తేల దీసి మరల అధఃపతనమున నుంచితివే!! ఏమిది! నీకు కరుణలేదా? ఏమనుచుంటివి? ఇదియంతయూ ఒక కలయా! ఐహిక సుఖములు క్షణజీవితములా! చాలు. ఈవింత వైరాగ్యములో నాకు పనిలేదు. నేనీప్రాపంచిక సుఖముల విడలేను. నా కుమార్తె నిటతెమ్ము. లేనిచో నీవేమగుదువో, నీవే ఆలోచించుకొనుము. నేను శపించెదను......ఏమిది! నే నున్మాదావస్థలోనైతినే, అబ్బా! అయ్యో! నాబిడ్డఏదీ! ఏదీ!.........

ఛీ! ఇది ఏమీ అంధకారము. ......... (జలములజూచి) అదినీరా? మండుచున్న కొరవిదయ్యమా? బిడ్డా! జడియకుము! ఇదుగో వచ్చుచున్నాను. ఆగుము. ఆ......ఆ......ఆ (నీటమునుగును.)

# ముగ్గురు అప్పచెల్లెండ్రలోనూ తెలివిమంతురాలు ఎవతె?

కవికొండల వేంకటరావుగారు.

రామవర్మ కూతుళ్లు ముగ్గురు. వరసగా పెద్దమ్మాయి, చిన్నమ్మాయి, చిట్టమ్మాయి అని పిలవడమే కాని పేర్లుపెట్టి పిలవక పోవడంచేత చాలాకాలం వఱకూ వాళ్ల పేర్లెవరికీ తెలియవు. పెద్దదిగి వారివారి మగలతో కాపరాలుచేస్తూ వచ్చిందాకా ఎవరికీ తోచేక, "పేర్లుపెట్టి పిలవాలి ఆడపిల్లల్ని, పెద్దమ్మాయి, చిన్నమ్మాయి, చిట్టమ్మాయి అని పిలవకూడదు. పిలిచినా వాళ్ళు పలకరు" అని

అదెట్లా సంభవించిందంటే, పెద్దమ్మాయిని రామవర్మవాళ్లూ పెద్దమ్మాయి యని పిలుస్తూంటే పెద్దమ్మాయి మగడో నాఁడు, "పెద్దమ్మాయి యేమిటి పెద్దమ్మా దద్దమ్మా" అని కినిసేడు. అదిచూచి చిట్టమ్మాయి మగడు "చిట్టు పొట్టు తవుడు దూగరకంటె నయంకదా?" అన్నాడు. చిన్నమ్మాయి మగడు చిరునవ్వునవ్వుతూ తన భార్యమొగంకేసి చూచినాడు. భార్య "అనండి మీకుతో చినమాట మీరనండి చిన్నీ చిన్నీ త్రొక్కుడుబిళ్లా" అని అంది. "నిన్నవందే నీకంత ఉడుకుల మోత్తనం ఎందుకే?" అంది రామవర్మభార్య.

అప్పట్నుంచి మదాలస, త్రిజట, ప్రమద, అని వాళ్లవాళ్ల అసలు పేర్లను పిలుస్తూ వచ్చేరు ఇంటిల్లిపాదీ.

మఱో మాఱోనాడు అల్లుళ్లంతా అత్తారింటికి వచ్చిఉన్న రోజుల్లో ఓ మధ్యాహ్నం త్రిజట పెనిమిటి త్రిజటతో "నీపేరు రాక్షసిపేరు" అన్నాడు. "పోనీలెండి మీరు పిల్చేదిలేదుగా పేరు పెట్టి. ఓయి, ఆయి, ఓంకాయి అనేగా! రాక్షసిపేరవితేం దేవత పేరవితేం" అంది త్రిజట. "కాని త్రిజటకల అంటే మహాయెక్కువైంది" అన్నాడు మగడు. "సెమలికలమా?" అంది పడుచు. "కలం కాదు కల" అన్నాడు ప్రియుడు. "కలానికి కుండా కలక్కూడా అధిక్యత వుందా లోకంలో. నాకు రోజురోజూ వస్తూనే వుంటుంది కల. ఈసరి కెన్నికలలు కన్నానో లెక్కాపత్రం లేదు" అంది పిల్ల. అంటూ నిద్రపోయింది. మగడామెనిదర నిజంనిదరా యుక్తినిదరా అని యోజించడం మొదలెట్టేడు.

"కలలుఅంటే మనష్యులు కల్లలుగా తోసేస్తారు. కాని యిప్పుడు నాయీనల్లభ అనుభవించే కల నిజమైందని నాకుతట్టుతూవుంది. నిజంగా జరుగుతూ వున్నట్టుగానే నాకు గోచరిస్తూవుంది." అని అనుకుంటూ త్రిజట మగడు త్రిజట నిదరపోతూవున్నప్పటి ముఖాబ్జంమీది ముసుకెమ్మట గమనిస్తూ కుడిచేడు.

ఇదంతా వాళ్లపడగ్గదిలో. ఈవల ఆవేళకు మదాలస, తనతండ్రియైన రామవర్మకడ కూర్చుండి పుస్తకం చదువుతూ అర్థం చెబుతూంది. ప్రమద అపక్కనే పెద్ద చట్రంమీద వేసి ఓచిత్తరువు లిఖిస్తూంది. రామవర్మ అడిగేడు "ఏదీ త్రిజట ఏంచేస్తోంది" అని. ఏమోఏమో అనుకొన్నారు అంతా. ఆ అనుకో వడంలోనే ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ మగని దగ్గఉందని సూచించినారు.

త్రిజటమగ డావలకువచ్చి "ఏంవిటి. లేపమంటారాయేం? నిదరోతూంది" అన్నాడు. రామవర్మ నవ్వుతూ "అడిగానోయి! అంతే" అన్నాడు. ప్రమద "బాబయగారూ అస్తమానం మొద్దునిద్దరేనండి దానికి. బొమ్మలురాయదు. పుస్తకం చదవదు. మాటాడితే నిదర" అంది. మదాలస ప్రమద

నెంచి "నీకు పుస్తకం చదవడం చేతనవునా?" అంది. ప్రమద "నీకు బొమ్మలురాయడం చేత నవునా?" అంది. రామవర్మ నవ్వుతూ "త్రిజట కేల్లాయైనా మీకున్నంత చుఱుకూ తెలివి తేటలూ లేవర్రా" అన్నాడు. ఆమాట మామగారన్నప్పుడు త్రిజట మగడు పరధ్యానంగా కొంచెం దూరా న్నుండి పోయేడు. లేకుంటే జవాబు చెప్పేవాడే.

కాస్సేపటికి త్రిజట వళ్ళువిఱుచుకుంటూ కళ్ళు నులుపుకుంటూ లేచి, తనదగ్గఱ మగనికోసం చూచి, లేకపోవడంతోటే నడవలోకి వచ్చింది. రామవర్మ భార్య అప్పటి కావనీ యీవనీ చక్కబెట్టుకొని వంటింట్లోంచి నడవలోకి వస్తూ "ఎవరికి చుఱుకు లేదు. తెలివి తేటలు లేవంటున్నారు" అంది గట్టిగా. అప్పటికి అల్లుళ్లు ముగ్గురు అక్కడేవున్నారు, దగ్గ ఱగా "అప్పుడే విన్నావు? నీకే" నన్నాడు రామ వర్మ. ప్రమద అంది "కాదే నీకాదే చిన్నక్క" కంది. "అదిగో చిన్నక్కంటేచూడు. త్రిజటక్కను." అన్నాడు త్రిజట మగడు మఱదల్ని. తనపేరు మగ డుచ్చరించేడని సంత నవ్వుకుంది త్రిజట, పెళ్ళంపేరు పైకన్నాడని తక్కినవాళ్ళంతా మఱింత గందర గోళంగా నవ్వుకున్నారు.

త్రిజట అప్పు డందర్నీ ఊరుకోమని, అంది "నాకో కలొచ్చింది వింటారా?" అని. "ఓస్ కలేనా?" అని మొదట మదాలస అంది కాని తుదకంతా "ఏది చెప్పు వింటాం ఆయినాగానీ" అన్నారు.

"నాకు ఱెక్కలొచ్చాయి, నే నాకాశంలో వున్నానట" అంది త్రిజట. అంటే ప్రమద "ఆకా శంలో వుంటే మేఘాలుచుట్టేసుకోలే" అంది. త్రిజట "చుట్టేసుకోకేం? చుట్టేసుకొని చుట్టేసుకొని చుట్టే సుకోవడంలో వూఱకే ఊమాఱిపోవడం మొదలె ట్టాయి ఓమాటు సింహంలాగు ఓమాటు లేడిలాగు ఓమాటు మనిషిలాగు ఓమాటు మానులాగు." అంది. "అయితే మాట్లాడేవు మేఘంతో?" అంది మదాలస. త్రిజట "మాట్లాడకేం? మహాచక్కా మాట్లాడాను. ఏవూరెదతావు అని అడిగింది మేఘం నన్ను. అడిగితే దాని చెవిలో చెప్పాలనుకుని ముందుకు వంగేసరికి చెవిలాగున్నదల్లా కన్నై పోయింది. కంటికి చూపి ద్దాము నేవెళ్ళేవూరని యనుకొనేసరికి కన్నులాగున్న దల్లా నోరై పోయింది. నోరల్లా ముక్కై పోయింది. కొంతసేపటికంతా తలలా జుట్టులాగై పోయింది. మఱి కొంతసేపటికి తలాలేదు గిలాలేదు అంతాగిలాబా చేసిన గోడలా గడ్డంగా నిలిచి పోయింది. ఇకదేనికి చెప్పనా అని యూరుకున్నాను." అని చెప్పింది. "అలాగైతే ఱెక్కలున్నాగానీ నీకడ్డేదో ఒకాటి కలిగిందన్నమాటే" అంది తల్లి. తండ్రి అన్నాడు "అయితే ఱెక్క లాడించుకుంటూ పోతూంటే మేఘం పటాపంచలు గాలేదే?" అని. దానికి జవాబు త్రిజట ఏమి చెబుతుందా అని మదాలస మగడు ప్రమద మగడు పరకాయించి చూస్తున్నారు త్రిజ టను. "తెలివైనవాళ్లెవరన్నావుంటే బాబయ్యగారి ప్రశ్నకు జవాబు చెబుతారు?" అంది త్రిజట. ఎవరి మట్టుకు వారంతా ఊఱకున్నారు. "నిజమే బాబయ్య గారడిగిన సంగతి గొప్పసంగతే. ఱెక్కలాడుతూ వుంటే మేఘం పటాపంచలు గాకుండా గోడల్లే అడ్డుంటుందా?" అని అనుకున్నారు.

"ఓయి మీయింట బటారంగాను. నేచెప్పేది కలన్నమాట మఱచిపోయినావర్రా" అని విఱగబడి నవ్వింది త్రిజట. "ఉత్త తెలివి తక్కువ వాళ్లు మీరంతా" అంది కూడాను.

దానిమీద త్రిజటమగ డుడుకొక్కన్నట్టై "నీ తెలి వికి నీవే సంతోషించాలి గోడల్లే మేఘమడ్డుండిపోతే ఏలా లేచి వచ్చావిల్లా నీవిప్పుడు?" అని అడిగేడు. త్రిజట అంది "నా ఱెక్కల విసురుకు పోలేదుగాని మేఘం దానంతటది వానకురిసి మాయమైంది" అని. "వాన?" అన్నాడు మగఁడు. "కల్లో వానంటే మెలుగమీద పోసే చెమటన్నమాట" అంది త్రిజట. "ఓసి ప్రియురాలా! మేలుకుండే సేవచేయించు కున్నావు నా చేత? ఇప్పుడొప్పుకొన్నాను తెలివైన దానివని" అన్నాడు త్రిజట మగఁడు.

మగడొప్పుకొంటే అంతా ఒప్పుకొన్నట్టే.

# 'ఆత్మకథనము'

ఒకుండి వేంకటశాస్త్రిగారు

'ఓం' అని నాకథ మొదలుపెట్టుటకుముందు, ప్రపంచములో నే ననేకుల యధీనమునందుండి వారికి సేవచేయుచు నేయున్నానని చెప్ప నవసరము లేదు. కాని నా యజమానులకే నా జన్మకథ తెలిసియుండ దని నే ననుకొందును. నేను క్రీ. శ. 1873 సం వత్సరమునకు పూర్వమే జనించితిని. నా తండ్రిని సి. శేఫాల్స్ ల్సందురు. ఆతఁడు మిక్‌వేన్‌కీ కుటుంబమునకు జెందినవాఁడు. నన్ను కన్నందులకు నా తండ్రిని జనులెల్లరు నభినందించిరి. నా తండ్రి నా జాతకము వ్రాయించి జాగ్రత పెట్టనందున నే నే తేదీని జన్మించితినో సరిగఁ జెప్పఁజాలను. నా తండ్రి మిగుల కఠినహృదయుఁడు. ఏలయన? ఏ తండ్రియు తన యాత్మజను నిష్కారుణముగ నోరున కమ్మివేయఁడు. బహుశః అటుల నన్ను న్యాని కమ్మివేయుటకుఁ గారణ మతని దారిద్ర్యమేయైయుండవచ్చును. నా తండ్రి హృదయమునఁగల పుత్త్రీ వాత్సల్యరస మప్పటి దారిద్ర్యశీతర్తువునఁ జేసి ఘనీభవించియుండనోపు. అట్టి సందర్భమున నే నేమియు నోరెత్త వలనుపడదయ్యె.

నా తండ్రి నన్నుఁ దనయొద్ద కొంచెముకాలమైన నుంచుకొని పోషింపఁడయ్యెను. ఎట్లో "రెమింగ్టన్ అండు సన్సు కంపెనీ" వారికి నేను జన్మించిన వార్త తెలిసెను. నన్నుఁ బెంచి పెద్దగఁ జేసికొనఁజాలని నా తండ్రి యా కంపెనీవారికి నన్నమ్మివైచెను. ఆ కంపెనీవారన్ననో నన్నుఁ దమ కన్నపుత్త్రికవలె ప్రేమమెయిఁ బెంచి పెద్దఁజేసిరి. ఆ కంపెనీవా రమెరికాలో న్యూయార్కు నగరమునఁ దుపాకులను దయారుచేయు కర్మాగారమున కధీశ్వరులు. వారు నా రూపమునుబోలిన రూపముగల యంత్రముల సృజించిరి. అంతట వారు నాకుఁ దమ ప్రసిద్ధకుటుంబముపేర 'రిమింగ్టన్ ముద్రాక్షర లేఖిని' అను నామకరణ మొనర్చిరి. నా తండ్రి పేరుకంటె నీపేరే సరిగనున్నది. చక్కనిపేరనునది శ్రీ కప్పటికప్పుడు లభించిన నగిపంటిదని యొకకవి చెప్పెను.

నా పెంపుడు తండ్రి నాకు విశ్వాసుని వీను మిగిలిన పేరు రావలెనని కోరెను. ఆతఁడు బహు వ్యాఖ్యతుఁడు. అగుట నన్నతఁడు ప్రపంచములోని మహామహులతోఁ బరిచయముగలదానినిగాఁ జేయుటలో శ్రద్ధవహింపఁడయ్యె. అందుచే నన్నుఁ బ్రచారము నిమిత్తమై న్యూయార్కు నగల వైకాఫ్‌నీ మాన్సు బెనిడిక్టు అను కంపెనీవారి యధీనముజేసెను. ఈ కంపెనీవారు విరివిగ నన్ను ప్రపంచములో నన్ని స్థలములకు పంపి ప్రపంచమంతటితో పరిచయముగలదానినిగాఁ జేసిరి. నా యదృష్టమో, దురదృష్టమో చెప్పఁజాలను గాని నా పెంపుడు తండ్రిని కూడ విడువవలసినదాననైతిని. ప్రస్తుతపు రిమింగ్టన్ కంపెనీవా రిదివరలో ఇ. రిమింగ్టన్ అండు సన్సు వారివద్దనుండి నన్ను కొనిరి. ఆనాటి నన్ను నూర్లసంఖ్యముగ సృజించిరి. ఈ రిమింగ్టన్ కంపెనీవారు నన్ను ప్రేమతోఁ జూచుచున్నారు. ఏలయన నా వలన నత్యధికమగు ధనము నందినవారగుట నన్నింత ప్రేమతోఁ జూచుచున్నారు. నే నీ కంపెనీవారికి మిగుల విధేయురాలనైన పుత్త్రికవలెనున్నాను. వీరు నా శరీరనిర్మాణమున నే యనేకములగు మార్పుల నొనర్చిరి. నన్నెన్నివిధముల వారు మార్చుచువచ్చినను నే నేమియు యడ్డు చెప్పఁజాలనైతిని. వం ద్రెండుసారులు నా యాకారమును మార్చివైచిరి. నేను మనుష్యుని సృష్టిలోనిదాననగుట నిన్నివిధముల మార్పు నందవలసివచ్చినది.

మనుష్యుడు చేయు సృష్టిలో మార్పు నిశ్చయము. దైవసృష్టిలో నిన్నిమార్పులుమాత్రము రావు. ఎన్నెన్నిమారులు నే నేయేవిధముల రూపుభేదమునందితినో మీకు తెలిపెదను. నే ననేకములగు మార్పులకు లోనైతిని. కాని వారు చేసిన మార్పులన్నియు నా యభివృద్ధికిని సౌఖ్యమునకే యని చెప్పగలను. మొదట వారు నాకు రిమింగ్టన్ నం. 1 అని పేరిడిరి. అప్పుడు నేను మిగుల భారముగలదానను. నాతండ్రి పెంపకమున నే నంతపుష్టి నందగలిగితిని. అప్పటి నా శరీరనిర్మాణము మిగుల విస్తారముగనుండెను. నే నప్పు డుక్కుతో నిర్మింపఁబడితిని. అప్పుడు జనులకు నన్నుపయోగించుటన బిడ్డలయాటవలెనుండెడిది గాదు. దృఢకాయులగువారుమాత్రము అక్షరములను గట్టిగా నొక్కిననేగాని (hard to touch) వ్రాయుదానను గాను. ఒకేవిధమైన అక్షరములు (Block letters) వ్రాయగల్గెడిదానను.

రెండవసారి నాకు రిమింగ్టన్ నం. 2 అని పేరిడిరి. ఇప్పటి యాకృతిలో మంచిమార్పు కల్గించిరి. ఇంగ్లీషు అక్షరములలో పెద్దఅక్షరములు (Capital) చిన్న అక్షరములు (small) వ్రాయునట్లు మార్పు చేసిరి. ఇప్పుడు 'షిఫ్టుకీ' అను నొక నూతనాంగమును కల్పించిరి. దీనివలన వలసినప్పుడు పెద్దఅక్షరములు, చిన్నఅక్షరములు వ్రాయుటకు వీలుకల్గింపఁబడినది. ఇప్పుడు తేలికగ చేయఁబడితిని. వ్రేలితాకునకు మిగుల మెఱుకుగలదాననైతిని. చాలవరకిప్పుడు నాబరువు తగ్గింపఁబడినది. అందుచే వారు నాకు మేలుచేయుచుండిరని తలచితిని.

మూడవసారి నాకు రిమింగ్టన్ నం. 3 అని పేరిడిరి. ఇప్పుడు నన్ను న్యాయవాదులకును న్యాయస్థానోద్యోగులకు ననుకూలించునట్లు సూక్ష్మరూపము గలదానినిగా మార్చిరి. అక్కౌంట్లును బేలెన్సుషీటులు తయారుచేయుట కనుకూలించునటులకూడ మార్చిరి.

నాలవసారి రిమింగ్టన్ నం. 4 అని పేరిడిరి. ఇప్పుడు పెద్దఅక్షరములు మాత్రమే వ్రాయుట కనువు కల్గింపఁబడినది.

ఆయిదవసారి నా యవయవనిర్మాణములో మార్పు కల్గింపఁబడినది. ఇప్పుడు రిమింగ్టన్ నం. 5 అను పేరుపొందితిని. ఈసారి యింగ్లీషు వర్తక ప్రపంచములో మిగుల చలామణిగలదాననైతిని. ఇప్పుడు, వెనుకటివలె 76 అక్షరములుమాత్రమే వ్రాయుదానను గాక 84 అక్షరములు వ్రాయుదాననగునట్లు చేయఁబడితిని.

ఆఱవసారియు యేడవసారియు చేయబడిన రూపములలో నన్యోన్యరూపసాదృశ్యము గలుగునట్లు మార్పులు కల్గింపఁబడెను. ఇప్పుడు 'రిబ్బన్' ధరించిన స్త్రీగామారి, యత్యధికమైన మెఱుకును పొందితిని. ఈసారి రిబ్బన్ యీవైపున నొకసారి యావైపున నొకసారి చుట్టుకొనునట్లు మార్పునందితిని. ఇప్పుడు నా యాకారమును నడకయు మిగుల మనోజ్ఞములయ్యెను. కాని నేను వ్రాయునది వ్రాయువేళ కనఁబడదయ్యెను.

ఏడవసారియు, తొమ్మిదవసారియు మార్పులనొంది బారిస్టర్లకుకూడ నుపయోగపడునట్లు చేయఁబడితిని. ఈ రెండుసారులును మిగుల తేలికగఁ జేయఁబడితిని. రెండుసారులు గల్గిన మార్పు కూర్పులో 92 అక్షరములు వ్రాయుదాననైతిని. ఇప్పటి నుండి నేను వ్రాయునది వ్రాయువారలకు కనుపడునట్లు చేయఁబడితిని.

క్రమముగా వృద్ధినందిన కొలది క్రమసంఖ్యలు మారుచు చివరకు 'పండ్రెండు' సంఖ్యగలదాననైతిని. ఈ పండ్రెండవ సంఖ్యగల యీ నా యాకృతిలో, లోపలి యవయవనిర్మాణము వెలుపలికి కనపడకుండునటుల నుక్కరేకుతో మూయబడియున్నాను. ఇంతదనుక, ననాగరకచిహ్నమగు నా నగ్నతనువీడి నాగరకచిహ్నమగు నుచితవేషమున సంస్కృతినందితిని. ఈసారి యాకృతిలో ధ్వనియగుట తగ్గినది. 'అక్షరములతాకుట' తేలికయైనది. 'నడక' మిగుల లాలిత్యమునందినది. లౌకికవ్యవహారమంతయు నా

వలన నిపుడు జరుగుచున్నది. అబలాజనముకూడ అబలగామారిన నన్నుపయోగించి వ్రాయుటకు మిగుల నుత్సహింతురు. పియానాపై తమ వ్రేళ్లనుంచి వినోదముగ వాయించినట్లే అక్షరములపై వారి వ్రేళ్లనుంచి వినోదముగ వ్రాయుదురు. వారి యత్యలఘుస్పర్శకే వ్రాయుదానవగు నన్నుపయోగించుటలో నేను చేయు నల్పధ్వని సహింతురు. పాశ్చాత్యదేశములలో నబలాజనమే యత్యధికముగ వ్రాయుటకు నన్నుపయోగించుచున్నారు. ఇప్పటికి నేను ప్రపంచమున తలపైకెత్తుకొని యిక నా కష్టములు తీరినవని చెప్ప సాహసించుచున్నాను. ఇప్పటికి నా జీవితములో స్థిరత గల్గినది. నన్ను తేలిగ నుపయోగింపగల స్త్రీలు పాశ్చాత్యదేశములలో అత్యధికముగ ధనము సంపాదించుచు సౌఖ్యతరజీవితముల గడుప గల్గుచున్నారు. నేను వారికిం జేయు సేవకు ప్రతిఫలము కోరుటలేదు. నన్నుపయోగించు జనులు నన్నప్పు డప్పుడు శుభ్రపఱచి ఘర్షణములేక లీలగా నడుచుటకు నాకు తైలాభ్యంజనము చేయించవలసి యుందురు. కొంద ఱిట్టిపనులం జేయరు. అయినను నేను సణగక గొణగక నాపనినిం జేయుచునే యుందును.

నా శరీరములో నైదు ముఖ్యమగు యంత్రభాగములు గలవు. 1. కీబోర్డు. 2. కేరేజి. 3. ఎస్కేప్ మెంటు. 4. రిబన్ మూవ్ మెంటు. 5. మెయిన్ స్ప్రింగు యంత్రము. ఇంతటితో నా కథ ముగించుచున్నాను. నేను విశ్వవ్యాప్తిగలదానను. నన్ను నీవద్దనుంచుకొంచనేని పురుషుడైనచో నేను నీకు చిల్లరకర్చులకు కొంతధనమును, నీ భార్య కర్చులకై కొంతధనమును సంపాదించియీయ సమర్థనని మనవి.

ఆంధ్రమహారాజా లోకరి సంకల్పఫలముగా 'ఆంధ్రముద్రాక్షరలేఖిని' మన 'యాంధ్రభూమి' నవతరింపనున్నది. తదీ యాత్మకథనావిశేషము లాంధ్రాపని త్వరలో తెలుపంగగలదు.

('రెమింగ్టన్'ను యాత్మకథనము 'ఇండియన్ కామర్సు' అను పత్రికలోని వ్యాసమున కాంధ్రీకరణము.)

—:o:—

## సోదరీ!

పోలుకొండ భద్రయ్యగారు

భయములేదమ్మసోదరీ! భయములేదు
ఊరడిలుమమ్మసోదరీ యూరడిలుము!!
జేలతనమునజింతింప మేలుగాదు
వీరభారతిగర్భాన మీరిబుట్టి
పిరికితనమునువహియింప సరణిగాదు
పౌరుషజ్ఞానకీర్తుల బడయుమమ్మ!!
వరలుప్రాక్తనకాలపు వైభవమ్మ
నొక్కపరినాత్మజింతించి యోర్చుమమ్మ!
పరగపల్నాటికృష్ణుడన్ బేరుగన్న
మంత్రిబ్రహ్మనాయనివంటి మనుజవరుని
ముప్పుదిప్పలు బెట్టిన "ముగ్ధనాగ";
దేవగిరిరాజ ప్రభృతులదీటడంచి
శత్రుగజతతిపాలిపంచాస్యమనగ
కీర్తిచంద్రికల్ దిశలెల్ల గీలుకొల్పి
చెన్నుమీరిన "రుద్రమ" సన్నుతాంగి;
హీనుడగు తనపితకించుకేని వెరక
తన్ను మనసారప్రేమించి దనరినట్టి
ప్రాజ్ఞుడౌ నవపృథ్వీ రాజప్రతిమ గళము
నందు పూమాలనుంచిన సుందరాంగి
"రాణిసంయుక్త" గుణయుతరాజకాంత;
వీరె యననేల పెక్కురువీరకాంత
లసదృశంబగు తమ కోర్కెలందలేదె!
అల్లదే సుప్రభాతము! ఆంధ్రమాత
చరణసరసిజములజేరి సంతసిలుము!!

# శారదలేఖ

సౌభాగ్యవతి కల్పలతకు,

నెచ్చెలీ! కడచిన డిసెంబరునెల 23 తేదీని మహాత్ముడు గుంటూరు వచ్చినప్పుడు నేను గుంటూరు వెళ్లుదుననియు మహాత్ముని దర్శింతుననియు కలలో నైన ననుకొనలేదు. అనుకొనకుండ నప్రయత్నముగ నత్యవసరముగ నొకానొక పనిమీద మహాత్ముడు తేపు గుంటూరు విచ్చేయుననగ నాటిసాయంత్రము గుంటూరు వెళ్లుట తటస్థించినది. తమ యందు భక్తి గౌరవములు గలవారి నేదియో వ్యాజమున తమకడకు రావించి దర్శన మొసంగు శక్తి మహాత్ములకు గలదేమో!

ఆనాటి రాత్రి గర్తపురలక్ష్మి ప్రశాంతముగ నిద్రింపలేదు. తన గృహప్రవేశము సేయనున్న వ్యక్తి, యొకలోకైకపూజ్యుడు! తల్లి నెట్టులలంకరింతమనియు, మహాత్మునెట్లు సత్కరింతమనియు, నాతురతతో కార్యవ్యగ్రులై తిరుగుచున్నవారు తనయనుంగుబిడ్డలు! ఇక పురలక్ష్మి కెట్లు నెమ్మదిగ నిద్రబట్టును?

మే మొక్కరమే గాదు ఆ గుంటూరునందు గల అరువదివేల జను లానాడు తెల్లవారుజామున మూడు గంటలకే నిద్రనుండి లేచిరి. కాల్యములేమి తీర్చుకొనిరో గృహకృత్యము లేమి చేసిరో, గృహంబు లెవరికొప్పగించిరో, ఏమో! శ్రీకృష్ణుని మురళీగానంబునకు మోహితులై యిల్లు వాకిండ్లు వీడి పతిసుతాదులను వదిలి పరుగులెత్తుకొనిపోయిన గోపాంగనలవలె పురవాసు లెల్లరు మహాత్ముని దర్శనమున కొక్కటే పరుగు. ఆనాడు కృష్ణునిచూడ నేగినవారు స్త్రీలును, అందు ముఖ్యముగా గొల్లపడంతులును మాత్రమే కాని నేడు మహాత్ముని గన నేగినవారిలో స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు, ధనికులు, దరిద్రులు, నాగరికులు, అనాగరికులు, శ్రోత్రియులు, సంస్కారప్రియులు, అవర్ణులు, సవర్ణులు, ఎల్లరు నుండిరి.

అయశ్శకటములు, అశ్వ శకటములు, ద్విచక్రశకటములు, వృషభ శకటములు, ఓహో ఒక వాహనమా! ఆనాడు బేడబాడుగ బండి పావలా పలికినది. పావలాబండి యర్థ పలికినది. అయిన నేమి? డబ్బెవరికి లెక్క? మహాత్ముని దర్శన మబ్బిన చాలును! ఇక కాలినడకను వచ్చువారి సంఖ్యకు గణనమే లేదు. ఆ పెద్దరోడ్డు కిరుప్రక్కలనున్న కాలిబాటలకు తెంపులేదు. ఏరాత్రినుండియో జనవాహిని యా కాలిబాటలమీదుగా వర్షాకాలపు వెల్లువవలె స్వరాజ్య మైదానమునకు జొచ్చుచునే యున్నది.

ఒక వంక వడవడ వడకించు చలి, యొక వంక జిల్లుమను మంచు, నొకవంక హోరుమను నీదరగాలి, యా వేకువ మనుజు లుల్లా సముగా దిరుగు సమయ మెంతమాత్రము కాదు. దుప్పటిపై దుప్పటి ముసుగుపెట్టు కొని గృహాంతర్భాగంబున బరుండి జాము ప్రొద్దెక్కినను జనులు లేవబద్ధకించెడి సమయ మది. అట్టియా సమయమున ప్రజలావిధ ముగా పరువులు దీయుచు విచ్చేయుట కా మహాత్మునియందు ప్రజల కెంతటి భక్తి విశ్వాసములు గలవో ప్రేమగౌరవములు గలవో ప్రజాహృదయము నావిధముగా కొల్ల గొనుట కా మహాత్మునియం దెట్టి మహ చ్ఛక్తిగలదో!

అప్పు డైదుగంట లైనది. అప్పటికే జనులత్యధికముగా సభాప్రదేశము చేరుకొని యుండిరి. స్త్రీలకు ప్రత్యేకింపబడిన ప్రదేశము మాత్ర మింకను నిండుకొనలేదు. కాన మాకు మంచిస్థలమే లభించెను. తెల్లవారు చున్న కొలది జనులు వెల్లువ వచ్చినట్లు వచ్చి యెల్లప్రదేశము నింపివేసిరి. నియమవ్రతుం డగు మహాత్ముడు నిర్ణీత సమయమునకు వచ్చుననియే జను లావిధముగా వచ్చి, చిత్తము మహాత్ముని మీదను, నేత్రము లాయన వచ్చెడి బాట మీదను, వీనులాయన యెక్కివచ్చెడి మోటారు బండి ధ్వనిమీదను బెట్టుకొని తదేకనిష్ఠతో నిరీక్షించుచు గూర్చుండిరి. నిర్ణీతసమయమునకు సభో పక్రమణము సేయజాలని యాంధ్రుల యల సభావ మాంధ్రదేశపు గాలి సోకుటచే మహాత్మునకు గూడ కొద్దిగా నబ్బెనో యేమో గాని మహాత్ముడు నిర్ణీతసమయమునకు రాలేదు. ఏదో కారు ధ్వని వినిపించుటయు సముద్రమునుండి వెలువడెడి తరంగధ్వని వోలె జనసమూహమునుండి యొక గొప్ప యుత్సాహధ్వని యుద్భవించుటయు, నందఱు మోరలెత్తి చూచుటయు, మహాత్ముని కారు కాదనగనే చప్పున నుపశమిల్లుటయు, రెండు మూడు మారు లాయెను. ఇంతలో మహాత్ముని సత్కార సభలో తానుగూడ పాల్గొన దలచియా యున్నటుల సూర్యభగవాను డుదయించి చలిచే, మంచుచే, బాధబడు చున్న జనులకు తన లేయెండప్రసారముచే చలినిబాపి, మంచు విరియింపజేసి సుఖ మొదవ జేసెను.

ఆహ్వాన సంఘమువారి యేర్పాటులు ప్రశస్తముగనుండెను. స్త్రీపురుషులకు ప్రత్యేక ప్రదేశము లేర్పాటుచేసిరి. ఆజనుల మధ్య నుండి మోటారుబండ్లు నిరాతంకముగా వచ్చి పోవుటకు బాటలువేసిరి. మహాత్మ దర్శన మెల్లరకు లెస్సగా లభించుటకై నట్ట నడుమ నున్నతమైన వేదిక నిర్మించిరి. అది పొలము కాపరి, యొడిసెలతో పిట్టల తోలుటకై నిర్మించుకొనిన మంచెవలె నుండెను. దానిపై నెక్కుటకు చెక్కలతో సోపానములు నిర్మించిరి. ఆమంచెపై మహాత్ముడు కూర్చుండుటకు పరుపులు బాలీసులు అమర్చిరి. మరల జనసమూహములో నొక యుత్సాహికధ్వని వెలువడెను, "వచ్చె, వచ్చె, అదిగో, అదే కా"రను కేకలు మిన్ను ముట్టెను. అనుకొనుచుండగనే మహాత్ము డధిరోహించిన కారు, మందగమనముతో

నేతెంచి వేదికకడ నిలిచెను. ఏ మహాత్ముని దివ్యసందర్శనమునకై యీ యసంఖ్యజన సముదాయము శీతవాతాతపంబుల లెక్క సేయక కాలహరణంబును గమనింపక తదేక దృష్టితో నిరీక్షించుచున్నదో, ఏ మహాత్ముడు సర్వప్రపంచైకగురుడని కీర్తింగాంచెనో, ఏ మహాత్ముని మహత్తరకృషిపై త్రింశత్కోటిభారతీయు లాశలు పెట్టుకొనియున్నారో, ఏ మహాత్ముడు దరిద్రనారాయణసేవకుడని విఖ్యాతబిరుదుగొనెనో, ఏ మహాత్ముడు దీనహరిజనావనదీక్షావ్రతుడై యావద్భారతదేశమును గ్రుమ్మరుచున్నాడో, ఆ మోహనదాస్ కరమ్‌చంద్ గాంధీ మహాత్ముడు కారు దిగి వేదికపై నధిరోహించి మెల్లరి కొక్కమారు నేత్రపర్వముగ దర్శన మొసగెను.

మహాత్ముని దర్శనమున కాయత్తులై వచ్చుటకును, లేచి యుండుటకును నెంతయో కాలము పట్టెనుగాని యాయన వచ్చిన తరువాత జరిగిన కార్యక్రమము, కొలది నిముసములలో నయ్యెను. వెంటనే మహాత్మునకు ఖద్దరుహారములు వేయబడెను. స్వాగతపత్రములు సమర్పింపబడెను. బహుమానము లొసంగబడెను. తదుపరి మహాత్ముడు హిందీలో నుపన్యాసమొసంగ నారంభించెను. శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగా రనువదించిరి. ఒడిసెల విసరుటకై కూర్చుండిన పొలముకాపరివలె మంచెమీద కూర్చుండిన మహాత్ముడు, తొలుదొల్త విసరిన ఒడిసెల వ్రేటు న్యాయవాదుల మెదపై ఠకీమని తగిలెను. వారు, మితముగా పొదుపుగా 145 రూపాయలు మాత్రమే మహాత్మునకు సమర్పించిరట. పురమునందలి గురునాథదేవాలయమును గౌరీవిశ్వేశ్వరాలయముగా మార్చిన కారణము చెప్పెను. సవర్ణులు సమ్మతించినచో మూడునెలల కది హరిజనులకు తెఱువబడుననెను. సవర్ణులు అవర్ణులయెడ దాక్షిణ్యముగా వర్తింపవలయు ననెను. తదుపరి తనకు సమర్పింపబడిన కానుకలు అభినందన పత్రములు వేలము వేయ దొరకొనెను. చట్టములో సమర్చిన అభినందనపత్రము, ఆశ్రమము, రాటము మున్నగు వినోదశిల్పములు, బంగారు తక్లీ, వగైరాలు వేలము వేయబడెను. తరువాత సభలో కానుకలు వసూలు చేయబడెను. బంగారు నగ లీయుడని స్త్రీలను పలుమారు ఎచ్చరించిరి. గాని వారి యెచ్చరికను గమనించినవారు లెక్కకొక రిద్దఱు మాత్రమే యుండిరి. అంతట సభ, సమాప్తమయ్యెను. మహాత్ముడు వెడలుచుండగా చూడవలయునను నాతురతతో స్త్రీలు ముందుకు త్రోసికొనిరి. ముందువరుసలోనున్న మే మా త్రోపిడికి మిక్కలి నలిగి పోతిమి. నేనెత్తుకొనియుండిన పదినెలల బిడ్డడగు మా మేనల్లు డా యొత్తిడి కాగజాలక కేరుమని ఆర్చి యేడువసాగెను. ఇంతలో మహాత్ము డెక్కిన అయశ్శకటము వెడలిపోయెను. గుంపు, త్రోసికొనుట మాని నిలబడెను. స్త్రీల త్రోపిడిచే యుక్కిరిబిక్కిరి యగుచున్న మేము తెప్పిరిల్లి యింటికి బోవుట కుద్యుక్తుల మైతిమి.

కన్నులార మహాత్ముని దర్శించితిని. చెవులార నాయన వాక్కువింటిని. సంతోషమే

కాని యొక్క కోరికమాత్రము తీరలేదుగదా యని మనస్సులో కొంచెము కించగానున్నది. ఏమన ఆంగ్లవనితయయ్యు మహాత్ముని, తల్లివలె పోషించుచు, బిడ్డవలె ప్రేమజూపుచు, అనవరతము మహాత్ముని సేవించుచున్న మీరాబాయియను నామాంతరముగల స్లేడు కన్యను చూడవలయునని నాకు మహాభిలాష యుండెను. కాని ఆమె కనుపించలేదు. ఆమెకీ మహాసభలతో సంబంధమే లేదట. మహాత్మునకు విడియుచోటునకు ముందుగా బోవుటయు, ఆయనకు వలయు సౌకర్యములన్నియు జాగరూకతతో సమర్చుటయు, నిదియే యామె పనియట, ఆహా! మీరాబాయి భాగ్యము! దేశీయులగు బంధుమిత్రాదులలో నేరికిని బడయరాని మహాత్ముని సేవాభాగ్యము, మీరా బాయి లభింప జేసికొనెను గదా! నిజముగా మీరధన్య! మఱియామె దర్శనభాగ్యమొదవని నేను?......

ఆంగ్లదొరతనమువారధికారకీత్యా మహాత్మునకు గల్గించుచున్న కారాగృహశిక్షాది నిరంతరక్లేశములకు పరిహారముగా నాంగ్లదేశ మర్పించుకొనిన వెలలేని కానుకేమో స్లేడుకన్య!

"నేనుగూడ గుంటూరు వచ్చి మహాత్ముని జూడవలయు ననుకొంటి ననియు, మాచిన్నపిల్లవాని కాకస్మికముగా జ్వరము తగిలినందున వచ్చుటకు వీలుకాలేదనియు, వ్రాసితివే! హరిజనోద్ధరణోద్యమ మారంభించినప్పటినుండియు మహాత్ముడనిన నీకు కోపముగా!!

ఇట్లు

భావపురి మిత్రురాలు

1 ఫిబ్రవరి 1934 శారద.

## గుల్ ఖందు.

హేమంతఋతువులో తంగేడుపూలు విస్తారముగా దొరకును. ఈ పూలరేకులు బాగ నల్పుకొని వుంచేది. మంచి గులాబి పుష్పములు, లేత రోజాపూలు విడిరేకులు తీసుకుని, ఒకహార్లిక్స్ సీసాలో, ఒక వర్సతంగేడు రేకులు, వేసి, మంచి కలకండ 5 పలములు పొడిచేసి, ఆ రేకులపైన ఒక వర్స వేసేది. ఒక పలం ద్రాక్ష బాగ నీటిలో వేసి కడిగి, గుడ్డవేసి తుడిచి, ఆ పండ్లు 4 లేక 5 ఒక వర్స, ఇట్లే రోజా తంగేడు రేకులు పండ్లు, కలకండ, పొరలు, పొరలుగా వేసి, మంచితేనె రెండు పలములు, అందులో విడిచి, రాత్రిపూట, మంచులో పెట్టేది. పగలు, ఎండలో మూతవేసి పెట్టేది. ఇట్లు పెడుతూవుండగా, బాగ మగ్గకుంది మగ్గుతూవుంటె, సీసాభర్తి అయ్యేవరకు వేస్తువుండేది, అనగా మార్గశిర, పుష్య మాఘంవరకు సరిపోవును. తర్వాత ఎత్తిపెట్టుకొని, కావాల్సినప్పుడు కొద్దిగా భుజించిన, చాల రుచి, ఇది చాల రోజులుండును. కంకిపాటి రుక్మిణమ్మ.

## ఉసిరికాయ మురబ్బా.

ఒక పడి ఉసిరికాయలు పెద్దవిగా ఏరుకొని వీటిని సూదితో బాగుగా పొడుపవలయును. అటుల పొడిచిన కాయలను ఒక రాత్రియంతయు సున్నపు నీటిలో నానబెట్టిన తర్వాత ఒక గిన్నెడు నీళ్లలో చింతాకువేసి వాటిని వుడికించవలయును. కాయలు మెత్తపడగానె గిన్నెను పొయ్యినుండి దింపి చింతాకు పోవునటుల వాటిని వడగట్టవలెను. అటుపిమ్మట ఒకటిన్నరపడి చక్కెర పాకముచేసి, పైనచెప్పిన కాయలను పాకములోవేసి కొంచెముగా వుడికించవలయును. చల్లారిన తర్వాత సీసాలో కాయలను నిలువబెట్టి రెండు మూడు మాసముల తర్వాత తినినచో మిక్కిలి రుచిగా నుండును. దీనిని వేసవికాలమందు వాడుకొనినయెడల ఒంటికి చాలా మంచిది.

బి. సరోజినిబాయి.



మిస్. పి. కౌశల్య

కాలికట్ గవర్నమెంటు హాస్పిటలునందు నూతనముగా నుద్యోగింపఁబడిన గుమాస్తా. స్త్రీలను గుమాస్తాలనుగా నియమించుట కిదియే మొదట.

—ఛా॥ చి॥ ఆర్. వెంకోబారావు, శ్రీరంగం.

# సభలు

## భారత జాతీయ సాంఘిక మహాసభ

ఇండియన్ నేషనల్ సోషలు కాన్ఫరెన్సు అను పేరట ఈసభ మొట్టమొదట 1866 లో మదరాసు లోనే ప్రారంభమై పిమ్మట నేడాదికొక్కొక్క పర్యాయముచొప్పున వివిధ నగరములలో కొంత కాలమువరకు జరిగి, ఏకారణముచేతనో కాని కొంత కాలమునుండి నిలచిపోయినది. డిశంబరు నెల 29-వ తేదిని ఉదయం 11 గంటలకు పచ్చయప్ప కళాశాలలో జి. కె. దేవధారుగారి అధ్యక్షతక్రింద తిరిగి యిది సమావేశమైనది. ఈసభ ఆహ్వాన సంఘాధ్యక్షుడు సి. వి. క్రిష్ణస్వామి అయ్యరుగారు చెప్పినట్లు ఇది ఇన్నాళ్ళనుండియూ జరుగకుండుటకుగల కారణము లనుగూర్చి ఇప్పుడు విచారించిన ప్రయోజనము లేదు. ఈసభకు శ్రీయుతులు మదరాసు బిషప్పు (క్రైస్తవమతాధికారి) వేపారామేశం సి. వై. చింతామణి, టి. ఆర్. వెంకట్రామశాస్త్రి, కొంచెర్ల రామచంద్రరావు, పి. వరదరాజులునాయుడు, వి. వెంకటసుబ్బయ్య బషీరహమ్మదుసయ్యదు, ఒ. కందసామి చెట్టి, శ్రీమతి దాదాభాయి, అలమేలుమంగతాయారమ్మాళ్ గార్లు మొదలగు ప్రతినిధులు పలువురు విచ్చేసిరి.

సర్. శంకరనాయరుగారు అధ్యక్షుని యెన్నికకు ముందు ప్రాతసభలు నిర్వహించిన పనులను వివరించెను. స్త్రీల నున్నతస్థితికి తెచ్చుటకు, జాతిభేదములు తొలగించుటకు, అస్పృశ్యతను నివారించుటకు అది ప్రారంభించెననియు, దాని కృషిఫలితముగ నేడు స్త్రీలు తమ హక్కులకొరకు పోరాడుకొనగల స్థితికిని, బ్రాహ్మణేతరులు బ్రాహ్మణుల ప్రతిభను పడగొట్టి రాజ్యాంగచక్రము నాక్రమించుకొనగల స్థితికిని వచ్చినదని చెప్పిరి. అయినను స్త్రీలకింకను విశాలమగు హక్కులు అనుకూలమగు సంస్కరణములు కావలసియుండుటచేతను దేశములో సాంఘికమత విద్వేషములు పెరుగుచున్న కారణమునను, సనాతనులు అస్పృశ్యతా నివారణమును ప్రతిఘటించుటకును సంఘపురోభివృద్ధిని వెనుకకు నెట్టుటయను నడుము గట్టుకొనుచున్న కారణమునను ఈసభను పునఃప్రతిష్ఠించి ఈ మహాకార్యముల నెరవేర్చవలసిన ఆవశ్యకత కలిగినదని ఆహ్వానసంఘాధ్యక్షులు స్పష్టపరచిరి. హరిజనదేవాలయ ప్రవేశము, వివాహవిచ్ఛేదనా స్వాతంత్ర్యము, స్త్రీ వారసత్వము, వ్యభిచార నిర్మూలనము, మద్యపాన నిషేధము, దీనజనుల కారోగ్యకరములగు నిండ్లు కట్టించుట,, కార్మికుల కెక్కువకూలి, విశ్రామము, విద్య, విహారము మొదలగు సౌకర్యములను కలిగించుట—యీ మొదలగు కార్యములను నిర్వహించుకీసభ పునఃప్రారంభమైనదని వివరించిరి.

అధ్యక్షులు దేవధారుగారి ఉపన్యాసము అఖండ పాండిత్యము, దీర్ఘానుభవము, ప్రపంచపరిశీలనము, నిశితబుద్ధి అభివృద్ధిమార్గములు మొదలగువానితో వెల్లివిరియుచున్నది. ప్రాతసభలఫలితముగ పూర్వాచార విశ్వాసదుర్గములు నేలకూలినవని వారును అంగీకరించిరి. ప్రపంచమంతయు మహానాగరక మార్గమున బడి శరవేగమునవృద్ధిపొందుచున్నదనియు, పాశ్చాత్య విద్యాసంపర్కమువలన మన విద్యాధికులు

కూడ నట్టి నాగరికతతో నలరారుచున్నారనియు, అధునాతన నాగరికతలో కొన్ని లోపములు లేక పోలేదనియు, మన నగరవాసులా నాగరికతయొక్క మేలులతో బాటు కీడులకుకూడ కొంతవశ్యులైనారనియు, ప్రస్తుతకాలస్త్రీయ పరిజ్ఞానాభివృద్ధి ఇట్టి కీడులను నిర్మూలింపఁజాలక పోయినదనియు చెప్పిరి. సాంఘికోద్యమము రాజకీయోద్యమముతో కలసిపని చేయవలెనని వారి అభిప్రాయము. హిందూదేశము పూర్వకాలమునందు మతవిజ్ఞానమునకు పుట్టినిల్లై పాశ్చాత్యదేశముల కమోఘములైన సత్యములను, విశ్వాసములను, నీతులను, భక్తిని గరపినది కనుక పాశ్చాత్యులనుండి అవి నేర్పగల ధర్మములను నేర్చుకొనుట మనహక్కును, నేర్పుట వారివిధియునై యున్నదని తెలిపిరి.

స్త్రీలు ఘోషాపద్ధతిని విడనాడి వోటుహక్కును విస్తరించవలెనని ఆందోళన చేయుచున్నారు. మరియు తమ పురోభివృద్ధికిని హక్కుల సంపాదనమునకును అనేక స్త్రీ సమాజములను దేశమంతట నెలకొల్పినారు. అయితే ప్రజాసేవచేస్తున్నామనే పేరుప్రతిష్ఠలకొరకు కాక నిజమైన ఉత్సాహముతో వారు కార్యరంగమున కుఱుకవలసియున్నది. నిష్ప్రయోజనములైన కొన్ని విధములగు రాజకీయాందోళనములలో వారి ఉత్సాహశౌర్యములను పోటబుచ్చక వయోజనవిద్య, గ్రామపునర్నిర్మాణము మొదలగు వంశములనుగూర్చి యెక్కువశ్రద్ధ చూపవలెనని చెప్పిరి. ఈ సందర్భములో గతనెల 27-వ తేదీని కలకత్తాలో సమావేశమైన అఖిలభారత మహిళాసభవారు వోటుహక్కును విస్తరించవలెనియు, వారసత్వపు హక్కు నొసగవలెననియు, సినీమాలు ఉపన్యాసములుద్వారా దేశమంతటను సంఘసంస్కారాభిమానమును పుట్టించుటకు పనిచేయగల యువత్కాలను పనిచేయు ఉద్యోగస్థుల నేర్పాటుచేయవలెననియు చేసిన తీర్మానముల నెంతయు ప్రశంసించెను.

మనదేశములో 4-5 కోట్ల హరిజనులున్నారనియు, వారిని స్పృశ్యులుగా భావించవలెననియు జపానులోవలె చట్టముచేసి అస్పృశ్యతను నిషేధించవలెననియు చెప్పిరి. పిమ్మట హిందూదేశమందలి 7 లక్షల గ్రామములందలి బాలురకు యువజనులకు వ్యవసాయవిద్యయు గృహపరిశ్రమలును నేర్పి వారి పైబడియున్న రు. 900 కోట్ల రూపాయీల ఋణమును తప్పించు ప్రయత్నములకై గడంగవలసిన అవశ్యకతను గూర్చి చెప్పిరి. భావనగర సంస్థాన మిందు విషయమై పని ప్రారంభించినదనియు తక్కిన సంస్థానములును రాష్ట్రములును దాని ననుకరింపవలెననియు హెచ్చరించిరి. దేశీయుల ఆరోగ్యమును, పారిశుద్ధతను హెచ్చించి, సంతానోత్పత్తిని తగ్గించి, పంచాయతీలు స్థాపించి, సంవత్సరమునకు 100 కోట్ల రూపాయీలను దిగమ్రింగుచున్న మద్యపాన పిశాచమును విడిపించి అనేకవిధముల సేవచేయవలసి యున్నదనియు, దీనినిమిత్తము ప్రజలును ప్రభువులును పరస్పర సహకార బుద్ధితో పనిచేయవలెననియు వక్కాణించిరి.

పిమ్మట ననేక తీర్మానములు సలుపఁబడెను. సాంఘికసేవ యొనరించవలెననియు హరిజనులకు దేవాలయ ప్రవేశాధికార మొసగవలెననియు తీర్మానింపఁబడెను. అఖిలభారత మహిళా సభవారు పార్లమెంటు వారికి తెల్పిన నివేదికలోని ఆశయములతో సంపూర్ణసానుభూతిని చూపుచు, వారి వారసత్వ వాంఛలను బలపరచుచు, లేడీ ఇర్విను కాలేజీవంటి కళాశాలలను రాష్ట్రమున కొక్కటిచొప్పుననైన పెట్టవలెనని ప్రభుత్వమువారిని కోరుచు ఒక దీర్ఘ తీర్మానము ప్యాసు చేయఁబడెను. శారదా చట్టమును దిట్టముగ అమలు పరచవలెననియు, డిపాజిటు పద్ధతి తీసివేయవలెననియు, కన్యావరశుల్కములు వివాహ ఖర్చులు తొలగించవలెననియు, అయుక్త వయో వివాహములు మానిపించవలెననియు, పునర్వివాహము చేసుకొన్న స్త్రీకికూడ పూర్వభర్త ఆస్తిలో వార

సత్వపు హక్కుండవలెననియు, వర్ణాంతర వివాహములనంగీకరించు చట్టము వ్రాయఁబడవలెననియు, సంతాన నిరోధక సంఘములను నెలకొల్పవలెననియు, కొన్ని జాతులవారి కెక్కువ సాంఘిక సౌకర్యములును కొందరికి తక్కువయు నుండరాదనియు, హరిసింగు గౌరుగారు అఖిల భారత శాసనసభలో పెట్టిన వివాహ విచ్ఛేదనపు బిల్లుయొక్క మూలసూత్రమును దేశమెల్ల అంగీకరింపవలెననియు తీర్మానింపఁబడెను పిమ్మట నొక ఉపసంఘము స్థాపించఁబడెను. ఈ ఉపసంఘము పైతీర్మానముల నెల్ల దేశములో చురుకుగా ప్రచారము చేయుచు అమలుపరచుచు, క్రొత్త తీర్మానములను తయారుచేసి వచ్చేసంవత్సరము సమావేశమగు సభవారియెదుట చర్చకు పెట్టవలెను.

* * *

## అఖిల భారత మహిళా సభ

ఈ మహాసభయొక్క సప్తమ సమావేశము డిశంబరు నెల ఆఖరు వారములో కలకత్తా నగరమున అబ్దులుకాదిర్ సతీమణిగారి అధ్యక్షత క్రింద సమావేశమయ్యెను. ఆమె యుపన్యాసమును సంగ్రహముగ నీక్రింద పొందుపరచుచున్నాము.

### సోదరీమణులారా, సోదరులారా.

తాము నాకీ యధ్యక్షపదవి నొసంగినందుకు కృతజ్ఞురాలను. శ్రీమతులు బరోడామహారాణి, భోపాలు బేగము, సరోజనీనాయుడు మొదలగు వార లధిష్ఠించిన యీపీఠము నధిష్ఠించుట నాకత్యధిక గౌరవదాయకమై యున్నది. నేను మిగుల విద్యావతిని కాకున్నను ఉత్సాహము గల సేవకురాలననియే నాకు మీరీ పదవి నొసంగినారు. ఈరాష్ట్రభాషయగు బంగాళీ నాకు రానందునను, నా స్వభాషయగు ఉరుదు తమకు తెలియనందునను, ఆంగ్లభాషలోను పన్యసించవలసి వచ్చినందుకు క్షమింతురుగాక! మన దేశములో వివిధరాష్ట్రములవా రెల్లరును తమ స్వభాషతోడు హిందీభాషనుకూడ నేర్చుకొని దేశమున కంతటికి నొక వ్యవహారభాషను నిర్మింపవలెనని 16 సంవత్సరముల క్రిందట దేశీయనాయకు లెల్లరును ఈ పురముననే సమావేశమై ఒక తీర్మానము గావించినను, మనమెల్లరమును అట్టి సుస్థితిని నేటికిని గాంచలేకుండుట విచారకరము.

### —ప్రస్తుత విద్యావిధానము—

మనదేశపు విద్యా విధానము పూర్వ మొక్క బాలురకొరకే ఉద్దేశింపఁబడినది. నేఁడది వారికే సరిపడకున్నది. ఇట్టిచో బాలికలకుకూడ దానినే గఱప గడగుట కంటె అవివేకము లేదు. ఏవో పరీక్షలు ప్యాసయి ఉద్యోగములు చేదామనికోరు ఏకొందరికో మాత్రమే అది సరిపడును. అనతికాలములో విద్యను ముగించుకొని గృహమును చక్కగా నిర్వహించుకొని పిల్లలను పోషించుకొనగల యొక క్రొత్తవిధానమును వారికొరకు మనమేర్పాటు చేయవలసి యున్నది. ఈసమయమున లేడీ ఇర్విను కళాశాలనుగూర్చి మీరు కొంత తెలుసుకొనవలసి యున్నది. అది యీసభవారి కృషివల్లనే నెలకొల్పఁబడినది. భారతదేశపు వివిధ ప్రాంతములనుండి వచ్చు యువతులకు అక్కడ ఉపాధ్యాయ శిక్షణ యొసగఁబడును. అందు మొట్టమొదట 12 గురు యువతులు మాత్రము చేరిరి కాని నేఁడు 40 మంది శిక్షణము బడయుచున్నారు, ఇంకను పెక్కురు దరఖాస్తులు పెట్టుకొనుచున్నారు కాని స్థల సంకోచము వలన అవి నిరాకరింపఁబడుచున్నవి. ప్రస్తుతము ఢిల్లీలో రెండు ప్రభుత్వభవనములు ఖాళీయగుచున్నవి. వానిలో నొకదాని నీ కళాశాల నిమిత్తమిమ్మని మనము ప్రభుత్వమువారిని వేఁడుకొనవలెను. మన ప్రతినిధులు ప్రభుత్వము వద్దకు వెళ్లులోపల వెల్లింగ్డనుసతిగారిని దర్శించినచో, ఆమె సానుభూతి వలన మనకృషి విజయము నందవచ్చును.

ఇది ఉన్నత విద్యను బడయ దలచుకొన్నవారికై యున్నది. దేశములో నత్యధిక సంఖ్యాకులకు సాధా

రణ ప్రాథమిక విద్యయు, జీవనోపాధినిగూర్చి కొన్ని చేతిపనులను నేర్పినచో చాలును. ఇట్టి పాఠశాలలు వేనవేలుండవలెను. పూర్వము బాలికలకు నేర్పు చిత్రకళలు వారి యుత్సాహమును పెంచి విలాసమును గూర్చుటకుగా మాత్రమే ఉద్దేశింపఁబడినవి. ఇక ముందు బాలికలకు వివాహ మొక్కటే జీవనోపాధి కాక వేరొక స్వతంత్ర జీవనోపాధి కావలసియున్నది. మన పాఠశాల లట్టి విధానమును సమకూర్చవలసియున్నది. ఇట్టి మహత్కార్య నిర్వహణమునకు ధన మత్యావశ్యకము. ప్రభుత్వమువారు మన కిదివరలో కొంత ద్రవ్య సహాయము చేయుచున్నను అది చాలదనియే చెప్పవలసియున్నది. పురుషుల విద్యకొరకు నిర్ణయించిన ధనములో కొంచెము భాగము స్త్రీ విద్యకొరకు ప్రత్యేకింపఁ బడుచున్నది. ఇకముందు పురుషులవిద్య కెంత సొమ్ము యిచ్చుచున్నారో స్త్రీవిద్యకుకూడ అంత యొసగునట్లు మనము పోరాడవలెను. దీనికి తోడుగ సంస్థానాధీశులయొద్దనుండియు ఇతర ఉదార మహనీయులయొద్ద నుండియు మనము విరాళములను గ్రహించవలెను.

—సంఘసంస్కారము—

సంఘ సంస్కారమునకు ప్రతిఘటనము ముఖ్యముగ దేశీయుల అజ్ఞానమునుండి సంభవించుచున్నది. బాలురకును పురోహితులకును గూడ మనము మంచి విజ్ఞానమును నేర్పవలెను. ప్రస్తుతము పత్రికలన్నియు పురుషుల ఆధీనములో నున్నవి. వారు మన ఆశయములకు విరోధు లననేరను. వారు మనకు చేసిన సహాయమునకు కృతజ్ఞతను కూడ తెలుపుచున్నాను కాని ఇప్పటికంటె ఎక్కువమంది స్త్రీలు పత్రికా విలేఖరులును సంపాదకులును కావలసిన ఆవశ్యకత యెంతయో కలదు. సంఘ సంస్కార ప్రయత్నములు ఫలప్రదములు కావలెనన్న కేవల ప్రభుత్వచట్టముల వలన పనులు కానేరవు. ఉదాహరణము శారదా చట్టమే. మనము కష్టపడి దానిని ప్యాసు చేయించి, చేయించితిమని గర్వించుచున్నాము. కాని బాల్య వివాహములు వేనవేలు జరుగుచునే యున్నవి. దీనికి కారణము మనము మన ఆశయములపట్ల అనుకూలమగు భావములు కలిగించుటకై దేశీయులలో తగిన ప్రచారము సలుపకుండుటయే. ఇక ముందు మన మిట్టి ప్రధాన కార్యము నేమఱియుండరాదు. ఇట్టి అనుకూలాభిప్రాయమును కలిగించుటకు సినీమా మనకు మిక్కిలి సహాయకరము. సంఘ సంస్కారము, గృహనిర్వహణమును గూర్చిన పటములను అతి బాల్యవివాహములు, మూఢాచారములు వివాహ ఖర్చులు మొదలగు వాని వలన కలుగు నష్టమును తెలియచేయు పటములు కథలు ప్రదర్శించినచో మిక్కిలి ప్రయోజనము కలుగును. ఇట్టివాని కొరకు వ్యయింపఁ బడిన ధనము వ్యర్థము కానేరదు. గ్రామవాసులు దరిద్రులగుటకు ప్రధానకారణము వారి పూర్వాచారముల ననుసరించుచు అందుకొరకు అపరిమితములగు అప్పులు చేయుటయే. వీనిలో కొన్ని కేవలము అనాగరికములు మరి కొన్ని పూర్తిగా అనావశ్యకములు. వీనిని తొలగించవలెనని ఎల్లరు నందురే కాని ఎవరిమట్టుగ వచ్చినప్పుడు వారు తమ స్త్రీలమీద నెపము పెట్టుచు ఇట్టి దుర్వ్యయము లొనరించుచునే యుందురు. కనుక మనము పురుషులకంటె నెక్కువ బాధ్యతవహించి ఇట్టి మూఢాచారనిర్మూలనమునకు గడంగవలసి యున్నది.

—వారసత్వపు హక్కులు—

స్త్రీలకు వారసత్వపుహక్కు లుండవలెనని మనము అఖిలభారతశాసనసభద్వారా కొంత కృషి సలిపితిమి కాని అది ఫలించలేదు. అయినను చాలామట్టుగ అనుకూలభావ మేర్పడినది. మనము తీవ్రకృషి సలిపినచో న్యాయమైన ఈ హక్కు సిద్ధించి తీరును. ఈ విషయమున హిందూ మహమ్మదీయ యువతుల కెల్లరకును సమాన కష్టమే కలుగుచున్నది. ముసల్మాను యువతులకు ఇస్లాము లా ప్రకారము అట్టి హక్కులున్నను అనేక భాగములలో స్త్రీలు వానికొఱ కొత్తిడిని చేయరు; కొన్ని భాగములలో అట్టిహక్కు తీసివేయఁబడినది. ముసల్మాను యువతులకీ హక్కును పునః ప్రసాదింపవలెను. హిందూయువతులకు ఇట్టి హక్కుల నొసగవలెను.

## —స్త్రీల యెన్నికహక్కులు—

సోదరీమణులారా, ఇంతసేపును సాంఘిక సమస్యలనుగూర్చియే చర్చించుచుండుటచేత నాకు రాజకీయములందు ఉత్సాహములేదని మీరు తలతురేమో. అటులెంతమాత్రమును కాదు. పురుషులతో సమానముగ ప్రభుత్వముతో ధీరులై పోరాడిన యువతులును, దేశముకొరకనుపమానమైన త్యాగముచేసిన మహిళామణులును మనలో ననేకు లున్నందుకు నేను గర్వించుచున్నాను. అయినను మనసభ తొలినుండియు రాజకీయములలో నంతగా జోరుకొనలేదు. ఇది కొంతవరకు మంచిదే. స్త్రీవిద్యా ప్రచారముకొరకును, సంఘసంస్కార సాధనకొరకును వివిధాభిప్రాయము లుగల యువతులైనను అభిప్రాయభేదమును పాటించక కృషిచేయవలెననియే మనమట్లు తటస్థముగ నున్నాము. భిన్నాభిప్రాయములు కలవారమైనను విడిపోక యేకముఖమున నిలచి పోరాడుటవలననే యెన్నికహక్కు అను ప్రధానవిషయమున మన మామాత్రము విజయమునైన బడయఁగలిగితిమి. వయసు వచ్చిన వారికెల్ల వోటుండవలెననియు, పురుషులతో సమముగా మన కన్ని పదవులయందును అవకాశము లుండవలెననియు మనము వాదించుచున్నాము. ఈ సంవత్సరము 'విమన్సు ఇండియను అసోసియేషను' యొక్కయు, 'నేషనల్ కౌన్సిలు ఆఫ్ వుమను ఇన్ ఇండియా' అను సంస్థయొక్కయు ప్రతినిధులతో పాటు మనమును మన ప్రతినిధులను జాయింటు సెలెక్టు కమిటీవద్ద కింగ్లాండు దేశము పంపితిమి. మన కోరికలను బ్రిటిషుప్రభుత్వవారు తగురీతిని ఆదరించనందుకు విచారమగుచున్నది. మనకు ఇయ్యఁదలచు కొన్న యెన్నికహక్కు సైమనుకమిషనువారి సిఫార్సులకంటెను ఇండియను ఫ్రాంచైజుకమిటీవారి సిఫార్సులకంటెను తక్కువగా నున్నదని తెలుపుటకు నాకు విచారమగుచున్నది. పాశ్చాత్యదేశములలో కూడ స్త్రీలు ఇట్టి హక్కులను సులభసాధ్యముగను వేగముగను సంపాదించుకొనలేరన్న మనకు అట్టి హక్కు ఇంత వేగము లభించనందుకు మనము జుగుప్స పొంద నక్కరలేదు. మనము వచ్చినన్ని అవకాశములను చేబట్టుచు క్రొత్తవానికొరకు పోరాడుచుండవలసినదే.

## కార్యక్రమము

సోదర సోదరీమణులారా, మన మేమో మహాత్కార్యములను చేయఁగలమని ఆశించఁబడుచున్నది. ముందున్న వారిపై భారమెల్లయు పడుచున్నది. వెనుకనున్న వారెట్టి చెయిసాయమును చేయరు. సభకంతమాత్రము వచ్చి చందా యీయగానే తమ బాధ్యత తీరినదనియే అనేకులు తలచి పిమ్మట నిద్రాణులగుదురు. మేజిక్కు లాంతర్లు మొదలగువాని ద్వారా మంచి బొమ్మలు ప్రదర్శించి ప్రజలకు మన కార్యక్రమమందు ఉత్సాహము పుట్టించి సంఘసంస్కారముయెడల ప్రజలలో అభిమానము కలిగించగల ఉత్సాహవంతులు మన కనేకులు కావలసియున్నారు. ఒక్కొక్క నాయకిక్రింద అట్టివారు పదిపండ్రెండు మంది యుండవలెను. ఈ నాయకీమణులు వారికి పనులుచెప్పి పనులుగొని రిపోర్టులను కాన్ఫరెన్సువారి కందజేయుచుండవలెను. ఇట్లు దేశము పొడుగునను మనము ప్రచారకురాండ్రను పెట్టి పనిచేసినచో అత్యద్భుతమైన ఫలితములు కనిపించగలవు. అట్లు కానిచో వట్టి శుష్కతీర్మానముల వలన నెట్టి ప్రయోజనమును కలుగనేరదు.

మన సభవంటి సభతో మనము నిర్వహింపలేని కార్యములేదు. దేశము పొడుగునను మనకు 118 శాఖలున్నవి. వీనిలో 12 స్వదేశసంస్థానములలో నున్నవి. వాని నింకను హెచ్చు చేయవచ్చును. ఈ శాఖలన్నియు నేకముఖమున పనిచేసినచో అత్యద్భుతమైన సంస్కారమును ప్రబోధమును మనము దేశములో కలుగఁజేయగలము. ఇంతవరకు మనలో జాతిమతములకు సంబంధించిన భేదబుద్ధులు లేవు. ఈ విషయమున మన సోదరుల కెల్లరకును మనము మార్గదర్శకులమై యుండుట యెంతయు ప్రశంసనీయము. ఇంత స్వల్పకాలములో ఇట్టి మహాసంస్థను నిర్మించుటకు మనకు సహాయమొనర్చిన పరమేశ్వరునికి కృతజ్ఞతావందనములు—మన కృషివలన మనకును మన మాతృదేశమునకును అఖండకీర్తి సమకూడును గాక !




## సాంత్వనము

శ్రీమతి ఎ. కోమలమ్మగారు

రణజితసుతకృత జయజయనాద!
ప్రణమసి బతపరాక్ గతబల సాంప్రతమ్॥
మణిమయడోలికా ఖేలనలోల!
క్షీణ—మహీతలే విలుఠసిసాంప్రతమ్॥
అవిరళ వసుగణ వితరణశీల!
వివశ—యవాగూం యాచసే సాంప్రతమ్॥

కవిజన సుమధుర గీతప్రమోదిత!
అవిరతరోదనై శ్శోచసిసాంప్రతమ్॥
విశ్వసుసభ్యతా ప్రథమగురూత్తమ!
సశ్వరాంగ్లేయతా మిచ్ఛసిసాంప్రతమ్॥
గురుకులారామ ఖ్యాపితసత్కల!
పరసరిసేవనం కథయసిసాంప్రతమ్॥

దుర్బలభారత! దుర్గతభారత!!
దుఃఖితభారత!!! మాశుచమర్షయ॥

## లాలిపాట

శ్రీమతి కవితిలక కంచనపల్లి కనకమ్మగారు, విద్వాన్

ద్విపద (లాలిపాటగఁ బాడవచ్చును)

శ్రీభానుకులరామ శ్రేయోభిరామ
భూభారహరిరామ పుణ్యాత్మరామ॥ లాలీ॥

పతితపావనరామ భవనుతరామ
అతులదైత్యవిరామ యానందరామ॥

కౌసల్యసుతరామ కంజాక్షరామ
భూసురప్రియరామ భూనుతరామ॥

దశరథసుతరామ ధన్విశ్రీరామ-
పశుపతిప్రియరామ పరమాత్మరామ॥

గాధేయనుతరామ కారుణ్యరామ
బాధితాసురరామ బాలశ్రీరామ॥

సౌమిత్రియుతరామ శ్యామాభిరామ
భామార్తిహరగామ భాస్కరరామ॥

జనకపూజితరామ జయజయరామ
ఘననీలరుచిరామ గంభీరరామ॥

దళితకార్ముకరామ ధాంతశ్రీరామ
కలితసీతారామ కళ్యాణరామ॥ లాలి॥

# ఆరోగ్యబోధిని

## ఫేషన్ తిండ్లు

పూర్వపుస్త్రీలు చాలావయను మళ్ళినను, ఇప్పటి కాలపు పడుచుస్త్రీలకన్న పదిరెట్లు బలముగలిగి పనులు చేయుచున్నారు. ఇప్పటి కాలపుస్త్రీలు పనులు చేయలేకపోవుటకు గల కారణము ఫేషన్ తిండ్లే. కడుపులో మలమలమాడుచున్నను, పల్లెక్కులో మెట్టవైన గాజుప్లేట్లలో గుప్పెడు మెతుకులు వేసుకొని, తిని, ఆ కడుపులోఉండు కాలీస్థలములో నీళ్ళుపోసుకొని కాలముగడుపుదురు. వడ్డించువారు ఇంకాకొంచెము వడ్డించనా ? అని అడిగిన 'చాలు కడుపు నిండిపోయినది. ఇక కడుపుపట్టదు.' అని లేనితృప్తి కనపరుచుస్త్రీలు అనేకమంది మన దేశములో కలరు.

ఇక వారిబలమో ! కడుపులోనికి ఆహారము వెళ్లనియడల బలము భగవంతుడుమాత్రము ఇచ్చునా? పలుచని చెక్కిళ్లంటే ఇవే అనునట్లు గుంటలుబడిన బుగ్గలును; కందిరీగంత నడుమంటే ఇదే అనునట్లు ఆహారములేక నడుముకు అంటుకొనియున్న కడుపును; విశాలమైన కండ్లు అనగా ఇవే అనునట్లు ఎండిపోయిన గుంటలలోనుండి విశాలముగా కనబడు కండ్లును; గాలికి ఎగిరిపోవునట్లును, కుశ్శించిపోవు శల్యములు కనబడుచుమను, "అబల" అని పెట్టిన పేరు సార్థకము చేసుకొను నారీమణులు ఈ భరతఖండములో పెక్కుండ్రుగలరు.

ఇక పురుషులసంగతి అనెదరేమో ! పురుషులు ఫేషన్ తిండ్లు తినినను, ఏహోటలుకోపోయి కడుపు నింపుకొందురు. బలహీనమయిన స్త్రీలకు పురిటి సమయములో చాలా ఉపద్రవము రావచ్చును.

ప్రపంచములో కొంతమంది స్త్రీలు పురుషులతో అన్నివిధముల పోటీ చేయుచున్నారుగదా ! మన భారతనారీమణులలో కూడా-తారాబాయి, రుక్మాబాయి, తదితర స్త్రీలుకూడా పురుషులతో అన్నివిధముల పోటీ చేయుచున్నారుగదా ! అయితే ! మరికొంతమంది స్త్రీలు ఎంత శక్తిలేని పనిచేసిన అంత ప్రజ్ఞ అని తలచుచున్నారు అని నేను ధైర్యముగా చెప్పగలను. ఇక అన్నిపనులు చేసెడివారలను చూచి ఆశ్చర్యపడుచు, చిన్ననాటనుండి పనులు చేసెడివారలేగాని మేము చేయలేమమ్మా ! అనెడు వారునుగలరు.

కొంతమంది ఫేషన్ తిండ్లయొక్క మజా తెలుసుకొని చాలామట్టుకు శల్యములు కనబడిన తరువాత బలముగా నుండుటకు ప్రయత్నించి ఫలహారముగాని, పాలుగాని, భోజనముగాని, కొంచెము హెచ్చుతినిన అరగవు. కారణము ఫేషన్ తిండ్లకు అలవాటైన అన్నకోశము సహించలేక అజీర్తిపుట్టించి, అనేక జబ్బుల పాలేయును. ఇట్టి బలహీనముగల స్త్రీలు బిడ్డలనుకనిన ఆ బిడ్డలు కూడా చాలా బలహీనముగా నుందురు. ఇందువలన దేశములో శిశువుల చావులు మిక్కుటముగా సంభవించును. భావిజనాంగము బలహీనమైనదిగా అవును. దేహబలముతో ఆయురారోగ్యములు కూడా తగ్గును. లోకములో అంటువ్యాధులు చిన్నచిన్న సూక్ష్మజీవులవల్లనే కలుగుచున్నవని మనకందరికి తెలియును గదా ! ఆ సూక్ష్మజీవులు బలహీనమైనవారిలోనే త్వరలో ప్రవేశించును. కారణము ఆ సూక్ష్మజీవులను ఎదిరించగల తెల్లకణములు లేనందున.

గాన సోదరీమణులారా ! ఈ వ్యాసము మీ మనములు నొప్పించుటకు వ్రాయలేదుగాని, ఇకనైన ఫేషన్ తిండ్లవలన కలిగెడి గుండెలలో నొప్పి, కాళ్లుచేతులు లాగుట, క్షయ, మొదలయిన వ్యాధులు మనకు రాకుండా చూచుకొని ఫేషన్ తిండ్లు మాని మంచి ఆరోగ్యమైనవార మనిపించుకొనుచు కడకు "భరతఖండమున గల స్త్రీలు చాలా బలమైనవారు" అని అనిపించుకొనుటకు పూర్తిగా పూనుకొనుడని నా మనవియైయున్నది.

—పలివెల కాంతమ్మ.

# బాలవిజ్ఞానశాఖ

## గృహలక్ష్మి తొక్కపలుక్కులు

కీ॥ శే॥ బి. రమణమ్మగారు

పిట్టమ్మాపిట్ట
ఏమిపిట్ట?
చిలకపిట్ట
ఏమిచిలక?
తెలుపుచిలక
ఏమి తెలుపు?
హంస తెలుపు
ఏమిహంస?
రాజహంస
ఏమిరాజు?
మృగరాజు
ఏమి మృగము?
వనమృగము
ఏమివనము?
పూలవనము
ఏమిపూలు?
జాజిపూలు
ఏమిజాజి?
గుత్తుజాజి
ఏమిగుత్తి?
కవ్వంగుత్తి
ఏమికవ్వం?
చల్లకవ్వం
ఏమిచల్ల?
మంచుచల్ల
ఏమిమంచు?
పొగమంచు
ఏమిపొగ?
దీపంపొగ
ఏమిదీపం?
గోడదీపం
ఏమిగోడ?
కోటగోడ
ఏమికోట?
తులసికోట
ఏమితులసి?
లక్ష్మితులసి
ఏమిలక్ష్మి?
గృహలక్ష్మి.

---

## ఎన్నెమ్మపాట

'ఆంధ్రసేవిక'

[ఈపాట పురిటిగది ఇవతల పాడినయెడల, పురిటిపిల్లకు ఎన్నెమ్మవలని బాధకలుగదని నమ్మిక.]

ఒక్కోనాడు ఎన్నెమ్మా
పక్కలుపట్టుక వచ్చిందీ,
రెండోనాడు ఎన్నెమ్మా
రొట్టెలుపట్టుక వచ్చిందీ,
మూడవనాడు ఎన్నెమ్మా
మువ్వలుకట్టుక వచ్చిందీ,
నాల్గవనాడు ఎన్నెమ్మా
నవ్వుతు కేరుతు వచ్చిందీ,
అయిదవనాడు ఎన్నెమ్మా
ఆడుతుపాడుతూ వచ్చిందీ,
ఆరోనాడు ఎన్నెమ్మా
అందెలుపెట్టుకు వచ్చిందీ,
ఏడోనాడు ఎన్నెమ్మా
ఏడుపుముఖము పెట్టిందీ,
ఎనిమిదోనాడు ఎన్నెమ్మా
ఏరూదాటి వెళ్లిందీ,

తొమ్మిదోనాడు ఎన్నెమ్మా
తోరణందాటి వెళ్లిందీ,

పదియవనాడు ఎన్నెమ్మా
పట్నందాటి వెళ్లిందీ.

[ఎన్నెమ్మ బ్రదుకులు ఎన్నెకలు కన్నెకలు. ఎన్నెమ్మను తలచిన వీడువాడలా ఎన్నెమ్మ రాదు. బ్రాహ్మడికూతురు మాలాడిపెండ్లం!]

## అనోరాధలో అడిగినన్ని జొన్నలు

బి. పి. పట్టాభిరామారావుగారు

ఉత్తర—ఊరుకుంటే
హస్త—అనుగ్రహిస్తే
చిత్త—చిత్తగిస్తే
స్వాతి—చల్లనచేస్తే
విశాఖ—విసరకుండావుంటే
అనోరాధలో అడిగినన్నిజొన్నలు.

---

# చిత్రప్రశ్నలకు సమాధానములు

జనవరిమాసపు గృహలక్ష్మిలోని శ్రీమతి తాయి రత్నమాలగారి చిత్రప్రశ్నకు యుక్తిలెక్కకు శ్రీమతులు వారణాసి వరలక్ష్మి, తాయిరత్నమాల, కె. నాగలింగమ్మ, తిరువీధుల అనసూయాదేవి, కోకిరాజామాణిక్యము వీరమాచనేని కనకవల్లితాయారమ్మ, పానుగంటి తులసీదేవి, పి.యస్. కామేశ్వరి, దామోజీపురపు లక్ష్మి నరసమ్మ, కంకిపాడి రుక్మిణమ్మ, నూతులపాటి కమలాకుమారిగార్లును, శ్రీయుతులు ముక్కామల గోపాలరావు, యమ్. వెంకటేశ్వరరావు, శేతలి రాజేశ్వరరావు, వేదునూరు గంగాధరంగార్లును సమాధానములు వ్రాసిరి. కొందరు రెండింటికిని వ్రాసిరి. కొందరు రొక్కక్క ప్రశ్నకును

చిత్రప్రశ్నకు సమాధానములు శశి, శివ, వసు, సుధ, ధర, రంభ, భ్రమ, మబ్బు అని యీయబడినది. యుక్తిలెక్కకు పెక్కులు 301 వ్రాసిరి. శ్రీమతి యస్. మల్లికాదేవిగారు 721 వ్రాసిరి.

—:o:—

# చిత్రప్రశ్న

చింతపెంట వెంకటరమణయ్యగారు

సీ॥ ఆడుగుఱ్ఱమునకు సమరునామంబేది ? గొప్పతనంబన నొప్పునేది ?
గుంద్రమన్మాటకింకొక మాటయెయ్యది ? నిదురకర్థంబిచ్చు పదము దేది ?
గోధుమరవ్వకుఁ గుదురుపేరెయ్యది ? అవికకునేది పర్యాయపదము ?
చిన్నకుండకు నొప్పియున్న యాహ్వయమేది ? వడగలికిన్వేఱు పదముదేది ?

గీ॥ అన్నిఁటికిఁ గూడ మూఁడేసి యక్షరములు,
త్రిప్పిచదివిన శబ్దమింతేనిమాఱ
దట్టిపదముల వివరించు నార్యవరుఁడు
సరసతనునొప్పు భావజ్ఞచక్రవర్తి॥

## అమ్మనోచిననోములు

శ్రీమతి మల్లవరపు లక్ష్మీదేవిగారు

అనగా అనగా ఒకఊళ్లో ఒకబ్రాహ్మణుడు. అతనిభార్య గర్భవతియైయుండగా, ఆమెకు మామిడిపండు తినవలెనని కోరికకలిగింది. అది అకాలమైననూ, భార్య కోరికతీర్చుటకు బ్రాహ్మణుడు దేశదేశాలు తిరిగి, అపురూపంగా ఒకమామిడిపండు తెచ్చాడు.

నడవాలో కంచనిండా వెచ్చని అన్నము పెట్టుకొని, పెరుగుపోసుకొని, మామిడిపండు తింటోంది, ఆ బ్రాహ్మడిపెళ్లాము. ఒకకాకి ఎదురుగావచ్చి, ఆ పండు తినచూచింది. ఆవిడ అది కనిపెట్టి, పండు పూర్తిగా తినేసి, టెంకకూడా కాకికి అందకుండా బురదగుంటలో పారేసింది. కాకి నిరాశచేసుకొని వెళ్ళిపోయింది. యీసంగతి భర్తకు తెలిపి విచారించాడు.

మరికొన్ని రోజులకి ఒక ఆడపిల్లనికని, ఆ బ్రాహ్మణపడుచు తనువు చాలించింది. ఆ పిల్ల పెరిగి పన్నెండు సంవత్సరాల బాలాకుమార్తె అయింది. తల్లిలేని పిల్లగదాయని, తండ్రి ఎప్పుడూ పిల్లను ఒంటరిగా విడిచిపెట్టక, ముద్దుగా పెంచుతున్నాడు.

తండ్రి, కూతురు, ఒకనాడు పొలంవెళ్ళారు. పొలం చెరువులో ఇదివరకు ఎప్పుడూ లేనిది, ఆ రోజున ఒక అందమైన తామరపువ్వు ఒకటి కనిపించింది. బాలిక ఆ కమలంకోసం ఆశపడ్డది. 'వద్దమ్మా! అది మనకు దొరకదు' అని విచారంతో పలికాడు తండ్రి, పూర్వం తనభార్య చేసినసంగతి జ్ఞప్తికివచ్చి. కూతురు వినలేదు. ఒడ్డునేవుంది కదాఅని నిమ్మళంగా దిగింది. 'కమలము' కొంచెము వెనక్కి జరిగింది. బాలిక పాడింది.

'కాలుతడిసెర నాయనా
'కాలంత తడిసెర నాయనా'

తండ్రి:—'ఏమిసేతునె కూతురా?
'మీ అమ్మనోచిన నోములు
'కాకమ్మజేసిన కొకులు'

బాలిక వెంబడించింది. కమలం ఇంకాదూరంగా పోయింది.

బాలిక:—'నడుముతడిసెర నాయనా'
'నడుమంత తడిసెర నాయనా'

తండ్రి పూర్వమువలెనే జవాబిచ్చాడు. బాలిక కంఠమువరకు నీరువచ్చింది. తండ్రి నిరాశచెందాడు. బాలిక మళ్ళీపాడింది.

'తలతడిసెర నాయనా
'తలంత తడిసెర నాయనా;

అని మునిగిపోయింది. తండ్రి కళ్లమ్మట నీళ్ళధార జారింది. తామరపువ్వులోనుంచి కాఉనల్లని మాలకాకి ఎగిరిపోయింది. తండ్రికి బోధయింది. కక్షతీర్చుకొంది కాకమ్మ అనుకున్నాడు. తల్లిచేసిన పాపము కూతుర్ని చుట్టుకుందనుకున్నాడు.

—:0:—

# వార్తలు విశేషములు

దక్షిణ హిందూస్థానపు నగరములలోగల స్త్రీసమాజము లన్నియు హిందీభాషాభ్యాసమును గూర్చి మిక్కిలి శ్రద్ధతీసుకొనుచున్నవి. పల్లెటూండ్ర యువతులు కూడా హిందీభాషను చురుకుగా నేర్చుకొనుచున్నారు. గతసంవత్సరము దక్షిణ హిందూస్థానములో 1486 మంది స్త్రీలు పరీక్షలకు హాజరైరన్న యీ భాగమున హిందీ భాషాభిమాన మెంతవరకు హెచ్చినదో తెలిసుకొనవచ్చును.

*　　*　　*

జనవరి నెల 15 వ తేదిని జరిగిన భూకంపమువలన పాట్నాలో 4000 యిండ్లు కూలినవి, 600 మంది మరణించిరి, 400 మంది గాయపడిరి, టెలిగ్రాఫు తీగలు తెగిపోయెను. బీహారురాష్ట్రములో ఇతర రాష్ట్రములకన్న యెక్కువ నష్టముకలిగెను. ఇది వరకు తరచుగా అస్సాంరాష్ట్రమునకే భూకంపముల బాధ యెక్కువగ నుండెడిది. ఇప్పుడు బీహారువంతు వచ్చినదనుకొనుచున్నారు.

*　　*　　*

లక్నోలో 500 గృహములు కూలెను అనేకమందికి గాయములు తగిలెను. కాసీలో 3 నిమిషముల 20 సెకండులు భూకంపముండెను. 30 యిండ్లు కూలినవి 28 మంది గాయపడిరి, ఇద్దరు మరణించిరి. ఢిల్లీలో అనేక దివ్యభవనములు పగులు చూపెను. ఆంధ్రదేశమున విశేష నష్టము కలుగలేదు కాని పెక్కుభాగములలో భూమి యిండ్లు సామాగ్రి బడబడ కదలినవి. మొత్తముపైని అనేకు సీతాచలపర్యంతమును ఇది కలిగినది. ఉత్తర హిందూస్థానమున దీనితాకిడి యెక్కువ. కాలము గడచుకొలది ఘోర వార్తలు తెలియుచున్నవి. ఇందు మూడువేలమంది మరణించినట్లు, ఆస్తులు పంటలు నిర్మూలమైనట్లు తెలియుచున్నది. శ్రీజార్జి సార్వభౌముడు నష్టపడిన వారియెడల సానుభూతి తెలుపుచున్నారు. 'రాజప్రతినిధి భూకంపనిధి' యనుపేరిట విల్లింగ్డను ప్రభువు ఒకనిధిని వసూలు ప్రారంభించెను. పండిత జవహరులాలు, రాజేంద్రప్రసాదుగార్లు ఆనిధికి ధనము వసూలు చేయుచున్నారు. భూకంపనిధికి కరాచీ కార్పొరేషనువారు రు. 1000 లును కలకత్తా మేయరు నిధివారు రు. 3000 లును ముస్లిము రిలీఫుకమిటీవారు రు. 11,700 లును, ఇన్‌డేకాంగ్రెసువారు రు. 13,000 లును ఇండియను రెడ్‌క్రాసు సొసైటీ వారు 5000 లును కాసీసేవాసమితివారు రు. 1200 లును వసూలు చేసినట్లు తెలియుచున్నది.

*　　*　　*

16-వ తేదిని 40 నిమిషముల కాలముపాటు వైసురాయిగారును 1 గంటసేపు వారి కార్యదర్శిగారును పండిత మదనమోహన మాలవ్యాగారితో మాట్లాడిరి. చాలా ముఖ్యమైన విషయములనుగూర్చి సంభాషించిరని తెలియుచున్నది.

*　　*　　*

మన్యజ్వరమునకును మసూచికమునకును మూలకారణమైన క్రిములను ఇటాలియను గాంబూసియా అను నొక తరగతిచేపలు భక్షించును. ఇట్టివానిని బెంగుళూరు ఆరోగ్యశాస్త్రపరిశోధనాధికారులు తెచ్చి మైసూరు రాష్ట్రములో ఆరోగ్య ప్రచారము చేయుచున్నారు. అమెరికా కోటీశ్వరుడు అగు రాకు ఫెల్లరుగారు ప్రజల ఆయురారోగ్యాభివృద్ధి కొరకు శాస్త్రముపరిశోధన చేయుటకై విశేషధన మొసగెను. దానిని సద్వినియోగ మొనర్చుటకై పాటుపడుచున్న వైద్యశాస్త్రవేత్తలు డాక్టరు రస్సెలు మొదలగువారు ఈ ప్రయత్నముల చూచి సంతోషించిరి.

# హరిజనాభ్యుదయము

మహాత్ముడు డిశంబరు నెల 23 తేదిని తెల్లవారు జాము 4 గంటలకు మెయిలులో తెనాలివచ్చిరి. స్టేషనుకు 1000మంది పరిసర గ్రామములనుండి కూడవచ్చిరి. వెంటనే కావూరువెళ్లి శ్రీ సీతారామ శాస్త్రిగారిచే స్థాపించబడిన వినయాశ్రమమును రామలింగేశ్వర దేవాలయమును తెరచెను. పిమ్మట భట్టిప్రోలుమీదుగా రేపల్లె 5 గంటలకు చేరిరి. రేపల్లె వారలు నగలుగాక 800 రూపాయలర్పించిరి. 7 గంటలకు తెనాలి బయలుదేరెను. వర్ష ప్రతిబంధక ముగా భట్టిప్రోలులో నాగిపోయెను. అక్కడ రు 300 ఒసంగబడెను. 8 గంటలకు తెనాలిలోదిగెను. శ్రద్ధానంద హరిజనపాఠశాలకు శంకుస్థాపనము చేసెను. అచ్చటనుండి నగరప్పాడునకువెళ్లి రామాల యమును హరిజనుల నిమిత్తము తెరచెను.

24 వ తేది ఉదయము మెయిలులో గోదావరి జిల్లాలో ప్రవేశించెను. 12 గంటలకు కాకినాడవెళ్లెను. రామచంద్రపురం ప్రకృతి రామణీయకతను ప్రశం సించెను— రాత్రి 7½ గంటలకు రాజమహేంద్ర వరము వచ్చెను. వివిధపక్షములవారు స్వాగత పత్ర ముల నిచ్చిరి. దేశత శ్రీరామమూర్తిగారి యింట్లో హరిజననాయకులతో ముచ్చటించిరి.

25 వ తేది ఉదయం 8 గంటలకు సీతానగరాశ్ర మమును చేరిరి. సాయంత్రము ఆశ్రమములో ప్రార్థనము సలిపిరి. 26 వ తేది ఉదయ మచ్చటనే తిరిగి ప్రార్థనజరిపిరి.

26 వ తేది మధ్యాహ్నము వంగలపూడి వెళ్ళిరి. సీతారామస్వామి గుడిని హరిజనులకు తెరచెను. సుబ్రహ్మణ్యముగారు స్థాపించిన హరిజనాశ్రమమును చూచి యుపన్యసించిరి. తిరిగీ సీతానగరము వచ్చి శివవైష్ణవాలయములను హరిజనులకై తెరచెను. ఖద్దరు ప్రచారకులతో ఇష్టాగోష్ఠిని సలిపెను. 6 గం టలకు పశ్చిమగోదావరిజిల్లా బయలుదేరెను. 9 గంట లకు నిడదవోలు వచ్చి హరిజనులకు ఖద్దరు పంచి పెట్టెను. అక్కడనుంచి తణుకువెళ్లెను.

27 వ తేది మధ్యాహ్నం 10 గంటలకు తాడేపల్లి గూడెమువచ్చెను. 2 గంటలసేపచ్చటనుండి,యేలూరు వెళ్లిపోయెను. తణుకు పాలకొల్లులలో ఘనమగు స్వాగత మొసగబడెను.

28 వ తేదికి విశాఖపట్నమువచ్చి సముద్రతీరమున మహాసభలో ఉపన్యసించెను.

29 వ తేదిని విజయనగరము అనకాపల్లి మొద లగు పట్టణములలో ఉపన్యసించి నిధి వసూలుచేసెను.

30 వ తేదికి నెల్లూరుమండలము వచ్చిరి. నెల్లూరు జిల్లాలో రు 1000 లకు పైగా వసూలయ్యెను. ఇంత మొత్తమే యితర ఆంధ్రమండలమును నొసగలేదు. చిట్రగుంట, కావలి, అల్లూరు, గండవరం ఈదిన మున నే చూచెను. గండవరంలో శ్రీకృష్ణదేవాలయ మును హరిజనులకుగా తెరచెను. దేవాయలములోనికి పోవువారు మాంసముభుజించరాదని సలహాయిచ్చెను. అచ్చటనుండి పాలెంవెళ్ళెను. అక్కడనుంచి బుచ్చి రెడ్డి పాలెంవెళ్లెను. అక్కడ స్త్రీలసభలో స్త్రీలు నిరాడంబరముగ జీవించుచు రాట్నమును వడకుచు హరిజనులను తమతో సమానముగ చూచుచుండవలె నని చెప్పిరి. బెజవాడ గోపాలరెడ్డిగారింట విశ్రాంతి

# వార్తలు విశేషములు

దక్షిణ హిందూస్థానపు నగరములలోగల స్త్రీ సమాజము లన్నియు హిందీభాషాభ్యాసమును గూర్చి మిక్కిలి శ్రద్ధతీసుకొనుచున్నవి. పల్లెటూండ్ర యువతులు కూడా హిందీభాషను చులుకగా నేర్చుకొనుచున్నారు. గతసంవత్సరము దక్షిణ హిందూస్థానములో 1486 మంది స్త్రీలు పరీక్షలకు హాజరైరన్న యీ భాగమున హిందీ భాషాభిమాన మెంతవరకు హెచ్చినదో తెలిసుకొనవచ్చును.

*　　*　　*

జనవరినెల 15 వ తేదిని జరిగిన భూకంపమువలన పాట్నాలో 4000 యిండ్లు కూలినవి, 600 మంది మరణించిరి, 400 మంది గాయపడిరి, టెలిగ్రాఫు తీగలు తెగిపోయెను. బీహారురాష్ట్రములో ఇతర రాష్ట్రములకన్న యెక్కువ నష్టముకలిగెను. ఇది వరకు తరచుగా అస్సాంరాష్ట్రమునకే భూకంపముల బాధ యెక్కువగ నుండెడిది. ఇప్పుడు బిహారువంతు వచ్చినదనుకొనుచున్నారు.

*　　*　　*

లక్నోలో 500 గృహములు కూలెను అనేకమందికి గాయములు తగిలెను. కాసీలో 3 నిమిషముల 20 సెకండులు భూకంపముండెను. 30 యిండ్లు కూలినవి 28 మంది గాయపడిరి, ఇద్దరు మరణించిరి. ఢిల్లీలో అనేక దివ్యభవనములు పగులు చూపెను. ఆంధ్రదేశమున విశేష నష్టము కలుగలేదు కాని పెక్కుభాగములలో భూమి యిండ్లు సామగ్రి బడబడ కదలినవి. మొత్తముపైని అనేకు సీతాచలపర్యంతమును ఇది కలిగినది. ఉత్తర హిందూస్థానమున దీనితాకిడి యెక్కువ. కాలము గడచుకొలది ఘోర వార్తలు తెలియుచున్నవి. రెండు మూడు వేలమంది మరణించినట్లు, అన్నులు పంటలు నిర్మూలమైనట్లు తెలియుచున్నది. శ్రీజార్జి పార్వథాముడు నష్టపడిన వారియెడల సానుభూతి తెలుపుచున్నారు. 'రాజ ప్రతినిధి భూకంపనిధి' యను పేరిట విల్లింగ్డను ప్రభువు ఒకనిధిని వసూలు ప్రారంభించెను. పండిత జవహరులాలు, రాజేంద్రప్రసాదుగార్లు ఆనిధికి ధనము వసూలు చేయుచున్నారు. భూకంపనిధికి కరాచీ కార్పొరేషనువారు రు. 1000 లును కలకత్తా మేయరు నిధివారు రు. 3000 లును ముస్లిము రిలీఫుకమిటీవారు రు. 11,700 లును, ఇన్ డేకాంగ్రెసువారు రు. 13,000 లును ఇండియను రెడ్ క్రాసు సొసైటీ వారు 5000 లును కాసీసేవాసమితివారు రు. 1200 లును వసూలు చేసినట్లు తెలియుచున్నది.

*　　*　　*

16-వ తేదిని 40 నిమిషముల కాలముపాటు వైసురాయిగారును 1 గంటసేపు వారి కార్యదర్శిగారును పండిత మదనమోహన మాలవ్యాగారితో మాట్లాడిరి. చాలా ముఖ్యమైన విషయములనుగూర్చి సంభాషించిరని తెలియుచున్నది.

*　　*　　*

మన్యజ్వరమునకును మసూచికమునకును మూల కారణమైన క్రిములను ఇటాలియను గాంబూసియా అను నొక తరగతిచేపలు భక్షించును. ఇట్టివానిని బెంగుళూరు ఆరోగ్యశాస్త్రపరిశోధనాధికారులు తెచ్చి మైసూరురాష్ట్రములో ఆరోగ్య ప్రచారము చేయుచున్నారు. అమెరికా కోటీశ్వరుడు అగు రాకుఫెల్లరుగారు ప్రజల ఆయురారోగ్యాభివృద్ధి కొరకు శాస్త్రముపరిశోధన చేయుటకై విశేషధన మొసగెను. దానిని సద్వినియోగ మొనర్చుటకై పాటుపడుచున్న వైద్యశాస్త్రవేత్తలు డాక్టరు రస్సెలు మొదలగువారు ఈ ప్రయత్నముల చూచి సంతోషించిరి.

# హరిజనాభ్యుదయము

మహాత్ముడు డిశంబరు నెల 23 తేదిని తెల్లవారు జామున 4 గంటలకు మెయిలులో తెనాలివచ్చిరి. స్టేషనుకు 1000మంది పరిసర గ్రామములనుండి కూడవచ్చిరి. వెంటనే కావూరువెళ్లి శ్రీ సీతారామ శాస్త్రిగారిచే స్థాపించబడిన వినయాశ్రమమును రామలింగేశ్వర దేవాలయమును తెరచెను. పిమ్మట భట్టిప్రోలుమీదుగా రేపల్లె 5 గంటలకు చేరిరి. రేపల్లె వాసులు నగలుగాక 800 రూపాయలర్పించిరి. 7 గంటలకు తెనాలి బయలుదేరెను. వర్ష ప్రతిబంధకముగా భట్టిప్రోలులో ఆగిపోయెను. అక్కడ రు 300 ఒసంగబడెను. 8 గంటలకు తెనాలిలో దిగెను. శ్రద్ధానంద హరిజనపాఠశాలకు శంఖుస్థాపనము చేసెను. అచ్చటనుండి నగరప్పాడునకువెళ్లి రామాలయమును హరిజనుల నిమిత్తము తెరచెను.

24 వ తేది ఉదయము మెయిలులో గోదావరి జిల్లాలో ప్రవేశించెను. 12 గంటలకు కాకినాడవెళ్లెను. రామచంద్రపురం ప్రకృతి రామణీయకతను ప్రశంసించెను- రాత్రి 7½ గంటలకు రాజమహేంద్రవరము వచ్చెను. వివిధపక్షములవారు స్వాగత పత్రముల నిచ్చిరి. దేవత శ్రీరామమూర్తి గారి యింట్లో హరిజననాయకులతో ముచ్చటించిరి.

25 వ తేది ఉదయం 8 గంటలకు సీతానగరాశ్రమమును చేరిరి. సాయంత్రము ఆశ్రమములో ప్రార్థనము సలిపిరి. 26 వ తేది ఉదయ మచ్చటనే తిరిగి ప్రార్థనజరిపిరి:

26 వ తేది మధ్యాహ్నము వంగలపూడి వెళ్ళిరి. సీతారామస్వామి గుడిని హరిజనులకు తెరచెను. సుబ్రహ్మణ్యముగారు స్థాపించిన హరిజనాశ్రమమును చూచి యుపన్యసించిరి. తిరిగీ సీతానగరము వచ్చి శివవైష్ణవాలయములను హరిజనులకై తెరచెను. ఖద్దరు ప్రచారకులతో ఇష్టాగోష్ఠిని సలిపెను. 6 గంటలకు పశ్చిమగోదావరిజిల్లా బయలుదేరెను. 9 గంటలకు నిడదవోలు వచ్చి హరిజనులకు ఖద్దరు పంచిపెట్టెను. అక్కడనుంచి తణుకువెళ్లెను.

27 వ తేది మధ్యాహ్నం 10 గంటలకు తాడేపల్లిగూడెమువచ్చెను. 2 గంటలసేపచ్చటనుండి,యేలూరు వెళ్లిపోయెను. తణుకు పాలకొల్లులలో ఘనమగు స్వాగత మొసగబడెను.

28 వ తేదికి విశాఖపట్నమువచ్చి సముద్రతీరమున మహాసభలో ఉపన్యసించెను.

29 వ తేదిని విజయనగరము అనకాపల్లి మొదలగు పట్టణములలో ఉపన్యసించి నిధి వసూలుచేసెను.

30 వ తేదికి నెల్లూరుమండలము వచ్చిరి. నెల్లూరు జిల్లాలో రు 1000 లకు పైగా వసూలయ్యెను. ఇంత మొత్తమే యితర ఆంధ్రమండలమును నొసగలేదు. చిట్టగుంట, కావలి, అల్లూరు, గండవరం ఈదిన మననే చూచెను. గండవరంలో శ్రీకృష్ణదేవాలయమును హరిజనులకుగా తెరచెను. దేవాయలములోనికి పోవువారు మాంసముభుజింపరాదని సలహాయిచ్చెను. అచ్చటనుండి పాలెంవెళ్ళెను. అక్కడనుంచి బుచ్చిరెడ్డి పాలెంవెళ్లెను. అక్కడ స్త్రీలసభలో స్త్రీలు నిరాడంబరముగ జీవించుచు రాట్నమును వడకుచు హరిజనులను తమతో సమానముగ చూచుచుండవలెనని చెప్పిరి. బెజవాడ గోపాలరెడ్డిగారింట విశ్రాంతి

గైకొనిరి. పిమ్మట నెల్లూరులో కస్తూరీబాయి బాలికా పాఠశాలలో ఉపన్యసించి స్త్రీలను నిలువుకోపు చేసెను. స్త్రీల యుత్సాహము నెంతయు ప్రశంసించెను. వారు తిరిగీ నగలు చేయించుకొనరాదని వాగ్దానము చేయుమనెను. వారు అసోసియేషను వారి సన్మానపత్రమును పుచ్చుకొనిన పిమ్మట గూడూరు వెళ్ళి ప్రొఫెసరు రంగాగారి ద్వారా రయతునాయకుల పరిచయము చేసుకొనెను.

30 వ తేదిని వెంకటగిరిపెల్లి హరిజనపాఠశాల భజన మందిరమునకు పునాదు వేసెను. జమఖానా మైదానములో బహిరంగసభ జరిగెను. అక్కడి బహుమానముల నన్నిటిని వేలము వేసెను.

31 వ తేదికి తిరుపతి విచ్చేసిరి. అక్కుర్తి, కాళహస్తి, ఏర్పేడు రేణిగుంట స్టేషనులయొద్ద వేలకొలది ప్రజలు మహాత్ముని దర్శించిరి. తిరుపతి సభకు 20000 జనము విచ్చేసిరి. అక్కడనుంచి రేణిగుంట మీదుగా కడపవెళ్ళిరి. రాత్రి 7 గం-40 ని॥లకు కడప విచ్చేసిరి. అచ్చట మౌనవ్రతము ప్రారంభించిరి. శాంతి నికేతనమునందు విశ్రాంతి గైకొనిరి.

1 వ తేదిని కూడ కడపలోనే విశ్రాంతిగైకొనిరి.

2 వ తేది సాయంకాలము స్వదేశీ ఎంపోరియములో 6 గంటలకు ఉపన్యసించిరి. కడపజిల్లావారు రు 1120 రూపాయీలనొసగిరి .8 గంటలకు గుత్తికి బయలుదేరిరి. 9 గం-10 ని॥లకు గుత్తికి విచ్చేసిరి.

3 వ తేదిని పెద్దవడుగూరులో రు 1116 లు మహాత్మునికర్పింపఁబడెను. పట్టు కేశవపిళ్ల గారి స్మారకచిహ్నముగ అర్పింపఁబడిన హరిజనాశ్రమ విద్యాలయమునకు ఈ ధనము ప్రత్యేకింపబడెను. గుత్తిలో విశేషధనమును అనేక కానుకలును సమర్పింపఁబడెను. పిమ్మట గుంతకల్లు ఉరవకొండ మొదలగు పట్టణములను చూచెను. అనంతపురముజిల్లాలో ఉపన్యసించెను. మొత్తము అనంతపురములో రు 3000 లు వసూలయ్యెను. రాత్రి 1 గం-20 ని॥ లకు హిందూపురము విచ్చేసెను. ఇది ఆంధ్రదేశమున మహాత్ముడు దర్శించిన పురములలో కడపటిది. ఇప్పటికి ఆంధ్రదేశమున వసూలైన నగలుతో సహా రు70000 లకు పైగా ఉన్నది. ఒక రెక్కువ ఒకరు తక్కువ అను భావము పోనిదీ అస్పృశ్యత తొలగదనియు, కేవలము ధనము చే కాక మనములను కూడ ఆంధ్రులు హరిజనులకై అర్పింపవలెననియు ఆంధ్రులకు మహాత్ముడొసంగిన సందేశము.



## మైసూరు సంస్థాన సంచారము

4 వ తేది ఉదయమున 8 గం-5 ని॥లకు మైసూరు సంస్థానములో గౌరిబిదునూరు చేరెను. విదురస్వత్థ, దొడ్డబల్లపూరు తుముకూరు గ్రామములలో మహాస్వాగతము మొసగబడెను. అక్కడనుంచి బెంగుళూరు వెళ్ళిరి. బెంగుళూరులో రు 12000 లును మైసూరు సంస్థానమునందు రు 28000 లును వసూలయ్యెను. 5 దినములు సంచారము చేసెను.

## మళయాళసంచారము

బెంగుళూరునుండి మళయాళ దేశము వెళ్లి తలచ్చేరి, మహీ, బడగర గ్రామములను చూచెను. బడగరలో 17 సం॥లు వయసుగల గోమతీకన్య తన బంగారు ఆభరణముల నిచ్చెను. గాంధిమహాత్ముడు స్వర్గీయ అన్నపూర్ణాదేవిని స్మరణకు తెచ్చుకొని ఆమెవలె స్త్రీలెల్లరుకు నిలువుకోపులిచ్చి,తిరిగీ నగలు చేయించుకొనరాదని సలహాయిచ్చెను. ఆమె హారమును ప్రజ పుడుద్దులకు యిచ్చివేసి తిరిగీ తండ్రిని చేయించమని కోరవని చెప్పెను.

13 వ తేదిని సాయంకాలము కల్లికోటలో స్త్రీల సభలో నుపన్యసించుచు కేరళదేశ స్త్రీలకు గోమతీకన్య చరిత్రచెప్పి ఆమె మార్గము ననుసంచరించవలెనని చెప్పెను. 16 వ తేదికి తిరుచూరువచ్చెను. కేరళములో రు 16000 లును ఒక్క కాలికట్టులో రు 7000 లును లభించెను.

17 వ తేది ఎర్నాకులం వచ్చెను. పిమ్మట అల్వాయి కొచ్చి కూడ వెళ్లెను.

# పుష్పచయము

భార్యాభర్తలు సంతోషముగానుండు టకు గమనించవలసిన విషయములు:—

1. స్త్రీ పురుషుల సంబంధమును గురించి లేని పోని పిచ్చిభ్రమలు మాని వివేకమైన యుద్దేశములు కలిగియుండవలెను. అనగా వివాహముయొక్క ముఖ్యోద్దేశము ఆరోగ్యముగల సంతానము కలిగి యుండుటని గ్రహించవలెను.

2. పరస్పర ప్రేమ తగ్గిపోకుండా జాగ్రత్తపడ వలయును. దంపతులు లోకరి లోపముల నొకరు సహించవలయును.

3. ఒకరియెడల నొకరికుండు అనురాగమును మనస్సులోనే దాచియుంచుకొనుట చాలనకొనక బాహ్యక్రియలవలన కనపరుచుకొనవలెను.

4. ఒకరితప్పుల నొకరు కనిపెట్టుచు వానిని గూర్చి తర్కించుచుండుట మానవలెను.

5. వస్త్రధారణలోను మాటలలోను ఒకరినొకరు సంతోషపెట్టుటకు ప్రయత్నము చేయుచుండవల యును.

6. నీవు ఫలానిపని చేయుము, ఫలానిపని చేయ వద్దుఅని యొకరినొకరు ఆనతులు పెట్టుకొనుట మాని ఎవరిమట్టుకు వారు యోగ్యముగా నడుచుకొనుచుండ వలెను.

7. పూర్వస్నేహితులని యితర స్త్రీ, పురుషు లతో తగని చనువు కలిగియుండరాదు.

8. భార్యాభర్తలు కలసి తమకు వచ్చు ఆదాయ ములో కొంతతీసి దాచవలెను.

9. ఒకరెక్కువ ఒకరు తక్కువ అన్న తార తమ్యములు చూపకుండవలెను.

10. ఒకరి నొకరు పూర్తిగానమ్మి యొంతమాత్ర మును అనుమానమునకు చోటీయ్యకుండవలెను.

11. వీలైనంతమట్టుకు ఇతర బంధువులను నివా సముగా ఇంటిలో పెట్టుకొనకుండవలెను.

12. డబ్బు జమా ఖర్చులు విషయమై సతీపతు లిద్దరి కేమాత్రము దాపరికముండకూడదు.

13. భార్యాభర్త లిరువురు ఎప్పుడును మంచి వాటినే చర్చించుచుండవలెను.

—శ్రీమతి రావి సరసమ్మగారు

* * *

కీ॥ శే॥ శ్రీరాజా రావు రంగయ్యమ్మా రావు బహద్దర్ రాణిగారు.

ఈమె లేటు శ్రీ రాజా రావు గంగాధర రామా రావు బహద్దర్ వారి కోడలు. శ్రీవారి దత్తపుత్రు లగు లేటు శ్రీరాజా వెంకటమహీపతి రామకృష్ణా రావుబహద్దర్ వారి భార్య. ఈమె జననము దుందుభి నామసంవత్సర మార్గశిర బహుళసప్తమి. వివాహము యువనామసంవత్సర వైశాఖ శుద్ధవిదియ. ఈ మహా రాజ్ఞికి ఐదుగురు కుమారులును ఇద్దరు కొమార్తెలును కలిగిరి. వీరందఱును సంతానాది సంపదలతో తుల దూగుచుండఁజూచి యానందించుచు 71వ సంవత్సర మగు యీ శ్రీముఖనామసంవత్సర పుష్య బహుళ ద్వితీయా బుధవారము ఉదయము 8 గంటలకు అనా యాసముగా చెన్నపురియందు పరమపదించిరి. ఈ మెనుగూర్చి మేము ఈమె కుమారులలో జ్యేష్ఠులగు శ్రీ రాజా రావు వెంకటమహీపతి గంగాధర రామా రావు బహద్దర్ జమీందారువారికి కృతియొసఁగిన మా జాతకచర్య పీఠికయందు నెలకొల్పిన పద్యము నిం దుదాహరించుచున్నాఁడను.

సీ॥ నారయప్పారాయ నరవరేణ్యుండు మొద
లగ్గురుసోదరు లేసతీమ
ణికి నలరారుదు రకలంకచరితుండు నూజవీడ్రా
జ్యంబు లేజ మెసఁగ
నేకాతపత్రను శ్రీకర నైవఁ జేలె నట్టి శ్రీశోభ
నాద్ర్యప్పరాయ
నృపమణిపుత్రిక నిచ్చి పెండిలి చేసిరీ దత్తునకుఁ
బృథివీశ్వరునకు॥
తే॥గీ॥ నాపె శ్రీరంగమాంబిక యలఘుచరిత
మణియు నీదంపతులకు నేగురుకుమార
కులు కోమిరెలిరువురును నోలిగలిగి నవ్వ
యంపు నభివృద్ధికిని మూలమగుచు నెలమి॥

—చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి.

## ఆంధ్ర దేశము—స్త్రీలు

(1931 సం॥రం జనాబా లెఖ్ఖల చొప్పున)

| జిల్లాలు | స్త్రీల సంఖ్య | పట్టణములలో | పల్లెలలో |
|---|---|---|---|
| గంజాంజిల్లా ఏజన్సీ | 181597 | — | 181597 |
| గంజాంజిల్లా మామూలు ప్రదేశం | 1112194 | 63478 | 1048716 |
| విశాఖపట్నం ఏజన్సీ | 583111 | 5261 | 577780 |
| ,, మామూలు ప్రదేశం | 1251732 | 134469 | 1117263 |
| తూ॥ గోదావరి ఏజన్సీ | 119734 | — | 119734 |
| ,, మామూలు ప్రదేశం | 851564 | 120700 | 730864 |
| పశ్చిమ గోదావరి | 620729 | 82264 | 538465 |
| కృష్ణా ... | 618504 | 86846 | 531658 |
| గుంటూరు ... | 1006667 | 137310 | 869357 |
| నెల్లూరు ... | 741900 | 61451 | 680449 |
| కడప ... | 465483 | 42617 | 422866 |
| కర్నూలు ... | 504723 | 28327 | 476396 |
| బళ్లారి ... | 476756 | 81149 | 395607 |
| అనంతపురం ... | 510877 | 57191 | 453686 |
| చిత్తూరు ... | 708778 | 41647 | 667131 |
| బంగినపల్లి ఏస్టేటు | 19233 | 2904 | 16329 |
| మొత్తము | 9773582 | 945614 | 8827898 |

ఆంధ్రదేశమునొక్క స్త్రీల జనాభా లెఖ్ఖ టలో అన్ని జిల్లాల మొత్తము 9773582 ఉన్నది. ఈసంఖ్య పట్టణములకు పల్లెలకు విడదీసిన 9773512 వచ్చినది. తేడా 70 మంది. ఇది అంకెలు లెఖ్ఖ టలో పొరబాటు అయియుండవచ్చును.

—శనివారపు సుబ్బారావు

## నారీహరణము

అ॥ భా॥ మహిళాసభవారి మాసికభావము.

నారీహరణమనుమాట చెవినిబడినపు డెంతటి మానవుని హృదయమైన విచ్ఛిన్నము కాకపోదు. ఇట్టి అత్యాచారము లన్నిచోట్లను అపుడపుడు జరుగుచున్నవి. కాని, వంగదేశమువలె విపరీత బాధాకరమగు ప్రదేశము వేరొండు కానరాదు. వంగదేశమందైనను హిందూబాలికలే యిట్టి బాధలకు గురియగుచున్నారు. దిక్కులేక దీనాననలై యల్లాడుచున్నారు. మాతృదేవిరూప ప్రత్యక్ష భగవతీస్వరూపిణియగు స్త్రీజాతియం దింతటి ఘోరమగు అత్యాచారములొనర్చు క్రూరజంతుస్వభావులగు పురుషుల నేమన వలయునో తెలియకున్నది పురుషుల కభ్యుదయ పరంపరలొనర్చు స్త్రీల నింతటి యవమానములకు గురియొనర్చుటకన్న కృతఘ్నత వేరొండుకలదా? దీనవదనలై మానసంరక్షణ మొనర్చుకొనజాలక యల్లాడు భారతనారీమణుల యార్తధ్వనుల నాలించు ప్రభుత్వమా, లేదు. భగవంతునిచే నొసంగబడిన మానసిక స్వాతంత్ర్య మపహరింపబడి మతభ్రష్టలగుచున్న తమ చిన్ని చెల్లెండ్ర మొర లటుంచి తమ స్వాతంత్ర్యము నకై పెనగులాడు భారతయువకుల హృదయములయందీవిషయమునకు స్థానమొసంగబడుటలేదు. పెద్ద పెద్ద సభల బల్లగ్రుద్ది మాట్లాడు యబలాసమాజమున కీ విషయ మొరులతో చెప్పుకొనుట సిగ్గట. రాజసభలలో కఠినశాసనములద్వారా నివారింపదగిన యిట్టి

ప్రధానవిషయమై మహిళాసభలలో తీర్మానము గావించుట హిందూజాతికి కళంకమట. ఇట్టి భావములతో హైందవనారీసమాజముకూడ మూకీభావము వహించుచున్నది. ఇట్లు లోకము మూకీభావము వహించునపు డిక వారికి దిక్కెవ్వరో తెలియకున్నది. నిస్సహాయలై యపహరింపబడు నిర్భాగ్యనారీసమాజము నరికట్టుభాగ్య మీ యభాగ్యభారతమున కెన్నడు చేకూరునో కదా!

వంగదేశపు నారీరక్షాసమితి సెక్రటరిగారగు సనత్కుమారరాయ్ చౌదరీగారు పోలీసువారి వార్షికరిపోర్టునుండి, అపహరింపబడిన స్త్రీలసంఖ్య నిట్లు ప్రకటించిరి. "1931 వ సం॥రములో ఇండియన్ పీనల్ కోడ్డు 366 వ శిక్షను ననుసరించి 212 కేసులున్నూ, 354వ శిక్షను ననుసరించి 354 కేసులున్నూ 1932 లో శి. 366 ను ననుసరించి 234 కేసులున్నూ, 354 వ శిక్షను ననుసరించి 539 కేసులున్నూ తీర్పులు చెప్పబడినవి. ఇట్లు దినదిన మభివృద్ధిగాంచు నీ యత్యాచారముల కవరోధమొనర్ప గవర్నమెంటువా రెట్టి యేర్పాట్లు గావించుచున్నారో తెలిసికొనుటకై యెవరి హృదయము తత్తరపాటు చెందదు?

ఈవిషయమై డిసెంబరు 4 వ తేదీని డేవిడ్ గ్రేన్ ఫెల్ గారు కామన్సుసభలో "హిందూబాలికాపహరణమును వారిపై జరుగు పశు సంబంధమగు నత్యాచారములసంఖ్యయును దినదిన మభివృద్ధిపొందుచుండుట చూచి భారత గవర్నమెంటువారు దానికి ప్రతీకారమొనర్ప నెట్టి యేర్పాట్లొనర్చుచున్నారు?" అని ప్రశ్నించినపుడు గవర్నమెంటు ఇండియా మంత్రియగు ఆర్. ఎ. వాట్లరుగారు "వంగదేశమున జరుగు నీ యత్యాచారములనుగూర్చి పత్రికలలో తరచు చూచుచుండుటచే వారి దృష్టి అవైపునకు మరలినది కాని, దినదిన మభివృద్ధిగాంచుచున్నట్లు సిద్ధాంతమొనర్పబడియుండలేదు" అనిరి. అవాడే వంగరాష్ట్ర శాసనసభయం దొకసభ్యు డీ విషయముపై మాట్లాడినపుడు "స్త్రీలయం దత్యాచారములు జరుగుచున్నవి. కాని అవి దినదిన మభివృద్ధిగాంచుచున్న దను విషయము సంఖ్యద్వారా ప్రమాణము చూపలే" దనిరి. కాని, పోలీసువారి వార్షికరిపోర్టును పరిశీలించునంతటి శ్రద్ధయైనను తీసుకొనజాలకపోయిరి.

ఇక మహిళాసభల విషయమై పరిశీలింతము. డిసెంబరు 30 వ తేదీని కలకత్తాలో జరిగిన అఖిల భారతి మహిళాజనసభలో శ్రీమతి సరళాభాయి సర్కారుగా రుపన్యసించుచు ఇది ప్రధానసమస్యయనియు, నీవిషయమై తగుయేర్పాట్లను గావించుట ముఖ్యమైనదిగ తలంచవలయుననియు చెప్పియుండిరి. అయిన నీవిషయము మా సభలో చర్చించి తీర్మానము నను తేలేకపోయిరి. అభాగ్యలు, అక్షరశూన్యలగు వారికి ప్రతినిధురాండ్రమని చెప్పుకొను అఖిలభారతనారీసమావేశమందే ప్రాణప్రదమగు నిట్టివిషయము జారవిడచినప్పు డిక నీ మహిళాసమావేశమువలన జరుగు ఫలితములేవియో తెలియకున్నది. సిగ్గు, అవమానము మనోవేదనను గలిగించు నిట్టి కార్యముల కవరోధము గల్పించి దేశమును మేల్కొల్పవలసిన భార మీ మహిళాసభకు లేదా? వీరి తీర్మానములలో, దేశీయులయొకుట ప్రత్యక్షముగ కన్పించుచు సత్యమైయున్న విషయములను చేర్చి యెదుటబడి ప్రతిఘటించుట నేర్చుకొనజాలనంతవరకు, మహిళాసభలవలన రవంతయైన లాభము కలుగజాలదు. కావున మున్ముందచట మహిళాసమావేశములు జరుగుచున్నను ప్రథమముగ నీ విషయమై చర్చించి తమ మనోవేదనను వెల్లడించుచూ కార్యక్రమమునకుదిగి స్త్రీజాతి నుద్ధరించవలసినదని మహిళాసభలను హెచ్చరించుచున్నాము.

—తోలుగంటి వెంకట్రామయ్య చౌదరి గారు

మహాత్ముఁడు కాలికట్టులో స్త్రీల సభలో నిట్లుపన్యసించెను:—

ప్రియ సోదరీమణులారా,

నన్ను చూడఁగనే నేను మీ నగలెల్ల వొలిపించి తీసుకొందుననియో, మీకే వొలిచియిచ్చివేయవలెనను బుద్ధి పుట్టవచ్చుననియో ఒక భయము మిమ్మెల్లరి నలముకొనినట్లు నాకు తోఁచుచున్నది. మీలోఁ గొందఱిప్పుడే తమ చిన్ని చిన్ని నగలను వొలిచి వేఁజూచుచున్నారు. నేను మీ కిప్పుడు గోమతి యను నొక చిన్నిపడుచు వృత్తాంతము చెప్పెదను. ఆమె నీయుద్యమమున నే బడగరలో కలసుకొంటిని. అచ్చట సభలో స్త్రీలెల్లరును తమ నగలను కొన్నిటిని కాని, లేక వారి దయయున్నచో అన్నిటిని కాని ఇచ్చివేయవచ్చునని కోరినప్పు డామె తన చేతులనున్న రెండు సుందరమైన గాజులను తొలుదొల్త నిచ్చెను. ఆమె వయస్సు 20, 21 సంవత్సరములున్నను చిన్నిపిల్లవలె అమాయకమైనది.

ఆ రెండు గాజులతో నేను పరమానందమునందితిని కాని ఆమె అందలేదు. మెడలోని కంటె నిచ్చివేసెను. అంతటితో ఆగుననుకొంటిని. ఆమె చేతులు చెవులమీదికిపోయి చెవిపోగులను విప్పివేసెను. నేను ఆ చెవిపోగులను పుచ్చుకొంటిని. నారోమములు పులకరించెను కాని నా భావముల నామెకు తోఁచనీయలేదు. ఇట్లామె తన సర్వాభరణముల నిచ్చుటకు స్వతంత్రురాలేమో, తన తండ్రియనుమతి గైకొనెనేమో అడిగితిని. తన తండ్రి నాయొద్ద నేయున్నాడని చెప్పి నా వేదికపైని నా ప్రక్కన నిలబడి వినతిపత్రములను నగలను జాగ్రత చేయుచున్న ఒక మహనీయుని నామె నాకు చూపెను. అతని తండ్రి అంగీకరించినట్లే. ఇంతటి త్యాగమునకు బదులుగా నావద్దనుండి ఆమె కోరినదేమి? నా సంతకము. నేను హిందీభాషలో నా సంతకము చేకాక, ఆమె త్యాగము బంగారముకంటెను నామెకు ప్రశస్తతరభూషణ మను వాక్యమును వ్రాసియిచ్చితిని. ఆమె అపరిమితానందము నందెను. తిరిగి యెన్నఁడును తండ్రిని నగలు చేయించుమనని నా కామె వాగ్దానమొనర్చెను. మలయాళకన్య విషయమున నిది యొక ఆశ్చర్యకరవిషయము కాదు; ఏలనన, మలయాళకన్యలు స్వతస్సిద్ధముగా నిరాడంబరమూర్తులు. వారినిగూర్చి నా కిట్టి యభిప్రాయ మేర్పడియున్నది.

ఒడలుఁ బులకరింపఁజేయు ఈ కథతో ఇటువంటిది మరియొక కథను తెలిపెదను. ఇప్పటికి పదేళ్ల క్రిందట ఆంధ్రదేశములో నొక బాల; వివాహిత; ఒక నాటకశాలలో స్త్రీల సభ నే నిట్లే నగలిమ్మని కోరితిని. నగలిచ్చినవారిలో నామెయే ప్రప్రథమ. ఆమె నగలు కొన్ని సాధారణమైనవేయైనను ఆమె మెడలోని చంద్రహారము మిక్కిలి బరువైన బంగారు ప్రోవు. ఇతర నగలనుగూర్చి నే నిప్పుడు వర్ణింపజాలను. అయ్యో! ఆమె యిప్పుడు మఱి యీ భూతలమున లేదుగదా! ఆమె తలిదండ్రులు శ్రీమంతులు. కావలసినచో నగలు చేయించగలరు. కాని ఆమె చేయించుకొనలేదు. హరిజనోద్ధరణమువంటి పవిత్రోద్యమమునకు తమ నగలెల్ల నర్పించిన అన్నపూర్ణమ్మ, గోమతీ ఇరువురును ధన్యలు. వా రొసగిన నగలకంటె వారికి భూరితరమగు పుణ్యము లభించినది. మీరు మీ హృదయములను పవిత్రములుగా చేసుకొని హరిజన బాలబాలికలను మీ సోదరసోదరీమణులవలె ఆదరించవలెను. మనము చాలకాలము నుండి మతముపేరట వారి నణగద్రొక్కియుంచితిమి. నేఁ డీమాత్ర ముపకారముచేసినచో మన పాపము కొంచెమైనను నశించును. మీరు చిన్ననగలే కానిండు, కాని పెద్దనగనే కానిండు, అస్పృశ్యతను తొలగించవలెనను దృఢసంకల్పముతో నే యొసంగెదరుగాక! ఇట్టి సర్వసామాన్యమైన యథార్థధర్మమును గ్రహించు బుద్ధిని పరమేశ్వరుడు మీ కనుగ్రహించుగాక! ఇకను మీ రేమియీయఁగలరో యీయవచ్చును. నగలైననుసరే, వెండినాణెములైననుసరే, బంగారు సవరములైననుసరే, నోటులకట్టలైననుసరే."

# గ్రంథవిమర్శన

## మదరాసు సహకారసంఘముల ఆక్టు (1932 సం॥ నెం 6 రు):—

డెమ్మీసైజు 166 పుటలు, వెల రు. 1-8-0లు. ఇందు సహకారసంఘముల ఆక్టు ఆంగ్లభాషలోను ఆంధ్రభాషలోను కూడా ప్రకటింపబడియున్నది. ప్రాత ఆక్టునకు క్రొత్త ఆక్టునకు గల భేదములను తెలుపు దీర్ఘమగు ఉపోద్ఘాతముతో రాణించుచున్నది. ప్రతి సెక్షనునకును విపులమగు వ్యాఖ్యానము కలదు కనుక యెట్టివారికిగాని వకీలు సహాయ మవసరము లేకుండనే గ్రంథము సులభముగ అవగాహనము కాగలదు. సరియైన సహకార విజ్ఞానము నిట్టి గ్రంథములద్వారా నెఱుంగక సంఘములను నడుపుటకు పూనుకొన్నచో అనేక ప్రమాదములు కలుగుట కాటంక ముండదు కనుక ప్రతి సహకారసంఘమును సహకారియు దీనిని తెప్పించుకొని పఠించి మరీకార్య క్రమమునకు గడంగుట ఉత్తమపద్ధతి. దీనిని హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయ ప్రకాశకులగు (కపిలేశ్వరపురం తూర్పుగోదావరిజిల్లా) శ్రీయుత చాగంటి శేషయ్యగారు రచించిరి.

## మదరాసు లోకలుబోర్డుల ఆక్టు (1920 సం॥ నెం 14 రు):—

డెమ్మీ సైజున 451 పుటలు లోకలుబోర్డుల చరిత్ర ముపోద్ఘాతములో సంగ్రహముగ వివరింపబడినది. ఆక్టుయొక్క సెక్షనుల కన్నింటికి విపులమగు వ్యాఖ్యగలదు. స్థానిక సంస్థలు రాష్ట్రీయ సంస్థలకు పునాదులై శిక్షణరంగములై యున్నవి. వానిని నిర్వహించుటయందు మన గ్రామీణు లత్యుత్సాహమును శ్రద్ధను చూపుచున్నారు. ఇట్టియెడ చట్టమునుగూర్చిన సమగ్రమగు జ్ఞానము తేటతెనుగులో ప్రకటింపబడుట అత్యవసరము. ఇట్టివిజ్ఞానము, ప్రస్తుతము బోర్డుసభ్యులు వోటర్లలో రేగుచుండు స్పర్థలు కలహములు అజ్ఞానము మొదలగు వానిని చల్లార్పగలదు. దీనిని ప్రకటించి శ్రీయుత చాగంటి శేషయ్యగారు అశేషాంధ్రజనులకృతజ్ఞతను జూఱగొనుచున్నారు. వెల రు. 4-0-0 లు మాత్రము ఆక్టును సంబంధించి నంతవరకు హైకోర్టు తీర్పులు సహా అందందు ఉదహరింపబడినవి. కపిలేశ్వరపురము వందలి హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయమువారు ప్రకాశకులు.

## మదరాసు లోకలుబోర్డు ఆక్టు (నిబంధనలు)

డెమ్మీసైజు 216 పుటలు వెల రు. 2-0-0. పై ఆక్టును గూర్చి అప్పుడప్పుడు ప్రభుత్వమువారు ప్రకటించు నిబంధనలు మొదలగునవి బాగుగా తెలియనిదే పై ఆక్టు అమలు జరిపించుట కష్టము. ఈ విషయమును గమనించి శ్రీ శేషయ్యగారు వీనినికూడ తేట తెలుగులోనికి తర్జుమాచేసి విపులమగు వ్యాఖ్యలతో ప్రకటించినారు. ఈ రెండు గ్రంథములును ప్రతి పంచాయతీ ఆఫీసునందును ప్రతి వోటరు వద్దనుకూడ ఉండదగినవి. ఆంధ్రులెల్లరును ఈయవకాశమును తీసుకొని వీనిని పఠించి మంచి రాజకీయ జ్ఞానమును లోకజ్ఞానమును నలవరచుకొందురుగాక! ఇదియును పై గ్రంథనిలయమువారి వల్లనే ప్రకటితము. ఈ మూడుపుస్తకములును కాలికోబైండుపై నిర్దుష్టమగు నచ్చులో నున్నవి.

## డివేలరా:—

క్రౌనుసైజు సుమారు 220 పుటలు వెల రు. 1-0-0 గ్రంథకర్త శ్రీయుత గద్దె లింగయ్య చౌదరిగారు. స్వతంత్ర ఐర్లాండు ప్రభుత్వ సంస్థాపకుడగు సుప్రసిద్ధవీరుని ఆబాల్యచరిత్రము. విప్లవవాదికాక, బహిష్కారవాదికాక శాస్త్రసమ్మతమైన ఆందోళనము సల్పిన డివేలరాగారి సిన్ఫేను చదరంగపుయెత్తులు

ప్రతిదేశభక్తుడును పఠించి గ్రహింపఁదగినవి. కృష్ణా జిల్లా ఎలమఱ్ఱు గ్రామములోని ఆదర్శగ్రంథ మాలవారి అయిదవ సుమము.

హరిజన సముద్ధరణము.:—

క్రౌను సైజు 16 పుటలు గ్రంథకర్త శ్రీయుత అత్తిలి సూర్యనారాయణగారు, హరిజనకవి, మునిసిపలు కౌన్సిలరు, ఎక్సైజు మెంబరు, ఏలూరు. హరిజనులను గూర్చియు మహాత్మునిగూర్చియు పాటలు పద్యములు గలవు. పాటలమెట్లు మిక్కిలి చక్కగా ఉండును.

అమరావతి:—

క్రౌను సైజు 20 పుటలు. వెల రు. 0-4-0. గ్రంథకర్త శ్రీయుత కర్లపాలెం కుటుంబశాస్త్రిగారు బి. ఎ. ఏతత్క్షేత్రపు గ్రామపునర్నిర్మాణ సూపరువైజరుగా నియమింపబడిన కవిగారు చారిత్రక, శిల్పక, మతవిషయకముగ మిగుల ప్రసిద్ధిగన్న అమరావతిలోని చాముండికేశ్వరునిమీద వ్రాసినగీతపద్యముల శతకము. కవిత్వము సులభము మనోహరము.

స్వదేశ సంస్థానములు:—

క్రౌను సైజు 105 పుటలు. ఫెదరు వైటు పేపరు చక్కనిఅచ్చు, వెల రు. 0-8-0 లు మాత్రమే. గ్రంథకర్త శ్రీయుత నార్ల వెంకటేశ్వరరావుగారు. ప్రకాశకులు నార్లవారు, కవుతవరం (పోష్టు) కృష్ణజిల్లా. ప్రస్తుత సంస్థానాధీశుల అవిద్య, దుశ్శిక్షణ, అసంఖ్యాకవివాహములు, దురంతవ్యభిచారము అతిదుర్వ్యయము, అన్యాయ పరిపాలనము, ప్రజలకష్టములు మొదలగు విషయములను అనేక సుప్రసిద్ధభారతీయ పాశ్చాత్యాధికార విశేషజ్ఞుల వ్రాతల సాక్ష్యములతో సహా యిందుదహరింపఁ బడినవి. బ్రిటిషు ప్రభుత్వమువారు తగుచర్య తీసుకుని ప్రభువులకు బదులు ప్రజలకు రక్షణ చట్టములను ప్యాసుచేయింపకున్నచో అవి ప్రస్తుతమున్న అరాచకమునకు తోడు విప్లవములకుకూడ పాల్పడి యావద్భారత శాంతికిని భంగము కలుగచేయక మానవని యీగ్రంథమువలన సుస్పష్టమగును.

గోపాలకృష్ణుని చాటువులు:—

క్రౌను సైజు 40 పుటలు. చక్కని దళసరికాగితములు. అందమగుఅచ్చు, బెజవాడలోని శ్రీమదాంధ్ర విద్యాపీఠ గోష్ఠివారిచే ప్రకటితము. పీఠవిచారణకర్తగారి 10 పుటల యుపోద్ఘాతమును అత్యంతమనోహరమై యున్నది. సుప్రసిద్ధదేశసేవకుడు, రామభక్తుడు, కళాకోవిదుడు, వక్తయైన కీర్తిశేష గోపాలకృష్ణయ్యగారిని ఆంధ్రదేశముననేగాక యావద్భారతఖండమునను పూజింపనివారు లేరు. పాశ్చాత్యవిద్యావిశారదుడై మూర్తీభవించిన అధునాతనాంధ్రత్వముయొక్క కరుడునై అతను ఆంధ్రహృదయముల నెల్ల జూఱగొనినాడు. అతని చాటువులేమి, ఉపన్యాసములేమి, విజ్ఞాన విమర్శనాతరంగములు కాని మాటలప్రోవులు కావు. హాస్యకళా చక్రవర్తియైనను అతని మనోహరహాస్యముతో అత్యంతగాంభీర్యమును అనంతసత్యములును అంతర్భూతములై యున్నవి. అతని సంస్మరణము యథార్థాంధ్రత్వ ప్రతిష్ఠాపనకు మూలకందము కాకమానదు. అతని చాటువులు కొందరు తలచునట్లు కేవల వ్యక్తిపరియాచకములుకాక మనోహరములగు ప్రశంసలనియే మేము భావించెదము. శూరునివలె పరిస్థితుల నెదుర్కొని, ధీరునివలె విమర్శించి వీరునివలె మరణించుటయే ఆంధ్రలక్షణమైనచో అతనిని మించిన ఆంధ్రులు అరిదియని చెప్పవలెను. అతని వ్రాతలనెల్ల ప్రకటింపదలచిన విద్యాపీఠము వారికి ప్రోత్సాహ మీయదలచుకొన్న ఆంధ్రసర్వులెల్లరును ఈ చిన్నిపొత్తమును వేనవేలు ప్రతులుకొని ఆంధ్రదేశమునం దంతట విరజల్లి తగిన సహాయము నొనరింతురనియే విశ్వసించుచున్నాము. బెజవాడలోని సత్యనారాయణపురములోనుండు విచారణకర్తగారివద్ద ప్రతులు వెలకు లభించును. ఏజంట్లును గ్రంథవిక్రేతలును త్వరపడి ఆర్డరులు పంపుదురుగాక. ఇందు రంగనాథప్రబోధమను సంస్కృత

శ్లోకాష్టకము, శ్రీరామలింగేశ్వరస్వామి, శ్రీరామ చంద్రుడు, ప్రతిమారాధన, మహాత్ముని యుపవాసము, తన్నుగూర్చి, సాక్షాత్ ఆపదేపక్ నాయకులు, ఆంధ్రవాణీవిలాసము, ఆంధ్రకళలు, గుంటూరుపురము, గుంటూరివారు, ఆంధ్రసభాధ్యక్షులు, టంగుటూరి ప్రకాశపంతులుగారు, ప్రొఫెసరు రాధాకృష్ణయ్యగారు, శ్వేతరీతులు, చదువుమోసైనవాలు, బందరుసభలు, రొంకిపాటలు మొదలగువానిపై చక్కని పద్యములు, పాటలు గలవు. మచ్చు కొక్క పద్య మిందుదహరించుచున్నాము.

"నయూచేరిఫారమ్—నవాస్టీంఫ్రేముమ్
నకౌన్సిల్ నతుప్రీవికౌన్సిల్ పదంవా
స్వరాజ్యార్తి హన్తాంగ్లరాజ్యేనియన్తా
ఫరంగీ ఫిరంగీ దృగంగీకరోతు".

కరుణలేని కమతము:—

క్రౌనుసైజు 15 పుటల చిన్నికథ. శ్రీ స్వామి తత్త్వానందప్రణీతము. ప్రకాశకులు శ్రీయుత ధూళిపాటి కోటయ్యగారు, అనంతవరము, తెనాలి తాలూకా. వెల అమూల్యము అనగా ఉచితము. కార్మికసంఘప్రచురణములలో మొదటిది. హరిజన పాలికాపులు సవర్ణరైతులయొద్ద ననుభవించు కష్టము లిందు చిత్రింపఁబడినవి. రైతు జానకయ్య చాలా మంచివాడే కాని హరిజనులయెడ నుండవలసిన కరుణలేని కారణమున పాలికాపుకోటనియొక్క కుటుంబమెల్లయు నశించినది. ఇట్టి గ్రంథములు ప్రస్తుతపు హరిజనులయెడ సవర్ణులు చూపించు కరుణలేనితనమును తొలగించి వారిని బాగుపరచుట కెంతయు తోడ్పడును. ఈ ప్రచురణము లెల్లయు నుచితముగ నొసగబడును గనుక ప్రకాశకులు కోరినట్లు ఆంధ్రులెల్లరును విరివిగ తెప్పించుకొని విషయమును గ్రహించి ఆచరణలో పెట్టుదురు గాక!

క్రొక్కాలువ మెఱుగు:—

క్రౌనుసైజు 64 పుటలు. ఫైనరువైటు పేపరు. చక్కనియచ్చు. వెల రు. 0-4-0 లు మాత్రము. అనంతపురము కవికుమారసమితికి చెందిన వెల్లాల ఉమామహేశ్వరరావు బి.ఏ., పాళ్లూరి సుబ్బరాచార్యుడు బి.ఏ., మరం వాసుదేవమూర్తి బి.ఏ., గార్లచే రచింపఁబడిన అనేక పద్యమాలికలతో గూడిన ఖండకావ్య గ్రంథము. శ్రీయుత రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు సాహిత్యమున ఖండకావ్యముల స్థానమును గూర్చియు, ఈ గ్రంథములోని పద్యముల గుణాగుణములనుగూర్చియు చక్కని విమర్శనము వ్రాసినారు. పద్యములు నవరసములతోఁ జెప్పఁబడి ఒక నూతనత్వము నొందుచున్నవి.

జమీందారీ రైతుసమస్య:—

డెమ్మీసైజు 40 పుటలు. భరతదేశములో సగమునకు మించియున్న జమీందారీభూములు, ఆ జమీందారీల ఉత్పత్తి, వారి హక్కు బాధ్యతలు, ప్రజల హక్కులు, ఇబ్బందులు, అవస్థలు, వీనికి సంబంధించిన ప్రాతచట్టములు, వాని లోపములు, చేయవలసిన సవరణలు మొదలగు విషయములెల్లయు సంగ్రహముగ నిందు తెలుపఁబడియున్నవి. జమీందారీ రైతులకును ఇతర రైతులకునుగూడ మిక్కిలి ఉపయోగించు గ్రంథము. వెల రు. 0-4-0.

మధుకళ:—

క్రౌనుసైజు 42 పుటలు. వెల రు. 0-2-0. గ్రంథకర్త శ్రీయుత మంగిపూడి వేంకటశర్మగారు. 'భారతి'నుండి పునర్ముద్రితమైన చక్కని ద్విపద కావ్యము. అచ్చ తెనుగుపదముల పుట్ట. అతిసులభము. సవతులకయ్యములోను మగని పక్షపాతముతోను, వెలతల తగవులకులతోను జీవకళలొలుకుచు మాటుప్రోవై ప్రతిపుటయు కలకలలాడుచుండును. భాషాభిమానులు, సాహిత్యకళాభిమానులు, ధర్మాభిమానులు, ఎల్లఱును చదువవలసినది. ప్రతులు పశ్చిమగోదావరిజిల్లా నెడదవోలులోనున్న కవిగారివద్ద వెలకు లభించును.

గ్రంథస్వీకారము:—

ప్రేమాంజలి, శుభోదయము, కాలేజీగర్లు, గానకళాచంద్రిక!

భారతజాతీయ ఋణములు.




## విలేఖరుల కొకమనవి.

[గృహలక్ష్మికి వ్యాసములు, పద్యములు, గేయములు వార్తలు మొదలగు వానిని పంపు సహృదయులెల్లకు నొకమనవి. పత్రమున కొక ప్రక్కనే, సిరాతో, విడివిడియక్షరములుగా లిఖించుటయే గాక వ్యాసాంతమున సంతకము సంపూర్ణముగ విలాసముకూడ వ్రాయవలెనని వేడుచున్నాము. లేనియెడల నట్టివానిని ప్రకటించుటయు కష్టము, ప్రకటించినచో వారికి పంపించగల్గుటయు దుస్సాధ్యము. గృ॥ సం॥]

### మఱుపుట్టువు:—

1866-లో ప్రారంభమై 1933-లో పునః ప్రారంభమైన భారత జాతీయ సాంఘిక మహాసభయొక్క ఉపన్యాసములను తీర్మానములను, వేఱొకచో ప్రకటించినాము. పూర్వపు సంఘ సంస్కర్తల ప్రయత్నములు సఫలీకృతములైనవని కొందరును, ఆపనులు పూర్తి కాకున్నను పూర్తిచేసుకొనుటకు వేలువేలు సంస్థలు లేచి పనిచేసుకొనుచున్న వను కారణమున కొందరును, సాంఘికతత్వములు పెచ్చురేగుచున్న ఈ దినములలో ఇట్టి సభను పునఃప్రారంభించినచో మఱింత విషమ భావములు దేశములో వ్యాపించ వచ్చునన్న కారణమున కొందరును ఈపునః ప్రారంభవ మహోత్సవమునకు సుముఖులు కాకుండిరి. అయినను మదరాసులో సమకూడిన మితవాద మహాసభానాయకుల ఆగమనమును వృథా పోనీయక ఉపయోగించుకొంద మను తలంపునను; వివిధ రూపములుగాను రాష్ట్రీస్థములుగాను చెదరియున్న సంస్కార సంచలనముల నెల్ల నేకసూత్రము మీఁద నడిపించు తలంపునను; వివిధరాష్ట్రములలోని సంస్కారాభిమానులు సంవత్సరమున కొకసారియైనను ముఖాముఖిని కలసి వారివారి రాష్ట్రముల స్థితిగతులను, నిర్వహించిన పనులను, అవలంబించవలసిన మార్గములను గూర్చి సంప్రశించుకొన్నందువలన విశేష ప్రయోజనము కలుగగలదను తలంపునను; అనేక సంస్కారాభిమానులు పట్టుపట్టి దీనిని పునః ప్రతిష్ఠించుట యెంతయు ప్రశంసనీయము.

ఈ సందర్భమున ప్రాతసభలు నిర్వహించిన పనులను రానున్న సభలద్వారా నిర్వహింపఁ దలచుకొన్న పనులను మనము కొంచెము పరిశీలించితిమేని సాంఘికసేవ సాంఘిక సభలు అనిన పూర్వ మెట్టిఅభిప్రాయము పెట్టుకొని పెద్దలు పనిచేసిరో, ఇప్పటినుంచి ఎట్టి అభిప్రాయము పెట్టుకొని పని

చేయనున్నారో, అనగా ఆ పదముల అర్థమెంత విశాలముగ మాఱినదో మనకు ఊహించుకొన సాధ్యము. పూర్వము సముద్రయానము, పెండ్లియాడు హెచ్చించుట, విధవా వివాహము, స్త్రీల కున్నతవిద్య, నిమ్నజాత్యుద్ధరణము మొదలగు కొన్ని సమస్యలు సభలలో ప్రధానచర్చలకు వచ్చుచుండెడివి. వీని అన్నిటి మొడలను ఇప్పటికి, పూర్వపు సభల ఫలితముగానే అనుకొనవచ్చును, సంపూర్ణ సుముఖతక గాకపోయినను మూఢవిముఖత తొలగినది. తిలకు, మాలవ్యా, ప్రభృతులే సముద్రపు గాలి నాఘ్రాణించి పాశ్చాత్య సీమలను త్రొక్కి మతభ్రష్టులు కాకుండా మరలివచ్చినామనుకొను చున్నారు. స్త్రీల కుచితవేతనములను నెఱిలనుచూపి బడులలోని కాకర్షించవలసిన గతులుతప్పి, వారు జీతములు కట్టుకొని చదువుకొందుమని దరఖాస్తులు పెట్టినను అవకాశములు దొరకని స్థితులుకూడ ఏర్పడుచున్నవి. తిరువాన్కూరు వంటి సంస్థానములో పురుషుల యుద్యోగములను పడద్రోసి స్త్రీలు ఉన్నతోద్యోగములను నిర్వహించుచున్నారు. విధవా వివాహములను నిరోధించ గడగువారు లేరు. బాలికల వివాహవయస్సు దానంతటసదే హెచ్చుచున్నది. ఒక్క దేవాలయ ప్రవేశ సందర్భమున తప్ప శుద్ధ సనాతనులుగూడ హరిజనోద్ధరణమునకు సాయపడుచునే ఉన్నారు. ఇప్పటికివి వేదికలపై గంభీరోపన్యాసముల నిచ్చుచు స్వవిషయమున జారిపోవు సంస్కారులు పెక్కుఱున్నారు కాని, ఆచరించువారి సంఖ్యకూడ హెచ్చుచుండుట గమనించ తగ్గదే. పూర్వ మెప్పటికన్నను కాంగ్రెసు సంస్థయు కాంగ్రెసు నాయకులును సాంఘిక విషయములలోకూడ చాల విశాలభావములను కలిగియుండుట ప్రశంసనీయము.

పూర్వము సంఘసంస్కార ప్రయత్నములొక్క హిందూ సంఘమును గూర్చియే చేయబడుచుండెను. నేడు భారత దేశీయులందఱు నొక్కజాతి యనియు వారందరికి ననుకూలించు సంస్కరణములు చేయవలయుననియు వివిధజాతులు మతములవారు కలిసి సమాన సూత్రముల నవలంబించుచున్నారు. ఆర్యసమాజమువారు రామక్రిష్ణ మతమువారు అనీబిసెంటు వివేకానంద ప్రభృతులు మహాత్మాగాంధిగారు మొదలగువారిట్టి యుద్యమములను నడిపించుచుండుట చేత ఈ ఆందోళనమున కొక ఆధ్యాత్మిక పారిశుద్ధతకూడ చేకూరినదని చెప్పవచ్చును. ఇప్పుడు దేవాలయ ప్రవేశము, వివాహవిచ్ఛేదము, స్త్రీవారసత్వము, మద్యపాననిషేధము, ఆరోగ్యప్రచారము, కార్మికులవసతి గృహములు, గ్రామ పునర్నిర్మాణము, వయోజన విద్యాప్రచారము మొదలగు విషయములు ప్రధానముగ సంఘోద్ధారకుల దృష్టిపథమున రాణించుచున్నవి. సాంఘిక విద్వేష భావములను నిర్మూలించుట సంఘసంస్కారుల ప్రథమ ప్రయత్నమై యున్నదనుట కాటంకములేదు.

హిందూసంఘ సంస్కార విషయమున సనాతనులకును సంస్కారులకును విరోధ

ములు హెచ్చుచున్నవనుట స్పష్టము. శ్రుతి స్మృత్యాదుల అధికారమావశ్యకమని యొకరును, భావస్వాతంత్ర్యమే ప్రధానమని మఱియొకరును పిడివాదములు పట్టియున్నారు. రజస్వలానంతరవివాహములు పాపమని శారదా చట్టమును మీరువారొకరును తత్పూర్వ వివాహములు ఘోరపైశాచికములని తలచి అట్లు మీఱువారిని శిక్షింపఁ దొరకొనువారొకరునునై హిందూసంఘము రెండు ఖండములుగఁ జీలుచున్నది. ఈ అపాయమును సభవారు గుర్తించిరి. సి. వి. కృష్ణస్వామి అయ్యరుగారు తమ ఆహ్వానసంఘాధ్యక్ష కోపన్యాసములో ఈభేదమంత దుస్తరమైనది కాదనియు, ఉభయపక్షములవారును నొక్కొక్కమెట్టుదిగుచో కలిసి పనిచేయుటకవకాశము కలదనియు, శాస్త్రములమీఁద యుద్ధముచేయ నక్కరలేకయే హరిజనులకు దేవదర్శన భాగ్యము నిరోధించకయే రెండు పక్షములును చేతులుకలిపి దేశాభివృద్ధికి పాటుపడుట సాధ్యమనియు తమ యభిప్రాయమును చెప్పినారు. హిందూ సంఘము యొక్క విశ్వాసమునకు పాత్రుడయిన మాలవ్యాగారు వివాహవయస్సు 11 లేక 12 సంవత్సరము లుండవలెనని చెప్పినప్పుడు సంస్కారులలోని వితండవాదు లతని సూచనను నిరాకరించి సామరస్యమును కూర్చుకొను అవకాశములను పోగొట్టిరనియు, హరిజన దేవాలయ ప్రవేశ సందర్భముననైన నట్టి అవకాశము నుభయపక్షములవారును గోల్పోరాదనియు సలహా యిచ్చుచున్నారు. రాజకీయ సమస్యల పరిష్కారము నిమిత్త మొడతెగని పట్టుదలతో గుండ్రబల్ల చుట్టును కూర్చొని ప్రభువులతో చర్చలుసేయుటకు వినుగఁగొనని మితవాదసాంఘిక మహానాయకులు, అంతకంటెను తక్కువప్రధానములు కాని సాంఘిక సమస్యల సందర్భమున పండితులము పీఠాధిపతులము మఠాధికారులము అనుకొనువారితో గుండ్రబల్ల చర్చలు కొన్ని సాగించినచో కొంతఫలిత మేర్పడునేమో కాని, ఉభయపక్షములును తమ పిడివాదములు వదలక సాంఘిక విద్వేషములను వృద్ధి చేసిన పెనునేరమునకు భాజనులగుదురేమో అనుకొనుట కవకాశములు మాత్రము కనిపించుచున్నవి. అఖిలభారత సాంఘిక మహాసభవారు హిందూసంఘము నీయుపద్రవము నుండి తప్పింపఁ గలిగినచో కృతార్థులగుదురనుటకు సందేహములేదు. దీనితోఁబాటు హిందూ మహమ్మదీయ సమస్య, బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య, వివిధజాతులలో శాఖల సమస్యలు మొదలగున వెన్నియో గలవు. దృఢదీక్షతో చేయ నిశ్చయించుకొన్నచో ఇవి రాజకీయములకంటెఁ గూడ ప్రధానములై రాజకీయ ముక్తికి పునాదులు. ఏడాదికి మూడు రోజుల ముచ్చట కాకుండా వీరు పనిచేయవలెననియు, వీరికి దేశీయులు తోడ్పడవలె ననియు హెచ్చరించుచున్నాము. సభ కేవలము హిందూ సంఘ సంస్కారసభగా గాక అఖిల భారత సంఘ సేవా సభగా పరిణమించినది గనుక స్థిరమగు సేవలనది చేయగలదని నమ్ముచున్నాము.

నిజమైన నగలు:—

నేటివర కొక్క హిందూదేశములకు తప్ప భారతీయాంగనల ప్రియతర సుందరాభరణంబులఁ గెదురించి నిలువుదోపుచేయగల సామర్థ్యము మానవమాత్రుల కెవ్వరికిని లేకుండెడిది. వారికైనను స్త్రీల సంతానవిషయమునకో, భర్తృసందర్భమునకో, కుటుంబ గౌరవమునకో మహాపాయము వాటిల్లినప్పుడు తప్ప వారి యొంటినగలమీఁద చేయి వేయుటకు తాహతుకాని సాహసముకాని లేకుండెడిది. ఇక రసపుత్రస్త్రీలు క్షత్రియాంగనలు రెడ్డి వెలమ కమ్మ మొదలగు రాజకులములయందలి అంగనలు ప్రాణ విసర్జన వేళలయందుతప్ప సాధారణసమయములలో యొడలి యేదువారములనగలను దీయువారేకారు. బ్యాంకింగు పద్ధతులు బలసి ధనమునకు రక్షణము వృద్ధి విధానము లేర్పడిన యీకాలమునఁగూడ, ఎవ్వరోతప్ప శరీరశృంగారమునందుకంటె ధనాభివృద్ధియందెక్కువ శ్రద్ధ గూర్చుకున్నారు. కొందరి నగలు నాజూకుతనములేని కడ్డీలు కావచ్చును, కొందరివి బంగారువెలకంటె మజూరీయే యెక్కువగానుండు మెత్తుతక్కువనగలు కావచ్చును; కాని విద్యావిహీనలగు పల్లెటూరి పడచులకు, విద్యావిలసితలగు పట్టణవాసపు బి. ఏ. యమ్మేలకుకూడ నగలయందాసక్తి భారతదేశమున తగ్గలేదు సరేగదా వీనిని చూచిన యూరేపియను యూరపియను వనితలుకూడ ఈ విలాసములకు వశ్యలగుచున్నారు.

ఇట్టి నగలపైకి పెట్టినాడు మహాత్ముడు తన దివ్యమగు దండయాత్ర. నాడు స్వరాజ్య సంపాదనా ప్రయత్నమునను, నేడు హరిజనోద్ధరణ ప్రయత్నమునను గూడ అతను ప్రప్రథమమున స్త్రీల మెడలు తడుముటకు ప్రారంభించినాడు. కేవలము నగల విక్రయమువలన వచ్చిన మొత్తము చందాలమొత్తముకంటె నెక్కువగ నుండదని యెల్లరెఱింగినదే. మహాత్ముడు కాదు అతని పితామహుడు వచ్చినను సరే, దర్శనములు దండములు స్పర్శలు కొంచెము నగల కానుకలు తప్ప నిలువుదోపులిచ్చెడి నెలతలుకూడ విస్తారము లేరని మనమెల్లరము నెఱింగిన విషయమే. అయినను నాడును నేడునుగూడ అసంఖ్యాకలగు స్త్రీలు తమయాభరణముల నొసంగిరనిన, రెండు ఉద్యమములును మన స్త్రీలయభిమానమునకును తన్మూలమున మనదేశీయుల యుత్సాహమునకును నెంతవరకు పాత్రములైనవో మనకు సుస్పష్టమగుచున్నది.

మఱియును తక్కినదేముల్లవలె మహాత్ముడు ఇప్పటికి కల్పినది గిలుబాడడమేకాక, ముందెప్పుడును చేయించుకొనరాదని మోమోటములు గఱపుచున్నాడు. కాని శ్రీమంతులెట్లును చేయించుకొనక మానరు, పేదవారీ దుర్భర దారిద్ర్యస్థితులలో నెట్లును చేయించుకొనలేరు, సామాన్యులైనను వీని యెడల కొంత వైరాగ్యము పొందగలరను నాశలేకున్నది. మహాత్ముడిదే యవకాశముగా గైకొని భరతదేశస్త్రీలకు విరాడం

ర జీవనము, అమాయిక సౌందర్యము, దరణభావము మొదలగు వానియందు శాశ్వతమగు నభిమానమును దీక్షయు గల్పింపఁ జూచుచున్నాము. భారతస్త్రీలు ఎల్లరును అనతికాలములో అట్టి మహదాశయములకు వశ్యలు కాలేకున్నను శ్రీమంతురాండ్రు తమనగలను మోసుకొనుచు గొప్పవారమని విఱ్ఱవీగకుండుటయు, పేదవారు నగలు లేకున్నంతమాత్రమున తమకు చిన్నతనమని భావించక సంతతమందహాస భూషిత వదనారవింద లగుటయు, సామాన్య స్త్రీలు తమకున్న కొంచెము ద్రవ్యమును నిష్ఫలము లగు నగలమీదనే పెట్టక లాభకరములగు వ్యవహారములయం దుంచుటయు నేర్చుకొన్నచో మహాత్ముని సంచారమువలన మహాఫలము చేకూరినదని సంతోషించవచ్చును. ఇక నిలువుదోపులిచ్చి, ఇకముం దెప్పుడును నగలను చేయించుకొనమని వాగ్దానము చేసి ఆప్రకారము మనినట్టి కీ॥ శే॥ అన్నపూర్ణాదేవియు మనుచున్న గోమతీ అమ్మాళును స్త్రీలోకమునకు నగలయందు నిర్వ్యామోహమును గఱపు ఆదర్శక రత్నము లనుటకు సందేహములేదు. మరియును దేశసేవయు దీనజనోద్ధరణమును ప్రధానమా నగలజిలుగుతళుకులు ప్రధానమా యనునప్పుడు మొదటి రెండువ్రతములే ఉత్తమస్త్రీలక్షణము లనునదికూడ మన ఆంధ్ర మహిళారత్నములు మఱువకుందురుగాక! అట్టి సుముహూర్త వేళలయందుఁ గూడ శరీరమును విడచిరానొల్లని నగలు నగలే కావు. దేశసేవా సక్తి, దీనరక్షణానురక్తియే దివ్యాభరణము లనుమాటను తెనుగు తెఱవ లెన్నడును మఱువకుందురు గాక !

హరిజనులకు ఆంధ్రులు రు 76000ల మొత్తమునకు భూరి విరాళముల నొసగినారు. ఇందులో సుమారు రు 10000 మొత్తమెనను మహిళామతల్లుల ఆభరణముల బాబతుదై యుండును. హిందూపురమునుండి మహాత్ము డాంధ్రులకు తనకడపటి సందేశము నొసంగియున్నాడు. హరిజనుల కాంధ్రపురంధ్రీరత్నములు తమ ధనములను నగలను మాత్రమే కాక వారి హృదయకవాటములను గూడ తెరవవలెనని ఆదేశించియున్నాడు. ఆంధ్రమహిళామణులొసంగిన తమశరీరముపై నుండు నగలకంటె మానసములలో పలనుండు దయ, స్నేహము, ఆదరణము మొదలగు భూషణములు హరిజనుల కెక్కువ వాంఛనీయములు. వేయిపెట్టిపోసినను ఒక్క ఆదరణవాక్యమునకు సరిగాదు. వారిపై పశుపక్ష్యాదులయందుకంటె తక్కువదృష్టిని బరవక రాకపోకల దగ్గర, మాటామంతీ సందర్భమున, పనీపాటూ చెప్పునప్పుడు సువిశాల మానవకుటుంబములో భారతజాతిలో హిందూ సంఘమునకు చెందిన సహచరులవలె చూడవలెననియే మహాత్ముని భావము. ఇట్టి ఆదరము స్త్రీలకు పెట్టని భూషణము. వారు పూనుకొన్నచో ఈ సవర్ణావర్ణ భేదము త్రుటికాలములో త్రుళ్లిపోకమానదు.

స్వర్గీయ చల్లా శేషగిరి రావుగారు:—

శ్రీయుత చల్లా శేషగిరిరావు పంతులు గారి యకాల మరణమునకు మేమెంతయు చింతించుచున్నాము. వీరు స్వతంత్రముగు న్యాయవాదివృత్తిని 16 సంవత్సరముల క్రిందట విసర్జించి ఆంధ్రపత్రికా సంపాదకత్వమునకు బూనుకొనిరి. నాటినుండి నేటివరకు సంతతధారగా అతని లేఖినిలోనుండి దేశములోని సకల ఉద్యమములకు సంబంధించిన చక్కని విమర్శనలు సలహాలు ఉత్సాహకరములగు ఉద్బోధనలు గురిసి ఆంధ్రులయుల్లములనెల్ల పల్లవింపఁ జేయుచుండెను. దేశాభివృద్ధికరములగు నుద్యమములయందెల్ల పాల్గొని పోషించుచుండుట దేశోద్ధారకుని వంతును వాటినిదిద్ది విమర్శించి చక్కఁజేయుచుండుట ఇతని వంతుగా నెంతో కాలము గడచినది. శేషగిరిరావుగారి స్వతస్సిద్ధములైన శాంతము, ఆదరము, వినయము, అభిమానము, సదాశయములే అతని వ్యవహారములయందును వ్రాతలయందును గూడ ప్రకటమగుచుండినకతన అతను సర్వజనమిత్రుడైనాడు. ఆంధ్రదేశమెల్లయు జనవరి 26-వ తేదిని అతని స్మారకదినముగా భావించి అతని ఆత్మశాంతికై ప్రార్థనలు సలుపవలెనని దేశీయనాయకులు హెచ్చరించుచున్నారు. అతను పనిచేసినన్నాళ్లు ఆంధ్రపత్రికయే తన జీవనముగ భావించి రాత్రింపగళ్లొకేదీక్షతో పనిచేయుచు జీవనమునెల్ల దానికై త్యాగముచేసిరని చెప్పవచ్చును. కనుకనే అతను కొలదిమంది సహాయసంపాదకులు మాత్రమే పొందఁగల ఉత్తమలోకమును ఉన్నత గౌరవమును పొందుచున్నారు. దుఃఖపరితప్తులైన అతని బంధువర్గమునకెల్ల మా సంపూర్ణ సానుభూతిని తెలుపుచున్నాము.

కీ॥ శే॥ పిఠల దేవుని లక్ష్మమ్మగారు:—

శ్రీయుత పిఠలదేవుని రాధాకృష్ణయ్య గారి సహధర్మపత్ని శ్రీమతి లక్ష్మమ్మగారు, డిసెంబరునెల 26-వ తేదిని ఆకస్మికముగ మరణించిరని తెలుపుట కెంతయు చింతించుచున్నాము. బీదకుటుంబమున జన్మించి ఎనిమిదవయేటనే వివాహితయై లేతవయస్సుననే యత్తవారింటి యదుపాజ్ఞలకు లోబడి వర్తించుచుండవలసిదయ్యు తెనుగునందు సంగీతమునందు సరిగ, ఊలు, గాజు మొదలగు వానితోఁజేయు నగీషీపనులయందు అత్యంతనైపుణ్యమును సంపాదించగలుగుట ఆమె బుద్ధిసూక్ష్మతను చాటుచున్నది. స్త్రీలు ఇల్లువిడిచి బయటికి వెళ్లుట నెఱుగనిదినములలో ఆమె లక్ష్మీవిలాససభను స్థాపించి స్వేపాంతోస్త్రీపన్యాసము లొసగుచుండుట ఆమె దూరదర్శనమునకు నిదర్శనము. శ్రీరామభక్తి, బంధుప్రేమ, దీనదయ ఆమెకు పెట్టని సొమ్ములు. దేవులకు నగలు సత్రములకు నిధులునొసగి తనపేరు నీభూలోకమున స్థిరపరచుకొనునది. ఈమె చరిత్రమును సంగ్రహముగ వేరొకచో ఈసంచికయందే ప్రకటించినాము. ఈమె యాత్మకు పరమేశ్వరుడు శాశ్వతానందము నొసగూర్చును గాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

ప్రథమతరగతి బంగారుపతకములను పొందిన

కేసరి

## డెంటల్ క్రీము



మృదు మధుర పరిమళ మిళితము.

దంతములను ముత్యములవలె చేయుటయేగాక పంటిజబ్బుల నన్నిటిని నివారించును.

అణాలు 8 మాత్రమే.

## కేసరికుటీరం,

ఆయుర్వేద ఔషధశాల, మదరాసు.

